జ్ఞాని పురుష్ దాదా భగవాన్ నిర్వచించిన

# భార్యాభర్తల దివ్య వ్యవహారం

(సంక్షిప్తంగా)



Telugu

ఒకరి తప్పలనొకరు మన్నించుకుంటూపోతే వైవాహిక జీవితం సుఖమయం,
'వన్ ఫ్యామిలీ' లా ప్రేమగా జీవితాన్ని సాగిస్తూవుంటే జీవితం కాదిక దుఃఖమయం.

జ్ఞాని పురుష్ దాదా భగవాన్ నిర్వచించిన

# భార్యాభర్తల దివ్య వ్యవహారం

## (సంక్షిప్తంగా)

మూల గుజరాతి సంకలనం - డా.నీరు బెహన్ అమీన్

తెలుగు అనువాదం - మహాత్మగణం

**ప్రకాశకులు** : అజీత్ సి.పటేల్
దాదా భగవాన్ విజ్ఞాన్ ఫౌండేషన్
1, వరుణ్ అపార్ట్‌మెంట్, 37,శ్రీమాలి సొసైటీ
నవరంగ్‌పురా పోలీస్ స్టేషన్ ఎదురుగా,
నవరంగ్‌పురా, అహ్మదాబాద్ – 380009
గుజరాత్, భారత్
**ఫోన్:** + 91 79 3500 2100



**First Edition** : June 2024 (500 copies)

**భావ మూల్యం** : 'పరమ వినయం', మరియు "నాకు ఎంతమాత్రం తెలియదు. అదే భావన

**Price** : Rs. 85

**ముద్రిక** : అంబా మల్టి ప్రింటింగ్
B–99, ఈలెక్ట్రానిక్స్ GIDC
క–6, రోడ్డు సెక్టర్–25
గాంధీనగర్ – 382044
గుజరాత్, India
**ఫోన్:** +91 79 3500 2142

**ISBN/eISBN** : 978-93-91375-55-3

**Printed in India**

# త్రిమంత్రం

(సర్వ విఘ్న నివారణ చేసే మంత్రం)





నమో అరిహంతాణం

నమో సిద్ధాణం

నమో ఆయరియాణం

నమో ఉవజ్ఝాయాణం

నమో లోయే సవ్వ సాహూణం

ఏసోపంచణమోక్కారో,

సవ్వాపావప్పణాసణో

మంగళా ణం చ సవ్వేసిం,

పడమం హవయీ మంగళం

ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో శివాయ

జై సచ్చిదానంద





# దాదా భగవాన్ ఎవరు?

అది జూన్ 1958 లో ఒక సాయంత్రం సమయం సుమారు 6:00, ప్రదేశం రద్దీగా ఉన్న సూరత్ పట్టణ రైల్వే స్టేషన్‌లో ప్లాట్‌ఫార్మ్ నం. 3.లో బెంచీ మీద కూర్చునివున్న శ్రీ అంబాలాల్ మూల్జీ భాయ్ పటేల్ అనే దేహమందిరంలో, ప్రకృతిపరంగా, అక్రమ రూపంలో, ఎన్నో జన్మలుగా వ్యక్తమయ్యేందుకు ఆత్రుతగా ఎదురుచూస్తున్న 'దాదా భగవాన్' పూర్ణ రూపంలో ప్రకటితమయ్యారు, ఆధ్యాత్మిక అద్భుతంలా. ఒక గంట సమయంలోనే ఆయనకు విశ్వ దర్శనం అయింది. "నేనెవరు? భగవంతుడు ఎవరు? విశ్వాన్నంతా ఎవరు నడిపిస్తున్నారు? కర్మ అంటే ఏమిటి? ముక్తి అంటే ఏమిటి?" ఇలాంటి ప్రపంచంలో ఆధ్యాత్మిక ప్రశ్నలన్నిటికీ సమాధానం వచ్చింది. ఈ విధంగా దైవం, విశ్వానికి సంబంధించిన ఒక అద్వితీయమైన పూర్ణ స్వరూప దర్శనం కావించింది, దాని ఫలస్వరూపమే శ్రీ అంబాలాల్ మూల్జీ భాయ్ పటేల్, గుజరాత్‌లోని చరోతర్ క్షేత్రంలోని భాదరణ్ గ్రామంలో పాటీదార్, ఒక కాంట్రాక్ట్ పని చేసే వ్యక్తి, అయినా కూడా సంపూర్ణ వీతరాగ పురుషుడు.

"వ్యాపారంలో ధర్మం పాటించాలి కాని, ధర్మాచరణలో వ్యాపారం చేయగూడదు" అనే సిద్ధాంతంతోనే ఆయన జీవితమంతా గడిపారు. ఆయన ఎప్పుడూ ఎవరి దగ్గరి నుంచీ డబ్బు తీసుకోలేదు సరికదా తన ఆదాయం నుంచే తీర్థయాత్రలు చేసే భక్తులకు ఆర్థిక సహాయం చేసారు.

ఆ విధంగా ఆయనకు కేవలం రెండు గంటలలోనే సిద్ధించిన అద్భుతమైన జ్ఞానాన్ని ఉపయోగించి, ఆయన ఎందరో ముముక్షువులకు ఆత్మజ్ఞానాన్ని ప్రసాదించారు. దాన్ని ఆయన అక్రమ మార్గం అని అన్నారు. అక్రమ అంటే ఒక క్రమం లేని అర్థం. క్రమం అంటే ఒక మెట్టు పైన మరో మెట్టుని క్రమంగా ఎక్కుతూ వెళ్ళటం. అక్రమ మార్గమంటే షార్ట్‌కట్‌లో లిఫ్ట్ ద్వారా పైకి చేరుకోవటం.

ఆయన "దాదా భగవాన్ ఎవరు" అన్న రహస్యాన్ని స్వయంగా చెప్తూ, "మీ ముందు కనిపిస్తున్న ఈ ఆకారం దాదా భగవాన్ కాదు. ఈయన ఎ.ఎమ్.పటేల్. మేము ఒక జ్ఞానపురుషుడను, లోపల ప్రకటితమైనది దాదా భగవాన్. దాదా భగవాన్, 14 లోకాలకు నాథుడు. ఆయన మీలో కూడా ఉన్నాడు. అందరిలోనూ ఉన్నాడు. మీలో అవ్యక్త రూపంలో ఉన్నాడు, నాలో సంపూర్ణ రూపంలో వ్యక్తమై ఉన్నాడు. ఆ దాదా భగవాన్ గారికి నేను కూడా ప్రణామం చేస్తాను".

## ఆత్మజ్ఞాన ప్రాప్తికి ప్రత్యక్ష లింక్

పరమ పూజ్య దాదా భగవాన్ (దాదాశ్రీ) కి 1958లో ఆత్మజ్ఞానం ప్రాప్తించింది. ఈ తర్వాత 1962 నుండి 1988 వరకు దేశవిదేశాలలో పర్యటించి, ముముక్షువులకు సత్సంగం, ఆత్మజ్ఞాన ప్రాప్తిని కలిగిస్తూవచ్చారు.

దాదాశ్రీ తన జీవితకాలంలోనే, పూజ్య డా.నీరూ బెహన్ అమీన్ (నీరూమా) కి ఆత్మజ్ఞాన ప్రాప్తిని కలిగించి, జ్ఞాన సిద్ధి ప్రదానం చేసారు. దాదాశ్రీ దేహాంతం తర్వాత నీరూ మా అదే ప్రకారంగా ముముక్షువులకు సత్సంగం, ఆత్మజ్ఞాన ప్రాప్తిని, నిమిత్త భావంతో కలిగించసాగారు.

ఆత్మజ్ఞాని పూజ్య దీపక్ భాయ్ దేశాయ్‌కి దాదాశ్రీ, సత్సంగం నిర్వహించే సిద్ధిని ప్రసాదించారు. ప్రస్తుతం పూజ్య నీరూ మా ఆశీర్వాదంతో పూజ్య దీపక్ భాయ్, దేశ విదేశాలలో నిమిత్త భావంతో ఆత్మజ్ఞాన ప్రాప్తిని కలిగిస్తున్నారు.

ఈ ఆత్మజ్ఞాన ప్రాప్తి కలిగిన తర్వాత వేలాదిమంది ముముక్షువులు ప్రపంచంలో జీవిస్తూనే, బాధ్యతలన్నిటినీ నెరవేరుస్తూనే, ముక్తిచెంది, ఆత్మరమణతానుభవాన్ని పొందుతున్నారు.

# విన్నపం

జ్ఞాని పురుషులు పూజ్య దాదాభగవాన్ శ్రీముఖం నుంచి వెలువడ్డ ఆధ్యాత్మిక, వ్యావహారిక జ్ఞానానికి సంబంధించిన వాణిని రికార్డ్ చేసి, దానిని సంకలన సంపాదకీయాలతో పుస్తక రూపంలో ప్రచురించటం జరుగుతుంది. వివిధ విషయాల మీద వెలువడిన అద్భుతమైన సారస్వత సంకలనాన్ని ఈ పుస్తకాలలో చూస్తారు. అవి కొత్తగా చేరిన పాఠకులకు కూడా ఒక వరంలా పనిచేస్తుంది.

ఈ అనువాదాలలో, స్వయంగా దాదాజీ వాణిలాగానే వినిపించే విధంగా ఉండేందుకు విశేష ప్రయత్నాలు జరిగాయి. ఈ కారణంగా కొన్ని సందర్భాలలో తెలుగు వ్యాకరణానికి భిన్నంగా ఉందనిపించవచ్చు. కానీ, దాని వెనుకనున్న లక్ష్యాన్ని పరిగణనలోకి తీసుకుంటే ప్రయోజనకరంగా ఉంటుంది.

ఈ పుస్తకంలో ఎన్నో చోట్ల నిఘంటువులలోని వాక్యాలు కాక, దాదాశ్రీ ఉపయోగించిన వ్యాక్యాలను ఎక్కువ స్పష్టత రావటం కోసం తీసుకుని రాయటం జరిగింది. అందువలన కొన్ని చోట్ల ఇంగ్లీషు పదాలనే దీనికి మూలమైన హిందీ పుస్తకంలో హిందీ పదాలలా రాయటం జరిగింది. అదే దాదాశ్రీ శ్రీముఖం నుంచి వెలువడిన గుజరాతీ మాటలనైతే యథాతథంగా ఇటాలిక్స్‌లో రాయటం జరిగింది. ఎందుకంటే, వాటికి సమానమైన, వాటి పూర్తి అర్థాన్నిచ్చే హిందీ పదాలు లేవు కనుక. కాకపోతే వాటికి దగ్గర్లో ఉన్న హిందీ పదాలను ఆ పుస్తకాలలో చివర్లో ఇచ్చారు.

ఒక జ్ఞాని వాక్యాలను హిందీలో అనువాదం చేయటానికి వారి వంతు ప్రయత్నం చేసామని చెప్తున్నారు. అదే ప్రయత్నం తెలుగులో కూడా జరిగింది. కాకపోతే దాదాశ్రీ అందించిన ఆత్మజ్ఞానాన్ని యథాతథంగా పొందాలంటే, దాన్ని గుజరాతీలో చదివితేనే ఆ పని పూర్తిగా జరుగుతుంది. జ్ఞానపు లోతులలోకి వెళ్ళాలంటే, ఆ వాక్యాలలోని మర్మాన్ని పూర్తిగా అవగతం చేసుకోవాలంటే గుజరాతీ భాషను నేర్చుకోమని మేమివ్వగల సలహా.

అనువాదంలోని లోపాలకు మమ్మల్ని క్షమించవలసిందిగా ప్రార్థన.

# ప్రస్తావన

విత్తు నుంచి ఏకేంద్రియాలు, ఏకేంద్రియాల నుంచి పంచేంద్రియాల వరకు జరిగిన పరిణామ క్రమం, వాటి నుంచి మానవుని పరిణామం జరిగింది. అప్పటి నుంచి ఆడ, మగ జంటగా జన్మించారు, పెళ్ళి చేసుకున్నారు, జీవితం చాలించారు. ఆ నేపథ్యంలోనే భార్యాభర్తల సంబంధమనేది ఏర్పడింది. సత్యయుగం, ద్వాపరయుగం, త్రేతాయుగాలలో సహజంగానే జీవితసరళి సరళంగా ఉన్న కారణంగా భార్యాభర్తల మధ్య జీవితంలో ఎప్పుడోకాని సమస్యలు వచ్చేవి కావు. ఇప్పుడు ఈ కలికాలంలో ఎక్కువగా అన్ని చోట్ల, ప్రతిదినం, పతి పత్ని మధ్య క్లేశాలు, జగడాలు, అభిప్రాయ భేదాలు వస్తున్నాయి. వీటిలోంచి బయటపడి ఆదర్శ దంపతులుగా ఎలా జీవించాలి, అందుకు నమూనా మార్గదర్శనం ఈ కాలంలో ఏ శాస్త్రంలో లభిస్తుంది? ఇప్పుడు ఏం చెయ్యాలి? ఈ రోజుల్లో మనుషులలోని ప్రస్తుత సమస్యలు, ఆయన భాషలోనే ఆ సమస్యలకు సమాధానం, ఈ కాలంలో అవతరించిన జ్ఞాని పురుష్ మాత్రమే ఇవ్వగలుగుతారు. అలా అవతరించిన జ్ఞాని పురుష్ పరమ పూజ్య దాదాశ్రీ, ఆయన ముప్పై సంవత్సరాల జ్ఞానావస్థలో, భార్యాభర్తల మధ్య ఘర్షణలకు సమాధానల కోసం వేసిన వేలాది ప్రశ్నలలో కొన్నిటిని సంకలనంచేసి, పుస్తక రూపంలో ప్రచురించటం జరుగుతోంది.

భార్యాభర్తల మధ్యలోని అనేక జటిల సమస్యలకు సమాధాన రూపంలో హృదయాన్ని స్పృశించే, కచ్చితమైన సమాధానాన్ని అందించే వాణిని ఇక్కడ, సుజ్ఞ పాఠకులకు, వారి వైవాహిక జీవితంలో ఒకరిపట్ల మరొకరు దేవీదేవతా దృష్టిని నిస్సందేహంగా కలుగజేస్తుంది- కేవలం హృదయపూర్వకంగా పఠించి అర్థం చేసుకుంటేనే!

శాస్త్రాలలో లోతైన తత్త్వజ్ఞానం ఉంటుంది. కాని అది భాషలోనే లభిస్తుంది. శాస్త్రాలు అంతకంటే ముందుకు తీసుకునివెళ్ళలేవు. వ్యవహారిక జీవితంలోని పంక్చర్లను అతికించటాన్నయితే, ఆ విషయంలో ఎక్స్‌పర్ట్ అనుభవజ్ఞులే నేర్పగలుగుతారు. సంపూర్ణ ఆత్మజ్ఞానులైన దాదాశ్రీ, పత్నితో ఆదర్శ సంబంధ సంపూర్ణ అనుభవాన్ని పొంది, అనుభవవాణితో సమాధానాలు చెప్తారు. అవి ఎంతో ప్రభావం కలిగించే విధంగా ఉపయోగపడుతాయి. ఈ కాలంలో అక్రమ జ్ఞాని తరపు నుంచి లోకానికి ఇది, వ్యవహార జ్ఞాన బోధ కళతో తెలియజేసిన ఒక అపూర్వమైన బహుమతి.

సంపూజ్య దాదాజీ దగ్గర ఎందరో పతి, పత్ని లోక ఇద్దరూ కలిసి వారి వారి దు:ఖమయ జీవితంలోని సమస్యలను ప్రస్తుతించారు– కొన్నిసార్లు ఏకాంతంలో అయితే మరి కొన్నిసార్లు సత్సంగంలో బహిరంగంగా. వాటిలో ఎక్కువగా ఫ్రీలీ, ఓపెన్లీ (బహిరంగంగా, స్వేచ్ఛగా) తమ తమ నిజజీవితం గురించి మాట్లాడగల, అమెరికా దేశంలో జరిగాయి. బయటకు వెలువడిన నిమిత్తాధీనులైన పరమ పూజ్య దాదాశ్రీ అనుభవవాణి సంకలనం ప్రతి ఒక్క భార్యాభర్తలకు మార్గదర్శనం చేస్తుంది. ఒకసారి భర్తను నిందిస్తే, మరోసారి భార్యను కోప్పడటం జరుగుతుంది. ఎప్పుడు ఎలా చెప్పటం అవసరమో దాన్ని పూర్తిగా ఇటు నుంచి అటు వరకు చూసిన దాదాశ్రీ దాని సారాన్ని వెలికితీసి, తన వచన బలంతో రోగాన్ని నిర్మూలిస్తారు.

సుజ్ఞ పాఠకులను ప్రార్థించేది ఏమిటంటే, దాదాజీ కేవలం స్త్రీల తప్పులనే వెతికారని తప్పుగా అర్థం చేసుకోకండి. భర్తలను కూడా తప్పుపట్టారు. భర్తను భర్తగా చేసిన తప్పిదాలను, భార్య ప్రాకృతిక తప్పిదాలను వెల్లడించిన వాణి, దాదాశ్రీ ముఖ:తా వెలువడిందే. వాటి సరైన అర్థాన్ని గ్రహించి, ఎవరికి వారు స్వయంగా శుద్ధీకరణ చేసుకునేందుకుగాను, మననం, స్మరణం చేసుకోమని పాఠకులకు వినతి.

**–డా.నీరూ బెహన్ అమీన్**

# సంపాదకీయం

పెళ్ళి చేసుకుంటూనే దొరికిందొక వంటమనిషి ఫ్రీ ఆఫ్ కాస్ట్‌లో,

ఊడ్చి, తుడిచి, బట్టలుతికే మనిషి ఉచితంగా.

24 గంటలు నర్సరీ, భర్తపట్ల సిన్సియర్

అత్తవారింటికి వచ్చింది, పుట్టింటిని, తన బంధుమిత్రులను వదిలి.

జీతం, బోనస్, కమిషన్ లేక పారితోషకాలను ఎప్పుడూ అడగలేదు

ఎప్పుడైనా ఒక చీర అడిగితే, అప్పుడు భర్తకెందుకు రావాలి విసుగులు

పిల్లలలో సగ భాగం, మరి ఎవరు చేయాలి డెలివరీ?

పేరుకి చివర తండ్రి ఇంటిపేరు, మరి దేనికిక సతాయింపు?

స్త్రీ రెండు తప్పులను మాత్రం చూడు– చరిత లేక ఇంటికి నష్టం.

వంటకం బాగోలేదా లేక గాజు సామాన్లు పగలగొట్టిందా, క్షమించేయి.

భార్య నడవడి బాగోలేకపోతే, ఆమె సుగుణాలను, త్యాగాలను చూడు.

ఇంటి కోడలిని బాగా చూసుకో, మగవాడా అదే నీ పెద్దరికం.

ఎప్పటివరకు పతి అమాయకుడు లేక బుద్ధి తక్కువవాడని అనుకుంటూ వుంటావు?

చూసుకుని ఒప్పుకునేవచ్చావు నీవు, నీ ఇష్టంతోనే!

ఇష్టపడి, పతిని కోరుకున్నావు, జీవితంలో దేవుడికంటే ఎక్కువని,

శారీరకంగా శ్రమిస్తాడు, నీ ఒడిలోకి ఓ పసికందునిస్తాడు.

రూపం, చదువు, ఎత్తులలో నీకంటే సుపీరియర్‌నే కోరుకున్నావు,

మొండితనం, వంటచెయ్యటం కాదు సూపర్‌గా ఉండు.

పెళ్ళి తర్వాత నువ్వట్లా, నువ్విట్లా అంటమెందుకు?

చివరియరని చివరివరకూ అనుకో, అప్పుడే సంసారం బాగుంటుంది.

పతియే ఇంట్లో గొప్ప, గాటకి కట్టేసిన ఆవుని కొడితే,

చివరికి విడదీసిన ఆవు భార్య వేషం కట్టింది.

యాభై సంవత్సరాల వరకు రాత్రింబవళ్ళు ప్రతి మాటకీ అడ్డుచెప్తే,

దానికి ప్రతిగా పిల్లలు అమ్మ వైపే పక్షపాతం చూపిస్తారు.

పక్షపాతం లేకుండా ఉంటూ, ఇంటివాళ్ళతో దెబ్బలు తిన్నావు,

లేచి నిలబడు, లేచి నిలబడు, ముక్తికి యోగ్యతను పొందావు.

లావుగా ఉన్న పతి ఫిగర్‌ని, గర్వపడేలా అందగత్తె కోసం వెతికాడు,

పత్నిని సరిగ్గా చూసుకుంటే, మనసుతో అతను భోగిస్తాడు.

మొదట స్కూల్లో గురువు, తర్వాత భార్య గురువయింది,

కళ్ళజోడు ముందు ఇష్టం లేదు కానీ, కళ్ళజోడామే కోడలైంది.

మనసుకి నచ్చే మనిషిని వెతకటంలో పెద్ద తప్పే జరిగింది,

పెళ్ళి చేసుకుని బాధపడ్డాడు, మోసపోవటం జరిగింది పూర్తిగా.

భార్యతో క్లేశం ఎక్కువయితే, విషయానికి ముగింపు పలుకు,

సంవత్సరాల తర్వాత ఫలితం చూస్తే, కళ్ళు తెరుచుకున్నా, విషయం ఉండదు.

బ్రహ్మచర్యాన్ని పాటించాలా, పెళ్ళి చేసుకోవాలా అన్నది నీ లక్ష్యం,

మందు ఎప్పుడు వేసుకుంటావు, జ్వరం వచ్చినపుడు- ఇద్దరికీ.

తియ్యగా ఉంది కదా అని మందుని మళ్ళీ మళ్ళీ వేసుకోకు,

నియమం ప్రకారమే, ఇద్దరికీ జ్వరం వచ్చినపుడే.

ఏకపత్నీవ్రతం అంటే దృష్టి కూడా పక్కకు మరలగూడదు,

కలియుగంలో ఇదే బ్రహ్మచర్యమంటే జ్ఞాని పురుష్ దాదా అన్నట్లు.

భార్యది వంకరది, నేను మంచివాడిని, ఇద్దరిలీ ఎవరు పుణ్యాత్ములు?

వంకర నీ పాపం వలనే, పుణ్యంతో వాలేందుకు దొరికేది తిన్నని భుజం.

తప్పెవరిది? ఎవరు జడ్జ్? అనుభవించేవారిదే అపరాధం,

ప్రకృతిలోని న్యాయం తెలుసుకో, తప్పులు నిర్మూలమౌతాయి.

మిత్రులు, ఊళ్ళో అందరితో బాగుంటావు, ఇంట్లోకొస్తే దెబ్బలాట,
జీవితం పంచుకునేవాళ్ళతో బాగుండు, అదే నీ చెయిజారిపోయింది.

బయట మర్యాద కాపాడుకుంటావు, కానీ ఇంట్లో అమర్యాదగా ఉంటావు,
వ్యతిరేక దిశలో న్యాయంచేయటమంటే బాస్మతిలో రాళ్ళు వేసినట్లే.

'నా భార్య, నా భార్య' అంటూ మమత అనే మరమేకుని బిగించావు,
'నాది కాదు, నాది కాదు' అని చూడు, లోపలి మరమేకుని తీసెయ్యి.

పెళ్ళి చేసుకుని భర్తవి అయ్యావు, నువు లేకుండా ఎలా జీవిస్తుంది?
చనిపోయిన తర్వాత ఎవరూ 'సతా' అవలేదు, ఇప్పుడెవరూ 'సతి' లేరు.

శరీరం మీద ఆసక్తే కాని, నిజమైన ప్రేమ లేదు,
తప్పుని చూడక, ఏమీ ఆశించక, ద్వేషం లేకపోతే అదే ప్రేమ అంటే.

నువ్విలాంటివాడివి, నువ్వలాంటిదానివి ఇలాంటి భేదాలవలనే విభేదాలు,
కొద్దిపాటి విభేదంతోనే, మనశ్శాంతి పటాపంచలం.

ఒక కంటిలో ప్రేమ, రెండవదానిలో నిష్కర్షగా ఉంటూ
భార్యని చూసుకుంటే, అక్కడ సంసారికి విజయమే.

ఒన్ ఫ్యామిలీలా జీవించు, నాది నీది అని అనకు,
భార్యను బాగుచేద్దామని వెళ్తావు కానీ నీ జాతంతా బాగుపడిందా?

ఆర్య మహిళ నొసటన బొట్టు, భర్త మీదనే ధ్యాసతో
ముఖమంతా రంగుదిద్దుకున్నా కానీ, పరదేశివే అవుతావు.

ఒకరి తప్పులను మరొకరు కాయండి, అదే ప్రేమమయ జీవనం,
తక్కువాకారు, ఎక్కువా కారు అన్నదే నిజమైన ప్రేమకి అర్థం.

**–డా. నీరూ బెహన్ అమీన్**

# భార్యాభర్తల దివ్య వ్యవహారం

## విషయసూచిక


| | | |
|---|---|---|
| 1. | ఒన్ ఫ్యామిలీ | 1 |
| 2. | ఇంట్లో క్లేశాలు | 3 |
| 3. | భార్యాభర్తల మధ్య అభిప్రాయ భేదాలు | 12 |
| 4. | భోజనం చేసే సమయంలో చిన్న చిన్న గలాటాలు | 28 |
| 5. | పతి కావాలి కాని, పతిత్వం వద్దు | 30 |
| 6. | ఇతరుల తప్పులెంచే అలవాటు | 36 |
| 7. | బండి వేడి మూడ్ | 39 |
| 8. | బాగుచేయాలా లేక బాగుపడాలా? | 40 |
| 9. | కామన్‌సెన్స్‌తో 'అడ్జస్ట్ ఎవిరీవేర్' | 42 |
| 10. | రెండు డిపార్ట్‌మెంట్లూ వేరువేరు | 43 |
| 11. | శంకతో కాలుతుంది బంగారు లంక | 46 |
| 12. | పతిత్వపు తప్పు | 49 |
| 13. | దాదాశ్రీ దృష్టితో నడవంటి భర్తల్లారా... | 51 |
| 14. | 'నాది' అనే మూటలు ఇలా విడిపోతాయి | 54 |
| 15. | పరమాత్మ ప్రేమకి ప్రతీక | 55 |
| 16. | పెళ్ళికి అర్థం 'ప్రామిస్ టు పే' | 59 |
| 17. | పత్నితో గొడవలు | 62 |
| 18. | పత్ని బరువుతోపాటు తిరిగిస్తుంది | 70 |
| 19. | భార్య ఫిర్యాదులు | 77 |
| 20. | విడాకుల పరిణామం | 87 |
| 21. | సప్తపది సారం | 95 |
| 22. | పతి-పత్నిల ప్రాకృతిక పర్యాయం | 98 |
| 23. | విషయం బంద్ అయినచోట ప్రేమ సంబంధం | 104 |
| 24. | ఋణానుబంధ రహస్యం... | 111 |
| 25. | జీవితంలో ఆదర్శ వ్యవహారం | 115 |

దాదా భగవాన్ నిర్వచించిన

# భార్యాభర్తల దివ్య వ్యవహారం

(సంక్షిప్తంగా)

## [1] ఒన్ ఫ్యామిలీ

జీవనాన్ని ఎప్పుడు బాగా సాగుతున్నట్లుగా అనిపిస్తుందంటే, రోజంతా ఉపాధి (బయటి నుంచి వచ్చే బాధలు) లేనప్పుడు. జీవితం ప్రశాంతంగా గడుస్తుంటే ఆ జీవనం బాగుంటుంది. ఇంట్లో క్లేశాలుంటే జీవితం ఎలా బావుంటుంది. అది మనకు నప్పదు కదా! ఇంట్లో క్లేశాలుండగూడదు. ఎప్పుడైనా పక్కింటివాళ్ళతోనో లేక బయటి మరెవరితోనో ఉంటుందేమో కానీ, ఇంట్లో కూడానా? ఇంట్లో ఫ్యామిలీ లాగా లైఫ్‌ని గడపాలి. ఫ్యామిలీ లైఫ్ ఎలా ఉంటుంది? ఇంట్లో ప్రేమ, ప్రేమ, ప్రేమమాత్రమే చిలకరిస్తూవుండాలి. ఈ కాలంలో ఫ్యామిలీ లైఫ్ అనేది ఎక్కడ ఉంది? పప్పులో ఉప్పు ఎక్కువైతే ఇల్లంతా గందరగోళం చేస్తాడు. 'పప్పు ఉప్పగా ఉంది' అంటాడు. అండర్ డెవలప్డ్ (అర్ధ వికసిత) జనం. డెవలప్డ్ (వికసిత) అని ఎవరిని అంటారంటే, పప్పులో ఉప్పు ఎక్కువైతే, దాన్ని ఒక పక్కకు పెట్టి మిగతా భోజనం చేసేవారు. ఏం అలా జరగకూడదా? పప్పునొక పక్కకి పెట్టేసి మిగిలినవన్నిటినీ తినవచ్చుగా? 'దిస్ ఈజ్ ఫ్యామిలీ లైఫ్'. బయటకు గొడవలు పడవద్దు. నా ఫ్యామిలీ అంటే అర్థం ఏమిటి? మా మధ్య ఎటువంటి గొడవలు లేవు

అని. అడ్జస్ట్‌మెంటు చేసుకోవాలి. మీ ఫ్యామిలీలో అడ్జస్ట్ అవటం రావాలి. అడ్జస్ట్ ఎవిరీవేర్.

మీకు 'ఫ్యామిలీ ఆర్గనైజేషన్' గురించి తెలుసా? మన భారతదేశంలో, 'హౌ టు ఆర్గనైజ్ ఫ్యామిలీ' అన్న జ్ఞానమే లోపం. 'ఫారిన్' వాళ్ళయితే 'ఫ్యామిలీ' అనేదాన్ని అసలు అర్థమే చేసుకోరు. వాళ్ళయితే, జేమ్స్ ఇరవై సంవత్సరాలవాడైతే, అతని తల్లిదండ్రులు విలియమ్, మేరీలు జేమ్స్‌తో, 'నువ్వు వేరు, మేము చిలకాగోరింకలం వేరు' అంటారు. వాళ్ళకి ఫ్యామిలీ ఆర్గనైజ్‌చేసే అలవాటే లేదు. వాళ్ళ ఫ్యామిలీ ఇది స్పష్టం చెప్తుంది. మేరి కి విలియమ్స్‌తో సరిపడకపోతే 'డైవర్స్' మాటే వస్తుంది. ఇక మన దగ్గర 'డైవర్స్' మాట ఎక్కడ వస్తుంది. మనం కలిసేవుంటాము. గొడవలూ పెట్టుకోవాలి, మళ్ళీ ఒకే గదిలోను కలిసి పడుకోవాలి. ఇది కాదు జీవించే పద్ధతి. దీన్ని ఫ్యామిలీ లైఫ్ అనరు.

ఇక మన దేశంలో ఫ్యామిలీ డాక్టర్‌ని కూడా పెట్టుకుంటారు. అరె, ఇప్పుడు ఫ్యామిలీయే తయారవటంలేదు, ఇక ఫ్యామిలీ డాక్టర్‌ని ఎక్కడ పెట్టుకుంటారు?

వీళ్ళు ఫ్యామిలీ డాక్టర్‌ని పెట్టుకుంటారు, కానీ అక్కడ పత్ని ఫ్యామిలీ కాదు. 'మా ఫ్యామిలీ డాక్టరు వచ్చారు' అని అంటారు. అంటే, ఆయనతో ఎటువంటి భేదాలు పెట్టుకోవద్దని. డాక్టర్ బిల్లుని పెంచేసినా సరే ఏమీ గొడవ పెట్టుకోరన్నమాట. అప్పుడంటారు, 'మా ఫ్యామిలీ డాక్టరు కదా' అని. మనసులో వాళ్ళ ఆలోచన ఎలావుంటుందంటే, మా హోదాని పెంచుకున్నాం, ఫ్యామిలీ డాక్టర్‌ని పెట్టుకున్నాం అందుకే అని.

ఫ్యామిలీలోని సభ్యుడు అలా చేస్తే అతనితో జగడమాడుతామా? లేదే! ఒక ఫ్యామిలీలా ఉండాలి. లేనిపోనివి తెచ్చిపెట్టుకోవద్దు. చూపించుకునేందుకు చేస్తుంటారే కొందరు మనుషులు, అలా వద్దు. ఒకే ఫ్యామిలీ... 'నీవు లేకపోతే నాకు బాగుండదు' అనండి. అతను మనల్ని ఏమైనా అంటే, కాసేపాగి, 'నువ్వెంతైనా తిట్టు కానీ, నాకు నువ్వు లేకుండా బాగుండదు' అనండి. ఈ గురుమంత్రం అనండి చాలు. అలా అననే అనరుగా. అనటానికి మీకు అభ్యంతరమా? నువ్వు లేకుంటే నాకు బాగుండదు.

మనసులో ప్రేమ పెట్టుకుంటారు సరే కాని, పైకి కూడా కొద్దో గొప్పో చూపించాలికూడా.

## [2] ఇంట్లో క్లేశాలు

ఇంట్లో ఎప్పుడైనా క్లేశాలుంటాయా? మీకేమనిపిస్తుంది? ఇంట్లో క్లేశాలుంటే బాగుంటుందా?

**ప్రశ్నకర్త :** క్లేశాలు లేకుండా ప్రపంచం నడవనేనడవదు.

**దాదాశ్రీ :** అయితే అక్కడ భగవంతుడనేవాడే ఉండడు. క్లేశాలున్నచోట భగవంతుడు ఉండడు.

**ప్రశ్నకర్త :** అది సరే కానీ, అప్పుడప్పుడూ ఉండాలి కదా అలా క్లేశాలు?

**దాదాశ్రీ :** లేదు. క్లేశాలనేవే ఉండగూడదు. క్లేశాలు ఎందుకుండాలి మనుషులుండే ఇళ్ళల్లో? క్లేశాలు ఎందుకుండాలి? క్లేశాలుంటే ఏమైనా బాగుంటుందా? క్లేశాలుంటే మీకు ఎన్ని నెలల వరకు బాగుంటుంది?

**ప్రశ్నకర్త :** అస్సలుండదు.

**దాదాశ్రీ :** ఒక నెల కూడా బాగుండదు కదా. మంచి భోజనం, బంగారు నగలు ధరించటం, ఆ పైన క్లేశాలుండటం. అంటే, జీవించటం చేతకానివారికే ఈ క్లేశాలుంటాయి. జీవించే కళ తెలియదు కనుకనే ఈ క్లేశాలు. మీరు ఏ కళలో నిపుణులు? డాలర్లు ఎలా సంపాదించాలన్నదానిలోనా? అంతే, ఇంతవరకే ఆలోచిస్తారు. కానీ జీవితాన్ని ఎలా సాగించాలి అన్న విషయంలో ఆలోచించరు. ఆలోచించవద్దా?

**ప్రశ్నకర్త :** ఆలోచించాలి కాని, ప్రతివారి పద్ధతులూ వేరువేరుగా ఉంటాయి కదా.

**దాదాశ్రీ :** లేదు. అందరి పద్ధతులు వేరువేరుగా ఉండవు. ఒకటే పద్ధతి. డాలర్ డాలర్! అవి చేతికి రాగానే వెయ్యి డాలర్లను అక్కడ స్టోర్‌లో ఖర్చుపెడతాడు.

వస్తువులను ఇంటికి తీసుకునివచ్చి నింపేస్తాడు. అలా అక్కడ నింపేసిన వస్తువులను చూస్తూవుండిపోతాడా? అవి పాతబడిపోతే వేరే తీసుకునివస్తాడు. రోజంతా పగిలినవి అతికించటం, పగిలినవి అతికించటం, దు:ఖం, దు:ఖం, మరింత దు:ఖం, వేదన, వేదన, మరింత వేదన. అరె అలాంటి జీవనం ఎలా జీవించటం? అలా చేయటం మనుషులకు శోభనిస్తుందా? క్లేశాలే ఉండగూడదు, కలహాలుండగూడదు. అలాంటివేమీ ఉండగూడదు.

**ప్రశ్నకర్త :** కాని, క్లేశమని దేన్ని అంటారు?

**దాదాశ్రీ :** ఓహో. ఇంట్లోవాళ్ళతో, బయటివాళ్ళతో, వైఫ్‌తో దెబ్బలాడుతుంటే దాన్ని క్లేశమంటారు. మనసులో వ్యతిరేకత వచ్చి కాసేపు దూరంగా ఉంటే దాన్ని క్లేశం అంటారు. రెండు మూడు గంటలు దెబ్బలాడుకుని తిరిగి కలిసిపోతే పరవాలేదు కానీ, దెబ్బలాడుకుని దూరంగా వెళ్ళిపోతే దాన్ని క్లేశమంటారు. పన్నెండు గంటలు దూరంగా ఉంటే రాత్రిపూట క్లేశంలో గడుస్తుంది.

**ప్రశ్నకర్త :** కలహం గురించి మాట్లాడారు కదా, అది పురుషులలో ఎక్కువగా ఉంటుందా లేక స్త్రీలలో ఎక్కువగా ఉంటుందా?

**దాదాశ్రీ :** అదైతే స్త్రీలలోనే ఎక్కువగా ఉంటుంది కలహమనేది.

**ప్రశ్నకర్త :** కారణం ఏమిటంటారు?

**దాదాశ్రీ :** అదేమిటంటే, జగడం జరిగినపుడు క్లేశం కలుగుతుంది. క్లేశం అంటే వెంటనే మండి చప్పున ఆరిపోతుంది. పురుషుడు, స్త్రీల మధ్య క్లేశం మొదలౌతే, పురుషుడు దాన్ని వదిలేస్తాడు. కానీ స్త్రీ దాన్ని అంత సులభంగా వదలిపెట్టదు. క్లేశం నుంచి కలహం పుడుతుంది. దాన్ని పురుషుడు వదిలేస్తాడు కానీ స్త్రీలు వదలరు. ఇక క్లేశం నుంచి కలహం పుట్టుకొస్తుంది. ఇక ఆమె ముఖం మాడ్చుకుని తిరుగుతుంటుంది. ఆమెను మూడు రోజుల వరకు తిండిపెట్టకుండా ఆకలితో ఉంచినట్లుగా ప్రవర్తిస్తుంది.

**ప్రశ్నకర్త :** మరి ఆ కలహాన్ని అంతం చేయటానికి ఏం చెయ్యాలి?

**దాదాశ్రీ :** క్లేశాలను మీరు రానీయకండి. ఇక కలహాలు రావు. వాస్తవానికి మీరే క్లేశం కలిగించి నిప్పు అంటిస్తారు. ఈ రోజు వంట సరిగ్గా చేయలేదు, నా నోరంతా చెడిపోయింది అని అంటూ క్లేశానికి తావిస్తారు. ఇక ఆమె కలహానికి దారితీస్తుంది.

**ప్రశ్నకర్త :** ముఖ్యమైన విషయమేమిటంటే, ఇంట్లో ప్రశాంతత ఉండటం అవసరం.

**దాదాశ్రీ :** సరేకానీ ఆ శాంతి ఎలా వస్తుంది? అమ్మాయి పేరు శాంతి అని పెట్టినా, శాంతి అనేది ఉండదు. దానికోసం ధర్మాన్ని అర్థంచేసుకోవాలి. ఇంటి సభ్యులందరితోను, 'ఈ ఇంట్లో వారికి పరస్పర వైరాలు లేవు. ఎవరికీ ఎవరితోనూ జగడం లేదు. అభిప్రాయ భేదాల అవసరం లేదు. ఉన్నదేదో పరస్పరం కలిసి పంచుకుని తిందాం, తాగుదాం. ఆనందంగా ఉండండి, సరదాగా గడపండి' అని చెప్పాలి. అలా మనందరం ఆలోచించి చేయాలి. ఇంట్లోవాళ్ళతో క్లేశాలు ఎప్పటికీ వద్దు. అదే ఇంట్లోనే ఉండాలన్నప్పుడు క్లేశాలెందుకు పనికొస్తాయి? ఇతరులను కష్టపెట్టి మనం సుఖపడటమనేది ఎప్పటికీ జరగదు. మనం ఇతరులకు సుఖాన్నందించి, మనం సుఖపడాలి. మనం ఇంట్లో సుఖాన్ని చేకూర్చితేనే మనకూ సుఖం లభిస్తుంది. ఆమె టీ అయినా సరిగ్గా పెట్టిస్తుంది. లేకపోతే అదికూడా చెడగొడుతుంది.

ఇది ఎంత చింత, సంతాపజనకం! అభిప్రాయ భేదాలు ఏమాత్రం తగ్గవు. అయినా నేను ఎంత ధర్మకార్యాలను ఆచరించాను అని మనసులో అనుకుంటారు. అరె, ఇంట్లో అభిప్రాయభేదాలు పోయాయా? తగ్గాయా పోనీ? చింత తగ్గిందా? ప్రశాంతత వచ్చిందా? ఇక అప్పుడేం చెప్తారు, నేను ధర్మకార్యాలను చేసాను కదా అనా? అరె, నువ్వు ధర్మమని దేన్ని అంటావు? ధర్మం నీ లోపల శాంతిని చేకూర్చుతుంది. ఆధి- వ్యాధి- ఉపాధి లేకపోతే అదే ధర్మం. స్వభావం (ఆత్మ) వైపు వెళ్ళటం ధర్మం అనిపించుకుంటుంది. ఈ క్లేశ పరిణామం పెరుగుతూపోతుంటుంది.

వైఫ్ చేతి లోంచి పదిహేను ఇరవై ఇంత పెద్ద గాజు డిష్‌లు, గాజు వస్తువులు కిందపడి పగిలిపోతే? ఆ సమయంలో మీ మీద దాని ప్రభావమేమైనా ఉంటుందా?

బాధ కలుగుతుంది. కనుక ఏమైనా అనకుండా ఉండలేరు. ఆ రేడియో మోగకుండా ఉండదు. బాధ కలుగగానే రేడియో మొదలౌతుంది. దానితో, ఆమె (వైఫ్) కి బాధ కలుగుతుంది. ఇక ఆమె కూడా ఏమంటుంది? ఆ. నీ చేతిలోంచి ఎప్పుడూ పడనట్లు. డిష్‌లు పడతాయన్న విషయం అర్థం చేసుకోవాలి కదా. మనం ఆమెని పగలగొట్టు అంటే పగలగొట్టదు కదా. పగలగొట్టిందా ఎప్పుడైనా? అలా ఎవరు పగలగొడతారు? ఈ ప్రపంచంలో ఏ మనిషికీ ఒక డిష్‌ని పగలగొట్టే శక్తి లేదు. ఇక్కడ లెక్కంతా తేలిపోతున్నదంతే. డిష్‌లు పగిలినప్పుడు మనం అనాల్సింది, నీకు దెబ్బేమీ తగలలేదు కదా అని.

ఒకవేళ సోఫా గురించి ఏమైనా జగడం వస్తే ఆ సోఫాని బయటపడేయండి. ఆ సోఫా మహా అయితే పది, ఇరవై వేలు చేస్తుంది. దానికోసం జగడమెందుకు? పాడుచేసిన వాళ్ళ మీద ద్వేషం పుడుతుంది. అరె బాబూ, దాన్ని పడేసి రా. ఇంట్లో జగడాలు తీసుకునివచ్చే వస్తువుంటే, దాన్ని బయటకు విసిరేసి రా.

ఎంత అర్థం చేసుకుంటే అంత శ్రద్ధ కలుగుతుంది. అంత ఫలితం ఇస్తుంది, సాయపడుతుంది. శ్రద్ధ కలుగకపోతే సాయం లభించదు. అందువలన అర్థం చేసుకుని నడిస్తే నీ జీవితం సుఖమయం అవుతుంది, వాళ్ళ జీవితం కూడా సుఖమయం అవుతుంది. మీ భార్య మీకు పకోడీలు, జిలేబీలు వండి పెట్టదా?

**ప్రశ్నకర్త :** వండిపెడుతుంది.

**దాదాశ్రీ :** మరి! ఆమె ఉపకారాన్ని గుర్తించరు. ఎందుకంటే ఆమె మన పార్టనర్ కనుక. 'అందులో ఆమె చేసిన ఉపకారమేముంది?' నేను డబ్బు తీసుకునివస్తాను, ఆమె ఆ పనులన్నీ చేస్తుంది. అందులో ఇద్దరి పార్టనర్‌షిప్ ఉంది. పిల్లలు కూడా పార్టనర్‌షిప్‌లోనే ఉంటారు. ఆమె ఒక్కరి సొంతమేమీ కారు. ఆమె జన్మనిస్తే ఆమె సొంతమన్నట్లా? పిల్లలు ఇద్దరికీ చెందినవారు. ఇద్దరికీ చెందినవారా లేక ఆమె సొంతమా?

**ప్రశ్నకర్త :** ఇద్దరివాళ్ళు.

**దాదాశ్రీ :** పురుషులు పిల్లలను కనేవారా? అంటే ఈ జగత్తుని అర్థం చేసుకోవాలి. కొన్ని విషయాలలో అర్థం చేసుకోవాలి. దాన్ని జ్ఞాని పురుష్ వివరిస్తారు. వాళ్ళకి ఇందులో ఇచ్చిపుచ్చుకునేదేమీ ఉండదు. అందువలన వాళ్ళు ఈ విషయాన్ని బాబూ, మీ ప్రయోజనంలో వివరించి చెప్తారు. దానివలన ఇంట్లో క్లేశాలు తగ్గుతాయి, వస్తువులను పగలగొట్టుకోవటాలు కూడా తగ్గిపోతాయి.

కృష్ణ భగవానుడు ఇలా అన్నాడు, బుద్ధి రెండు రకాలుగా ఉంటుంది– అవ్యభిచారిణి, వ్యభిచారిణి. వ్యభిచారిణి అంటే దు:ఖాన్ని మాత్రమే కలిగించేది, అవ్యభిచారిణి సుఖాన్ని మాత్రమే కలిగిస్తుంది. దు:ఖంలో నుంచి కూడా సుఖాన్ని వెతికితీస్తుంది. మరి బాస్మతీ బియ్యంలో రాళ్ళు కలుపుకుని తింటారు. ఇక్కడ అమెరికాలో తినటానికి ఎంత మంచి శుద్ధమైన నెయ్యి లభిస్తుంది, పెరుగు లభిస్తుంది, ఎంత మంచి భోజనం! జీవితం సరళమైనదే కాని జీవించటమే చేతకాదు. ఇక్కడే దెబ్బతింటారు మనవాళ్ళు!

మనకి ప్రయోజనకరమైనది ఏమిటన్నదైనా ఆలోచించాలి కదా! పెళ్ళి చేసుకున్నారు. ఆ రోజు కలిగిన ఆనందాన్ని గుర్తుచేసుకోండి. అది మంచిదా లేక భార్యని పోగొట్టుకున్న రోజు కలిగిన శోకాన్ని గుర్తుచేసుకుంటారా? ఏది ఉపయోగకరం?

నా పెళ్ళిరోజున నాకు భార్యను పోగొట్టుకున్న ఆలోచన వచ్చింది. అప్పుడు పెళ్ళి సమయంలో కొత్త రుమాలు కట్టారు. మేము క్షత్రియపుత్రులమని అంటారు. ఆ రోజు నేను తలపాగ చుట్టుకుని, కుర్తా వేసుకుని 15, 16 సంవత్సరాల కుర్రవాడిలా అందంగా కనిపించాను. క్షత్రియపుత్రులం అంటే బలంగా ఉండేవాళ్ళం.

తర్వాత రుమాలుని తొలగించినపుడు మనసులో అనిపించింది, పెళ్ళయితే చేసుకుంటున్నా, మంచిదే, పెళ్ళి కూడా అయిపోతోంది. కానీ ఇద్దరిలో ఒకరికైతే వైధవ్యం తప్పక వస్తుంది కదా.

**ప్రశ్నకర్త :** ఆ వయసులో మీకు అటువంటి ఆలోచన వచ్చిందా?

**దాదాశ్రీ :** ఆ. రాదా మరి. ఒక చక్రం విరిగిపోతుంది కదా? పెళ్ళి జరిగిందీ అంటే వైధవ్యం రాకుండా ఉండదు.

**ప్రశ్నకర్త :** కానీ పెళ్ళి సమయంలో మనసులో పెళ్ళి జరుగుతున్న ఉత్సాహం ఉంటుంది. ఎంత మోహం ఉంటుంది! ఆ సమయంలో అలాంటి వైరాగ్యం ఎక్కడి నుండి వస్తుంది?

**దాదాశ్రీ :** కానీ ఆ సమయంలో ఆలోచన వచ్చింది, పెళ్ళి అయింది, తర్వాత వైధవ్యమయితే వస్తుంది కూడా అని. ఇద్దరిలో ఒకరికైతే వైధవ్యం వస్తుంది. ఆమెకైనా వస్తుంది లేక నాకైనా వస్తుంది.

అందరి సమక్షంలో సూర్యనారాయణుని సాక్షిగా, అయ్యగారి సాక్షిగా, పెళ్ళి సమయంలో, పెళ్ళి చేయించే అయ్యగారు అన్నాడు, 'సమయవర్తే సావధాన్' అని. మరి నీకు జాగ్రత్తగా ఉండటం కూడా రాదా? సమయానికి అనుగుణంగా మెళకువతో ఉండాలి. 'సమయవర్తే సావధాన్' అంటాడు అయ్యగారు. ఆయనకు తెలుసు దాని అర్థం. కాని పెళ్ళి చేసుకునేవాడికి ఏం తెలుసు? మెళకువగా ఉండటమంటే అర్థం ఏమిటి? భార్య ఉగ్రంగా అయితే మీరు చల్లగా ఉండాలి, జాగ్రత్తగా ఉండాలి. 'సమయవర్తే సావధాన్' అంటే, సమయాన్నిబట్టి, సమయానుసరంగా జాగ్రత్తగా ఉండవలసిన అవసరం ఉంది. అలాంటప్పుడే ఈ ప్రపంచంలో పెళ్ళి చేసుకోవటం జరగాలి. ఆమె ఎగిరిపడుతున్నపుడు మనం కూడా ఎగిరిపడితే అది మెళకువను పోగొట్టుకోవటమే అవుతుంది. ఆమె ఎగిరిపడుతున్నపుడు మనం శాంతంగా ఉండాలి. జాగరూకత అవసరం కాదా? అంటే మనం జాగ్రత్తగా వ్యవహరించాం. మధ్యలో బీటలు పడనీయలేదు. పగుళ్ళు మొదలవగానే వెల్డింగ్ సెట్‌తో పని ప్రారంభిస్తాను.

**ప్రశ్నకర్త :** క్లేశాలకు మూల కారణమేమిటి?

**దాదాశ్రీ :** భయంకరమైన అజ్ఞానత. వాళ్ళకి ప్రపంచంలో జీవించటం చేతకాకపోవటం. పిల్లలకు తండ్రి అవటం రాకపోవటం. భార్యకు భర్త అవటం చేతకాకపోవటం. జీవించే కళ తెలియకపోవటం. సుఖం ఉన్నా కూడా ఆ సుఖాన్ని అనుభవించలేకపోవటం.

**ప్రశ్నకర్త :** కానీ, కలహం రావటానికి కారణం, స్వభావాలు కలవకపోవటం కాదా?

**దాదాశ్రీ :** అజ్ఞానం ఉండబట్టే. సంసారం అంటే అర్థమే ఒకరి స్వభావం మరొకరితో కలవదని. ఈ జ్ఞానం కలిగినవాళ్ళ దగ్గర ఒకటే మార్గం ఉంటుంది, 'అడ్జస్ట్ ఎవిరీవేర్'.

క్లేశం ఉన్నచోట భగవంతుడు ఉండనేవుండడు. అంటే మనమే భగవంతునితో, 'అయ్యా మీరు గుడిలో ఉండండి. మా ఇంటికి రాకండి. మేము మీకోసం గుడి కట్టిస్తాం కాని, మా ఇంటికి మాత్రం రాకండి' అని అన్నట్లు. క్లేశం లేనిచోట భగవంతుడు నివాసం ఉండటమనేది నిశ్చయం. ఇందుకు నేను మీకు 'గ్యారెంటీ' ఇస్తాను. క్లేశం రాగానే భగవంతుడు వెళ్ళిపోతాడు. అలా భగవంతుడు వెళ్ళిపోతే జనం మనల్ని ఏమంటారు? వ్యాపారంలో కలిసిరాలేదు అని. అరె, భగవంతుడు వెళ్ళిపోయాడు కనుక కలిసిరాదు. భగవంతుడు ఉన్నంతకాలం వ్యాపారంలో కలిసివస్తుంటుంది. మీకు క్లేశం ఉండటం ఇష్టమా?

**ప్రశ్నకర్త :** లేదు.

**దాదాశ్రీ :** అయినా అవుతుంటుంది కదా.

**ప్రశ్నకర్త :** అప్పుడప్పుడు.

**దాదాశ్రీ :** దీపావళి కూడా అప్పుడప్పుడే వస్తుంటుంది కదా. ప్రతిరోజు ఎందుకు వస్తుంది?

**ప్రశ్నకర్త :** పదిహేను నిమిషాల తర్వాత అంతా శాంతమైపోతుంది, క్లేశం పోతుంది.

**దాదాశ్రీ :** మీ లోపలి నుండి క్లేశాన్ని తొలగించండి. ఎవరి ఇంట్లో అయితే క్లేశం ఉంటుందో, అక్కడ మానవత్వం ఉండదు. ఎంతో పుణ్యం చేసుకుంటే మానవ జన్మ లభించింది– అది కూడా భారతదేశంలో మనిషిగా! మీకు ఇక్కడ (అమెరికాలో)

కాని అక్కడ భారత్‌లో శుద్ధమైన నెయ్యి వెతికినా దొరకదు. మీకేమో ఇక్కడ రోజూ శుద్ధమైనదే లభిస్తుంది. శుద్ధం కానిది వెతికినా దొరకదు. ఎంతటి పుణ్యం చేసుకున్నవారు మీరు! కానీ, ఈ పుణ్యం కూడా దురుపయోగమౌతుంది.

ఇంట్లో మనం క్లేశరహితమైన జీవితాన్ని సాగించాలి. ఆ మాత్రం కౌశలం మీలో ఉండాలి. వేరే మరేమీ రాకపోయినా అతనికి కనీసం, 'క్లేశాలుంటే మా ఇంట్లోంచి భగవంతుడు వెళ్ళిపోతాడు. అందువలన క్లేశాలుండకుండా చూడాలని నిర్ణయించుకోవాలి' అనైనా అర్థం చేసుకోవాలి. క్లేశం ఉండగూడదని మీరు కూడా నిర్ణయించుకోండి. నిర్ణయం తీసుకున్న తర్వాత క్లేశాలు వస్తే, అది వశం దాటిపోయిందని అర్థం చేసుకోవాలి. అంటే, ఆమె క్లేశం చేస్తున్నప్పటికీ మీరు కప్పుకుని పడుకోవాలి. ఆమె కూడా కాసేపటి తర్వాత పడుకుంటుంది. కానీ, మీరు కూడా ఆమెతో వాదనకి దిగితే?

క్లేశం ఉండగూడదని నిర్ణయించుకోరాదా! మూడు రోజుల కోసం అలా నిర్ణయించుకుని చూడు. ప్రయోగంలా చేస్తే తప్పేముంది? ఆరోగ్యం కోసం మూడు రోజుల ఉపవాసం చేస్తావు కదా! అలాగే ఈ నిర్ణయం కూడా తీసుకుని చూడు. ఇంట్లో మీరంతా కలిసి నిర్ణయించుకోండి, 'దాదా చెప్పిన మాట నాకు నచ్చింది. అందువలన మనం ఈ రోజు నుంచి క్లేశాలు వదిలేద్దాం' అని. ఆ తర్వాత చూడు!

**ప్రశ్నకర్త :** ఇక్కడ అమెరికాలో ఆడవాళ్ళు కూడా ఉద్యోగం చేస్తారు కదా. అందుకే కాస్త ఎక్కువ పవర్ వస్తుంది ఆడవాళ్ళకు. అందుకే హజ్బెండ్ వైఫ్ మధ్య కీచులాట ఎక్కువగా ఉంటుంది.

**దాదాశ్రీ :** పవర్ వస్తే మంచిదే కదా, కాని మీరు అర్థం చేసుకోవలసింది, 'ఓహోహో, పవర్ లేనివాళ్ళకి ఇప్పుడు పవర్ వచ్చింది కనుక నాకు మంచే జరిగింది' అని. బండి బాగా నడుస్తుందిగా. ఎడ్ల బండి ఎద్దులు ఢీలా పడిపోతే మంచిదా లేక బలంగా ఉంటేనా?

**ప్రశ్నకర్త :** కాని, పవర్‌ని తప్పుగా ఉపయోగిస్తే నడక కూడా దెబ్బతింటుంది కదా? పవర్‌ని మంచిగా ఉపయోగిస్తే సరే!

**దాదాశ్రీ :** అసలేంటంటే, పవర్‌ని ఒప్పుకోకపోతేగనక ఆమె పవర్ గోడకి కొట్టుకున్నట్లే అవుతుంది. ఆమె ఎలా అధికారం చూపిస్తుందంటే, ఎలా చూపిస్తుందంటే, కానీ, ఆ ప్రభావం మీమీద పడనప్పుడు ఆమె పవర్ అంతా గోడకి కొట్టుకుని వెనక్కి పోయి ఆమెకే తగులుతుంది.

**ప్రశ్నకర్త :** మీరనేది ఏమిటి, ఆడవాళ్ళ మాటలని విననేగూడదంటారా?

**దాదాశ్రీ :** విను, బాగా విను. మీకు పనికివచ్చే మాటయితే విను కానీ పవర్ వచ్చి తగులుతుంటే మాత్రం మౌనం వహించు. మీరు చూడవలసింది ఏమిటంటే ఎంత తాగివుండవచ్చని. తాగితే ఆ మేరకే పవర్‌ని ఉపయోగిస్తుంది కదా.

**ప్రశ్నకర్త :** సరే మరి మగవాడు కూడా తన వ్యర్థ పవర్‌ని ప్రదర్శిస్తే?

**దాదాశ్రీ :** అప్పుడు మీరు ధ్యాస పెట్టి చూసుకోవలసివుంటుంది. ఈ రోజు అంతా తలకిందులు అవుతోంది అని మనసులో అనుకోండి, నోటితో బైటకు అనకండి.

**ప్రశ్నకర్త :** ఔను. లేకపోతే ఇంకా ఎక్కువ తలకిందులౌతుంది.

**దాదాశ్రీ :** 'ఈరోజు తలకిందులుగా నడుస్తోంది' అంటుంది. ఇక ముందు అలా జరగకూడదు. ఎంత బావుంది... ఇద్దరు మిత్రుల మధ్య అలా జరుగుతుందా? అలా చేస్తే మైత్రి కొనసాగుతుందా? అదేవిధంగా ఈ స్త్రీ పురుషులను ఇద్దరినీ మిత్రులనే అంటారు. అంతే మిత్రుడనే భావనతో ఇల్లు నడపండి. దాని బదులు ఈ దశకు తీసుకునివచ్చారు. అందుకేనా గ్రీన్‌కార్డ్ వాళ్ళతో ఆడపిల్లలను పెళ్ళి చేస్తుంటారు? అలా చెయ్యటానికేనా? ఇది మనకు శోభనిస్తుందా? మీకేమనిపిస్తోంది? ఇది మనకు శోభనివ్వదు. సంస్కారవంతులని ఎవరిని అంటారు? ఇంట్లో క్లేశాలున్నవాళ్ళని సంస్కారవంతులంటారా, లేక క్లేశాలు లేనివాళ్ళనా?

అసలు ముందు ఇళ్ళల్లో క్లేశాలుండగూడదు. ఒకవేళ వస్తే వాటిని తొలగించుకోవాలి. కొద్దిగా మొదలైతే, ఇక జ్వాలాముఖి బయటకు ఉబుకుతుంది అనిపిస్తే, అలా కాకముందే నీళ్ళు చల్లి చల్లబరచాలి. ఇంతకు ముందులా క్లేశాలతో కూడిన జీవితాన్ని గడిపితే ఏమిటి లాభం? దానికి అర్థమే లేదు. క్లేశాలతోకూడిన

జీవితం ఉండకూడదు కదా? పంచుకుని ఏం తీసుకెళ్తాం? ఇంట్లో కలిసే తినటం తాగటం జరుగుతుంది కదా మరి, కలహించుకోవటం ఎందుకు? ఎవరైనా మీ పతి గురించి ఏమైనా అంటే బాగనిపించదు కదా, ఏమిటి నా భర్త గురించి ఇలా అంటున్నారు అని, కానీ మీరే మీ భర్తని 'మీరిలా, మీరలా' అని అనటం కూడదు కదా. భర్త కూడా అలా చెయ్యగూడదు. మీ మధ్య క్లేశాలుంటే దాని ప్రభావం పిల్లల మీద పడుతుంది. పిల్లల లేత మనసుల మీద ప్రభావం పడుతుంది. అందువలన క్లేశం తొలగిపోవాలి. క్లేశం పోతేనే ఇంట్లో పిల్లలు కూడా బాగుపడతారు. పిల్లలిప్పుడు చెడిపోయున్నారు.

నాకు ఈ జ్ఞానం లభించిన దగ్గరి నుండి, ఇరవై సంవత్సరాల నుంచి క్లేశమనేదే లేదు. కాని, ఆ ఇరవై సంవత్సరాల ముందు కూడా క్లేశం లేదు. ముందు నుంచే క్లేశాన్ని నేను పెరికిపడేసాను. ఈ ప్రపంచంలో ఏ సందర్భంలోనూ క్లేశానికి చోటులేదు.

ఇప్పుడు మీరు ఆలోచించి అడుగు వేయండి, లేదా 'దాదా భగవాన్' పేరు తలవండి. నేను కూడా 'దాదా భగవాన్' పేరు తలచే అన్ని పనులనూ చేస్తాను. 'దాదా భగవాన్' పేరు స్మరిస్తూనే వెంటనే మీ ధారణకు అనుగుణంగా జరిగిపోతుంటుంది.

## [3] భార్యాభర్తల మధ్య జగడాలు

మనలో క్రోధ-మాన-మాయ-లోభాలు సమూలంగా పోవాలి, జగడాలు ఉండగూడదు. మీరిక్కడ సంపూర్ణత్వాన్ని పొందాలి. ప్రకాశమానమవాలి. ఎంతకాలం చీకట్లో ఉంటారు? మీరు క్రోధ-మాన-మాయ-లోభ నిర్బలతలను, జగడాలను గమనించారా?

**ప్రశ్నకర్త :** చాలా.

**దాదాశ్రీ :** ఎక్కడ? కోర్ట్‌లోనా?

**ప్రశ్నకర్త :** ఇంట్లో, కోర్ట్‌లో అన్నిచోట్లా.....

**దాదాశ్రీ :** ఇంట్లో ఏమౌతోంది. అక్కడున్నది ముగ్గురే కదా జగడాలు ఎందుకు? ఇద్దరు, నలుగురు, ఐదుగురు కూతుళ్ళయితే లేరు కదా. మీరున్నదే ముగ్గురైతే జగడాలెందుకు?

**ప్రశ్నకర్త :** లేదు. కానీ ముగ్గురిలోనే ఎన్నో జగడాలున్నాయి.

**దాదాశ్రీ :** ముగ్గురిలోనేనా? ఔనా?

**ప్రశ్నకర్త :** జీవితంలో కాన్ఫ్లిక్ట్ (జగడాలు) లేకపోతే జీవించటంలో మజాయే రాదు.

**దాదాశ్రీ :** ఓహో. మజా దీనితో వస్తుందా? అయితే రోజూ అలాగే కానీయండి. ఇది ఎవరి ఆవిష్కరణ? ఇది ఏ ఫలవంతమైన మెదడులోని పరిశోధనా ఫలితం? అలా అయితే రోజూ జగడాలుండాలి, కాన్ఫ్లిక్ట్ మజా పొందాలంటే.

**ప్రశ్నకర్త :** అది బాగనిపించదు.

**దాదాశ్రీ :** అలా మనుషులు తమను తాము రక్షించుకున్నారు. జగడాలు చౌకా లేక ప్రియమా? తక్కువగా ఉండాలా లేక ఎక్కువగానా?

**ప్రశ్నకర్త :** తక్కువ పాళాలోనూ ఉంటుంది, ఎక్కువ పాళాల్లోనూ ఉంటుంది.

**దాదాశ్రీ :** ఒకసారి దీపావళి, ఒకసారి హోలీ. అందులో మజా వస్తుందా లేక మజా పోతుందా?

**ప్రశ్నకర్త :** సంసార చక్రమే అలా వుంది.

**దాదాశ్రీ :** లేదు. మనుషులకు వంక పెట్టుకోవటానికి ఇది చేతికి దొరికింది. సంసార చక్రం అలా ఉంది అనే వంక పెట్టుకుంటారు కానీ ఇది నా బలహీనత అనరు.

**ప్రశ్నకర్త :** బలహీనతన్నదైతే నిజమే. బలహీనత కాబట్టే కదా బాధ కలుగుతుంది.

**దాదాశ్రీ :** ఆ అంతే. సంసారచక్రం అంటూ దాన్ని కప్పివేస్తారు. కనుక అలా ఎందుకు కప్పివేసారో ఆ కారణమైతే అలాగే ఉండిపోతుంది. బలహీనత ఏమంటుంది? 'నన్ను గుర్తించనంత వరకు, నేను పోనేపోను' అంటుంది. ప్రపంచం ఏమాత్రం అడ్డంకి కాదు. ప్రపంచం అపేక్ష లేనిది. సాపేక్షికం, నిరాపేక్షకం కూడా. అది మనం అలా చేస్తే అలా, ఏం చెయ్యకపోతే ఏం లేదు. ఇచ్చిపుచ్చుకునే వ్యవహారమేమీ ఉండదు. జగడమాడటం ఎంతటి బలహీనత.

**ప్రశ్నకర్త :** కానీ ఇంట్లో భేదాభిప్రాయాలు ఉంటాయి. ఇది ప్రపంచం కదా!

**దాదాశ్రీ :** మనం అంతే. రోజూ జగడాలు జరుగుతూనేవుంటాయి కానీ, 'అలాగే నడుస్తుంటుంది' అని అంటాం. అరె, దానివలన డెవలప్‌మెంట్ (వికాసం) జరగదు. ఎందుకు అవతుంది? దేనివలన అవుతుంది? అలా ఎందుకు అంటారు? ఏం జరుగుతోంది? వీటిని శోధించాల్సివుంది.

ఇంట్లో ఎప్పుడైనా జగడం జరిగితే, దానికి ఏ మందు వేస్తావు? మందు సీసా పెట్టుకుంటావా?

**ప్రశ్నకర్త :** జగడాలకు మందే లేదు.

**దాదాశ్రీ :** ఆ ఏమంటున్నావు? మరి మీరు ఈ గదిలో మాట్లాడకుండా ఉంటారు, మీ భార్య ఆ గదిలో మాట్లాడకుండా ఉంటుంది. అలా అలిగి పడుకుంటారా? మందు వేసుకోరా? మరి అది ఎలా తగ్గుతుంది? గాయం పూడుతుందా? నాకీ సంగతి చెప్పండి. మందు వేయకుండా గాయం తగ్గుతుందా? ఉదయం టీ కప్పుని ఇచ్చేటప్పుడు గట్టిగా పెడుతుంది. దానితో మీకూ అర్థమౌతుంది రాత్రి గాయం ఇంకా తగ్గలేదని. అలా జరుగుతుందా జరగదా? ఈ సంగతి అనుభవంతో బయటపెట్టింది కాదా? మనందరం ఒకలాంటి వాళ్ళమే. అంటే, గాయం ఇంకా అలా ఉండేటట్లుగా ఎందుకు చేసారు?

కానీ, ఆ గాయం రోజూ అలాగే ఉంటోంది. గాయం నయంకాదు, గాయం అలాగే ఉండిపోతుంది కదా! మచ్చలు పడతాయి కనుక గాయాన్ని నయం అవనివ్వాలి.

ఎందుకంటే ఇప్పుడు దాన్ని అణిచిపెట్టివుంచితే, మీకు వృద్ధాప్యం వచ్చినపుడు మీ భార్య మిమ్మల్ని అణుస్తుంది. మనసులో ఇప్పుడు ఏమనుకుంటుందంటే ప్రస్తుతం బలంగా ఉన్నాడులే, కొంతకాలం నడవనీ అనుకుంటుంది. ఇక ఆమె వంతు వస్తుంది ఇక ఆమె మీకు చెప్తుంది. దానిబదులు, వ్యవహారం ఎలా ఉండాలంటే, ఆమె మిమ్మల్ని ప్రేమిస్తుంది, మీరు ఆమెని ప్రేమిస్తారు. ఇక తప్పొప్పులు ఎవరి నుంచైనా జరుగుతునేవుంటాయి కదా? తప్పొప్పులు జరగవా? తప్పిదం జరిగినంత మాత్రాన జగడపడటం ఎందుకు? దెబ్బలాట పెట్టుకోవాలనుకుంటే ఎవరైనా బలవంతుడితో దెబ్బలాటకి దిగు. మీకు వెంటనే జవాబు వస్తుంది. ఇక్కడైతే వెంటనే జవాబు ఎప్పుడూ రాదు. అందువలన ఇద్దరూ అర్థం చేసుకోవాలి. అటువంటి జగడాలు జరగనీయవద్దు. ఎవరైనా దెబ్బలాట మొదలుపెడితే, దాదాజీ ఏమని చెప్పారు అనండి. ఎందుకలా కోపం తెచ్చుకోవటం?

అభిప్రాయమనేదే పెట్టుకోవద్దు. అరె, ఇద్దరూ పెళ్ళి చేసుకున్నప్పుడు ఇద్దరి అభిప్రాయాలు వేరుగా ఎందుకుండాలి? ఇద్దరూ పెళ్ళిచేసుకున్నప్పుడు అభిప్రాయాలను వేరుగా ఉంచుకోవచ్చా?

**ప్రశ్నకర్త :** ఉంచుకోగూడదు. కానీ ఉంటాయి.

**దాదాశ్రీ :** దాన్ని మీరు తొలగించండి. వేరు వేరు అభిప్రాయాలు పెట్టుకోవచ్చా? లేదంటే పెళ్ళే చేసుకోకుండా ఉండాల్సింది. పెళ్ళి చేసుకున్నారు కనుక ఒకటి అవండి.

అంటే మీకు జీవించటమే రాలేదు. వ్యాకులతతో జీవిస్తున్నారు. 'ఒంటరివాడివా?' అంటే 'లేదు పెళ్ళయింది' అంటారు. వైఫ్ ఉంది కానీ మీ వ్యాకులత పోలేదు. ఏమిటి వ్యాకులత పోవద్దా? వీటన్నిటి గురించి నేను ఆలోచించాను. వీటి గురించి మనుషులంతా ఆలోచించవద్దా? ఎంతో విశాలమైన ప్రపంచం. కానీ ఆ ప్రపంచం మీ రూమ్ లోపలే ఉంది అనే అనుకున్నారు. మరి అక్కడే ప్రపంచం అని అనుకున్నప్పుడు అదీ మంచిదే. కాని, అక్కడ కూడా వైఫ్‌తో దెబ్బలాట పెట్టుకుంటారు.

**ప్రశ్నకర్త :** రెండు గిన్నెలుంటే చప్పుడు అవుతుంది, తిరిగి శాంతమౌతుంది.

**దాదాశ్రీ :** చప్పుడౌతుంటే బాగుంటుందా? 'కొంచెం కూడా బుద్ధి లేదు' అని కూడా అంటుంది.

**ప్రశ్నకర్త :** కానీ, మీరు తప్ప మరెవరూ నాకు నచ్చరు అని కూడా అంటుంది కదా.

**దాదాశ్రీ :** ఔను. అలా కూడా అంటుంది.

**ప్రశ్నకర్త :** కానీ ఇంట్లో గిన్నెలు చప్పుడు చేస్తాయి కదా.

**దాదాశ్రీ :** ప్రతిరోజూ గిన్నెల చప్పుడు ఏం బావుంటుంది? ఇది అర్థం చేసుకోలేదు కనుకనే నడిచిపోతోంది. జాగృతిలో ఉన్నవాళ్ళకి ఒకసారి జగడం జరిగితే రాత్రంతా నిద్రపట్టదు. ఈ గిన్నెలు (మనుషులు) కు స్పందన ఉంటుంది కనుక రాత్రిపూట పడుకునేటప్పుడు కూడా స్పందిస్తుంటారు, 'ఇది ఇలాంటిది, వంకర బుద్ధిది, వ్యతిరేకంగా ఆలోచిస్తుంటుంది, పనికిరానిది, ఇంట్లోంచి బయటకు పంపించాల్సింది' అంటూ. ఆ గిన్నెలకేమైనా స్పందన ఉంటుందా? మనవాళ్ళు అర్థం చేసుకోకుండానే 'ఔనంటే ఔను' అంటారు, రెండు గిన్నెలుంటే చప్పుడవవా అంటూ. అరె, మనమేమైనా గిన్నెలమా చప్పుడు చేయటానికి? ఈ 'దాదా' లను ఎవరూ జగడమాడటం ఎప్పుడూ చూసివుండరు! అటువంటి కల కూడా వచ్చివుండదు! దెబ్బలాడటమెందుకు? దెబ్బలాడటమనేది మనం కలుగజేసుకునే దాన్నిబట్టి ఉంటుంది. ఇందులో మరెవరి ప్రమేయమన్నా ఉందా? టీ త్వరగా రాకపోతే మీరు టేబుల్ మీద మూడుసార్లు కొట్టారు అంటే అందులో ప్రమేయం ఎవరిది? దానిబదులు ఏమీ తెలియనట్లు కూర్చునివుండండి. టీ వస్తే సరే లేదంటే ఆఫీసుకి బయలుదేరతాం. తప్పేముంది? టీ కి కూడా ఒక టైము వస్తుంది కదా. ఈ ప్రపంచం నియమానికి ఆవల లేదు కదా. అందుకే మేము దీన్ని వ్యవస్థితం అన్నాము. దాని సమయం వచ్చినపుడు టీ లభిస్తుంది. అందుకు మీరేమీ చెయ్యనక్కర్లేదు. మీరు స్పందించకపోయినా టీ వస్తుంది, స్పందించినా టీ వస్తుంది. కానీ స్పందన మూలంగా వైఫ్ బైఖాతాలో, ఆ రోజు టేబుల్ మీద కొట్టింది నమోదు అవుతుంది.

ఇంట్లో వైఫ్‌తో అభిప్రాయభేదం వస్తే దాన్ని పరిష్కరించలేరు, పిల్లలతో అభిప్రాయ భేదం వస్తే దానికి పరిష్కరించలేరు కాని, జగడం పెట్టుకుంటూవుంటారు.

**ప్రశ్నకర్త :** 'వైఫ్ సర్దుకుపోతుంది కాని నేను కాదు' అని భర్త అంటాడు కదా.

**దాదాశ్రీ :** అహ్హా. అంటే, 'లిమిట్' అయిపోయిందన్నమాట. 'వైఫ్ సమాధాన పడుతుంది కాని, మనం పడం. అంటే మన లిమిట్ పూర్తయిపోయింది. మగవాడు అయితే 'వైఫ్' ఆనందంగా ఉండాలి అని తలుస్తూ బండిని ముందుకు సాగనివ్వాలి. మీరు పదిహేను పదిహేను రోజులు, నెలల తరబడి బండిని ముందుకు పోకుండా అడ్డుకుంటారు. అలా నడవదు. ఎదుటివారి మనసు సమాధానపడేంతవరకు మీకు కష్టంగానే ఉంటుంది. కనుక సమాధానపడనివ్వండి.

ఈ విధంగా మీకు ఇంట్లో జగడాలు జరుగుతుంటే ఎలా నడుస్తుంది? 'నేను నీదాన్ని' అంటుంది స్త్రీ. 'నేను నీ వాడను' అంటాడు మగవాడు. మరి ఇక అభిప్రాయభేదాలెందుకు? మీ ఇద్దరి మధ్య 'ప్రాబ్లెమ్' పెరిగితే వేర్పాటు ఏర్పడుతుంది. 'ప్రాబ్లమ్' 'సాల్వ్' అయిపోతే, వేర్పాటు ఉండదు. బాధపడటమే విడిపోవటానికి కారణం. అందరికీ ప్రాబ్లమ్ అనేది వస్తుంది. మీకు మాత్రమే వస్తుంది అనేది ఉండదు. ఎంతమంది పెళ్ళిచేసుకున్నారో, అంతమందికీ ప్రాబ్లమ్ ఎదురవకుండా వదలలేదు.

భర్తకి అభిప్రాయభేదం ఎప్పుడు ఎదురౌతుంది? డబల్ బెడ్ ఉన్నవారికా లేక ఒకటే బెడ్ ఉన్నవాళ్ళకా?

**ప్రశ్నకర్త :** కాదు. క్షమించండి! ఒకటే కదా.

**దాదాశ్రీ :** మరి ఆమెతో జగడం వచ్చి రాత్రికి కాళ్ళతో తంతే ఏం చేస్తావు?

**ప్రశ్నకర్త :** కిందకి.

**దాదాశ్రీ :** మరి ఆమెతో కలిసివుండండి. వైఫ్‌తో కూడా అభిప్రాయభేదమైతే అక్కడ కూడా ఐకమత్యమనేది లేకపోతే మరి ఇంకెక్కడికి పోతావు? ఐకమత్యమంటే,

ఎప్పటికీ భేదాభిప్రాయమనేదే లేకపోవటం. ఆ ఒక్క మనిషితో నిర్ణయించుకోండి, 'నీకు, నాకు మధ్య జగడమనేదే రాకూడదు' అని. ఆ మాత్రం కలిసిపోవాలి. అలా కలిసిపోయారా మీరు?

**ప్రశ్నకర్త :** ఈ విధంగా ఎప్పుడూ ఆలోచించనేలేదు. మొదటిసారి అలా ఆలోచిస్తున్నాను.

**దాదాశ్రీ :** ఔను. అలా ఆలోచించటం అవసరం కదా? భగవాన్ ఎన్ని రకాలుగా ఆలోచించిన తర్వాత మోక్షాన్ని పొందాడు?

మాట్లాడుకోండి. అలా చేస్తే కాస్త తేలికౌతుంది. సంయోగం వలనే కలిసారు. లేకపోతే ఒకదగ్గర చేరరు కదా. కాబట్టి మాటలు సాగించండి. అందులో ఏమిటి అభ్యంతరం? మనమంతా ఒకటే. మనుషుల బుద్ధిలో భేదాలుంటాయి కదా. వైఫ్‌తో బుద్ధి భేదం కలుగదా?

**ప్రశ్నకర్త :** ఔను. అలా ఔతుంది.

**దాదాశ్రీ :** వైఫ్‌తో భేదం కలిగించేది ఎవరు? బుద్ధే.

స్త్రీ, ఆమె భర్త కలిసి పొరుగువారితో జగడమాడుతారు. అలాంటప్పుడు ఎలా అభేదంగా దెబ్బలాడుతారు! ఇద్దరూ చేతులు ఇలా ఇలా ఆడిస్తూ, నువ్వు అలా నువ్విలా అంటారు. ఇద్దరూ అలా చేతులాడిస్తూ మనకి అనిపిస్తుంది ఆహా! వీరిద్దరిలో ఎంత ఐక్యత అని. వీళ్ళ కార్పొరేషన్ అభేదమైనదని మనకి అనిపిస్తుంది. కానీ తర్వాత ఇంటికి వెళ్ళి ఇద్దరూ దెబ్బలాడుకుంటుంటే అందుకు ఏమంటారు? ఇంట్లో వాళ్ళిద్దరూ దెబ్బలాడుకుంటారా దెబ్బలాడుకోరా? ఎప్పుడో ఒకసారైనా దెబ్బలాడుకుంటారు కదా. ఆ కార్పొరేషన్ లోపల్లోపలే జగడం పెట్టుకుంటారు కదా, 'నువ్వలా, నువ్విలా అంటే నువ్విలా నువ్వలా' అంటూ. ఇక ఇంట్లో పెద్ద జగడమే అవుతుంది. అప్పుడు, 'నువ్వు పో ఇక్కడి నుంచి. నీ ఇంటికి పో నీ అవసరం నాకు లేదు' అంటారు. అది అజ్ఞానం కాదా? మీకేమనిపిస్తుంది? అభేదమనేది తెగిపోయింది, భేదం ఉత్పన్నమయింది అని. అంటే వైఫ్‌తో కూడా 'నువ్వా నేనా' అనేది మొదలౌతుంది.

'నువ్వు ఇలాంటిదానివి, నువ్వలాంటి దానివి' అంటే, 'నువ్వేం సరైనోడివి' అంటుందంటే ఇంట్లో కూడా నువ్వా నేనా అనేది వచ్చింది.

'నేను నువ్వు, నేను నువ్వు, నేను నువ్వు'. అంతకు ముందు ఏకమైవున్నప్పుడు, 'మేమిద్దరం ఒకటే, మేము ఇలా, మేము అలా. ఇది మాది' అంటారు. అందులోంచి 'నేను, నువ్వు' అయిపోయారు. నేను, నువ్వు విడిపోయేటప్పటికి అటు లాగటం ఇటు లాగటం జరుగుతుంది. ఆ లాక్కోవటం ఎంతవరకు తీసుకుపోతుంది? చివరకు హల్దీఘాటీ లడాయి మొదలౌతుంది. సర్వవినాశనానికి ఆహ్వానం పలికే సాధనమే ఈ అటు ఇటు లాగి గుంజుకోవటాలు. అందువలన అటూ ఇటూ లాగే పనిని ఎవరితోనూ పెట్టుకోవద్దు.

రోజంతా 'నా వైఫ్, నా వైఫ్' అంటారు కదా, ఒకసారి ఆమె తన బట్టలను అతని బ్యాగ్‌లో పెట్టిందనుకోండి! రెండవ రోజు భర్త ఏమంటాడు? 'నా బ్యాగ్‌లో నువ్వు నీ చీరలు పెట్టావెందుకు?' అని కదా. అతను గొప్ప గౌరవంగల అబ్బాయి కదా. ఆమె చీరలు ఇతన్ని కొరికేసాయి. కాని అతని అస్తిత్వం వేరుగా ఉంది కదా. వైఫ్, హజ్బెండ్ బిజినెస్ కోసం ఒకటయ్యారు! అది ఒక కాంట్రాక్ట్! వాళ్ళ వేరు వేరు అస్థిత్వాలు ఎలా పోతాయి? అస్తిత్వాలు వేరువేరుగానే ఉండాలి. 'నా బ్యాగ్‌లో చీరలెందుకు పెడతావు?' అని అంటారా లేదా?

**ప్రశ్నకర్త :** అంటారు, అంటారు.

**దాదాశ్రీ :** ఈయనేమో, 'నా బ్యాగ్‌లో నీ చీరలెందుకు పెట్టావు?' అని కలహిస్తారు. అందుకు భార్య, 'ఏ రోజైనా ఈయన బ్యాగ్‌లో ఏమైనా పెడితే అరుస్తుంటారు. పోనీలే, భర్తని ఎంచుకోవటంలో తప్పు జరిగిందనుకుంటాను. ఎక్కడ దొరికాడో ఇలాంటి మొగుడు' అంటుంది. మరి ఏం చెయ్యాలి ఇప్పుడు? గాటకి కట్టిపడేసారు. (విదేశాలలో) 'నేను' మేరి అయితే రెండవ రోజే వెళ్ళిపోయుండేదాన్ని కాని, నేను ఇండియన్ కదా, ఎలా వెళ్ళిపోగలను? గుంజకి కట్టేసారు. జగడమాడటానికి వీలే లేనిచోట జగడం పెట్టుకుంటే, జగడం పెట్టుకోగలిగిన చోట వీళ్ళు చంపేపడేస్తారు కదా!

అరె, పక్కపక్కనే బ్యాగ్‌లు పెట్టినా అంటారు, 'తీసెయ్యి నీ బ్యాగ్ ఇక్కడి నుంచి' అని. అరె, పెళ్ళయినవాడివి, పెళ్ళి చేసుకున్నావు, ఒకటయ్యారా లేదా? మరి ఏమని రాస్తారు? అర్థాంగిని అని రాస్తారు. అరె, ఏ జాతివాడివయ్యా నువ్వు? సరే మరి అర్థాంగిని అని ఎందుకు రాస్తారు? అందులో అర్థాంగం లేదు ఆ బ్యాగ్‌లో! మనం దేన్ని అపహాస్యం చేస్తున్నాము- పురుషులనా స్త్రీలనా? అలా అంటాము కదా! అర్థాంగి అనమా?

**ప్రశ్నకర్త :** అంటారు కదా!

**దాదాశ్రీ :** మరి అలా తప్పుకుంటారు తర్వాత! స్త్రీలు కలుగజేసుకోరు. స్త్రీ బ్యాగ్‌లో మీరు బట్టలు పెడితే ఆమె దాన్ని పట్టించుకోదు. ఇక్కడ చూస్తే పెద్ద అహంకారం! గర్వంలో గట్టిగా నిలబడతారు, తేలు లాగా, ఏమాత్రం మొండిగా ఉన్నా ఠక్‌మని కుట్టేయటానికి.

అలా నాకు జరిగింది అంటాను. నేను నా గతంలో జరిగింది చెప్తున్నాను. దానితో మీ అందరికీ అర్థమౌతుంది ఈయనకి ఇలా జరిగివుండవ్చు అని. మీరైతే ఈ విషయాన్ని తేలిగ్గా ఒప్పుకోరు. నేనైతే ఒప్పుకుంటాను.

**ప్రశ్నకర్త :** మీరు చెప్తుంటే అందరికీ గుర్తువస్తుంది, ఒప్పుకుంటారు.

**దాదాశ్రీ :** లేదు, మీరు ఒప్పుకోరు. కానీ నేను ఒప్పకుంటాను నా విషయంలో అలా జరిగిందని. గతంలో అలా జరగలేదా? అరె, కాటువేస్తే ఎలా వేస్తాడంటే, 'నువ్వు నీ ఇంటికి వెళ్ళిపో' అంటాడు. అరె, వెళ్ళిపోతే నీ పరిస్థితి ఎలా ఉంటుంది? ఆమె కర్మ బంధం వలన ఉంది. ఎక్కడికి పోతుంది పాపం? కానీ నువ్వన్న మాటలు వట్టిగా పోవు. దానివలన ఆమె హృదయం మీద మచ్చ పడుతుంది, ఆ తర్వాత అదే మచ్చ నీ మీద పడుతుంది. ఆ కర్మను అనుభవించవలసివుంటుంది. అతను మనసులో, ఈమె ఎక్కడికి పోతుందిలే అనుకుంటాడు. అలా మాట్లాడగూడదు. అలా మాట్లాడినట్లయితే అది తప్పే అవుతుంది కదా! అందరూ కాస్తో కూస్తో సూటిపోటి మాటలు అనేవుంటారు కదా?

**ప్రశ్నకర్త :** ఔను అన్నాం. అందరం అన్నాం. అందులో ఆరోపణలేమీ లేవు. కొద్దో గొప్పో అనివుండవచ్చు కానీ ఆరోపణలుండవు.

**దాదాశ్రీ :** అంటే, అందరూ అలాంటివాళ్ళే. ఇప్పుడు వీళ్ళంతా పెద్దవాళ్ళని అనిపించుకోవాలి. మరి చెప్పండి పెద్దవాళ్ళు ఎలా అవుతారు? చూడు ఇబ్బంది, ఇబ్బంది. ఆముదం తాగిన ముఖంలా అవుతుంది. చక్కని పరమాన్నం, మంచి భోజనం తింటారు కానీ ముఖం మాత్రం ఆముదం తాగినట్లుగా అవుతుంది. ఆముదం చాల ఖరీదైనది. (పిరమైపోయింది). ఇక ఎక్కడి నుండి తీసుకునివచ్చి తాగుతాం? ఇది వూరికే అలా ఆముదం తాగిన ముఖంలా అవుతుంది!

**ప్రశ్నకర్త :** ఇంట్లో భేదాభిప్రాయాలు పోవాలంటే ఏం చెయ్యాలి?

**దాదాశ్రీ :** అభిప్రాయ భేదాలు ఎందుకు వస్తాయి? ఈ సంగతి తెలుసుకో ముందు. ఎప్పుడైనా అలాంటి భేదాభిప్రాయాలు వస్తాయంటే, ఒక అబ్బాయి, ఒక అమ్మాయి ఉన్నారు. మరి ఇద్దరు అబ్బాయిలే ఎందుకు కలుగలేదు, ఇలాంటి అభిప్రాయ భేదాలు వస్తాయా?

**ప్రశ్నకర్త :** లేదు. మామూలుగా చిన్న చిన్న విషయాల మీద జగడాలు వస్తాయి.

**దాదాశ్రీ :** అరే, చిన్న చిన్న విషయాల మీద అంటే, అది ఇగోయిజమ్ వలన. అందువలన ఒకవేళ ఆమె 'ఇలా' అని అంటే, మీరు, 'సరే' అనండి. అలా అంటే ఇక ఏమీ ఉండదు. కాకపోతే మనం మన తెలివితేటలను మధ్యలోకి తెస్తాం. తెలివితో తెలివి దెబ్బలాట పెట్టుకుంటుంది. అందుకే అభిప్రాయభేదం వస్తుంది.

**ప్రశ్నకర్త :** 'అది సరే' అని నోటితో అనటానికి ఏం చెయ్యాలి? అలా అనలేక పోతున్నాం. ఆ అహంకారాన్ని ఎలా పోగొట్టుకోవాలి?

**దాదాశ్రీ :** అలా అనలేకపోతున్నారు.నిజం చెప్తున్నారు.దానికోసం కొన్నాళ్ళు ప్రాక్టీసు చెయ్యాలి. నేను చెప్తున్నానే, ఆ ఉపాయాన్ని అమలుచెయ్యటానికి కొన్ని రోజులు ప్రాక్టీసు చెయ్యరాదా? ఆ తర్వాత అది ఫిట్ అవుతుంది. వెంటనే అయిపోదు.

**ప్రశ్నకర్త :** భేదాభిప్రాయాలు ఎందుకు కలుగుతాయి? అందుకు కారణమేమిటి?

**దాదాశ్రీ :** భేదాభిప్రాయాలు ఎందుకు కలుగుతాయంటే ఇతను తనే తెలివైనవాడని అనుకుంటాడు, ఆమె కూడా నేను తెలివైనదాన్ని అనుకుంటుంది. ఖాళీ బస్తా సంచుల తెలివి అది. అమ్మటానికి పోతే నాలుగణాలు కూడా రావు. దాన్ని ఖాళీ బస్తా సంచుల తెలివి అంటారు. దాని బదులు మనం తెలివిగా ప్రవర్తిద్దాం. ఆమె తెలివితేటలను మనం గమనించవచ్చు. ఓహోహో ఏం తెలివి! అప్పుడు ఆమె కూడా చల్లబడుతుంది. కానీ మనకీ తెలివుంది, ఆమెకీ తెలివుంది. తెలివే దెబ్బలాటకి దిగితే అక్కడేం జరుగుతుంది?

భేదాభిప్రాయం ఎక్కువగా మీకు కలుగుతుంటుందా లేక ఆమెకి ఎక్కువగా కలుగుతుంటుందా?

**ప్రశ్నకర్త :** ఆమెకే ఎక్కువగా ఉంటుంది.

**దాదాశ్రీ :** ఏమిటి ఈ భేదాభిప్రాయం అంటే? అభిప్రాయభేదమంటే ఏమిటో మీకు వివరిస్తాను. టగ్ ఆఫ్ వార్ ఉంటుంది కదా చూసారా మీరు?

**ప్రశ్నకర్త :** ఆ.

**దాదాశ్రీ :** ముగ్గురు నలుగురు ఇటువైపు లాగుతారు, ముగ్గురు నలుగులు అటువైపు లాగుతారు. అభిప్రాయభేదం అంటే తాడుని రెండువైపుల పట్టుకుని లాగే ఆట (టగ్ ఆఫ్ వార్). కాబట్టి మనం చూడవలసింది ఏమిటంటే భార్య ఎక్కువ బలంగా లాగుతోందా అని. మనం కూడా ఇటువైపు నుంచి బలంగా లాగితే ఏం జరుగుతుంది?

**ప్రశ్నకర్త :** తెగిపోతుంది.

**దాదాశ్రీ :** తెగిపోయేటప్పటికి ముడివేయవలసివస్తుంది. అంటే ముడివేసి ముందుకు నడిపించాలి. దానికంటే దాన్ని మంచిగానే ఉంచితే ఏమిటి కష్టం? అందువలన ఆమె బాగా లాగితే మనం వదిలేయాలి.

**ప్రశ్నకర్త :** మరి ఇద్దరిలో వదిలేసేది ఎవరు?

**దాదాశ్రీ :** అర్థం చేసుకున్నవారు, ఎవరిలో తెలివి ఎక్కువగా ఉంటుందో వాళ్ళు వదిలేస్తారు, తక్కువ తెలివితేటలు ఉన్నవాళ్ళు లాగకుండా ఊరుకోరు. అందువలన మనం తెలివైనవాళ్ళం వదిలెయ్యాలి. వదిలెయ్యాలి కాని, ఒక్కసారే కాదు. ఒక్కసారిగా వదిలేస్తే అవతలివాళ్ళు కింద పడిపోతారు. కనుక, నెమ్మది నెమ్మదిగా, నెమ్మదినెమ్మదిగా వదిలిపెట్టాలి. నాతో ఎవరైనా అలా లాగినట్లయితే నేను నెమ్మదిగా వదిలిపెడతాను లేకపోతే పడిపోతారు పాపం. ఇప్పుడు మీరు అలా వదిలేస్తారా? ఇప్పుడు వదిలిపెట్టటం తెలిసింది కదా. వదిలిపెడతావు కదా! వదిలిపెట్టు. లేకపోతే తాడుకి ముడివేసి నడిపించాల్సివస్తుంది. రోజూ అలా ముడివేసుకుంటూ పోవటం ఏమైనా బావుంటుందా? మరి రోజూ ముడి వేసుకుంటూ పోవలసి వస్తుంది కదా! టగ్ ఆఫ్ వార్ ఆటని కొనసాగించాలికదా! మీకేమని అనిపిస్తోంది?

ఇంట్లో అభిప్రాయభేదాలు ఉండాలా? ఏమాత్రం ఉండగూడదు! ఇంట్లో జగడాలున్నాయంటే, యు ఆర్ అన్‌ఫిట్. హజ్బెండ్ అలా చేస్తే అతను అన్‌ఫిట్ ఫర్ హజ్బెండ్, వైఫ్ అలా చేస్తే అన్‌ఫిట్ ఫర్ వైఫ్.

**ప్రశ్నకర్త :** భార్యాభర్తల మధ్య గొడవల వలన పిల్లల మీద ఎలాంటి ప్రభావం పడుతుంది?

**దాదాశ్రీ :** ఓహోహో! చాల చెడు ప్రభావం పడుతుంది. ఇంత చిన్న పిల్లవాడైనా అలా చూస్తూ వుండిపోతాడు. నాన్న నా అమ్మతో బాగా దెబ్బలాడుతాడు. నాన్నదే తప్పంతా. కానీ అతను ఆ మాట చెప్పడు. చెప్తే నన్ను తంతారేమో అనుకుంటాడు. మనసులో అదంతా నోట్ చేసుకుంటాడు, నోటెడ్ ఇట్స్ కంటెంట్స్. కానీ ఇంట్లో అలాంటి తుఫాన్‌ని చూసిన తర్వాత మనసులో, 'పెద్దయిన తర్వాత నాన్నని కొడతాను' అనే ముద్రవేసుకుంటాడు. మన కోసం ఇప్పటి నుండే నిర్ణయించుకుంటాడు. ఇక పెద్దయిన తర్వాత కొడతాడు. 'ఏమిటి ఇలా నన్ను కొట్టేందుకే నిన్ను పెంచి పెద్ద చేసానా?' అప్పుడు, 'మరి నిన్నెవరు పెంచి పెద్దచేసారు' అంటాడు.

'అరె. అక్కడిదాకా, నా నాన్న వరకు పోయావా?' అంటే, నీ తాత వరకు కూడా పోతా' అంటాడు. అలా అనేందుకు అవకాశం ఇచ్చారు కనుకనే కదా. అలాంటి ముద్ర వేసుకోనివ్వటం మీ తప్పే కదా! ఇంట్లో కోప్పడటం ఎందుకు? వాడిని కోప్పడకపోతే పిల్లవాడు కూడా నాన్న ఎంత మంచివాడు అనుకుంటాడు.

అబ్బాయిలూ, పెళ్ళి 'వద్దు' అని ఎందుకు అంటారు? నేనతన్ని అడిగాను, 'ఏమిటి నీ సమస్య? నాకు చెప్పు. నీకు ఆడవాళ్ళే ఇష్టం లేరా? నీకు మగతనం లేదా, వాస్తవం ఏమిటో చెప్పు నాకు' అని. అప్పుడతను, 'నాకు పెళ్ళి అంటే ఇష్టం లేదు' అంటాడు. నేను అతన్ని అడిగాను 'ఎందుకు?' అని. అతను, 'పెళ్ళి వలన సుఖం లేదు. నేను చూసాను అది' అంటాడు. 'నీకా వయసే రాలేదింకా. పెళ్ళి చేసుకోకుండా నీకెలా తెలుసది, నీకా అనుభవం ఎక్కడిది?' అంటే, 'నా అమ్మ నాన్నలు ఎంత సుఖపడ్డారో చూసాను నేను. అలా వాళ్ళ సుఖమేమిటో తెలిసింది. వాళ్ళకి సుఖమే ఉండదు కనుక నేను పెళ్ళి చేసుకుంటే ఇంకా ఎక్కువ దు:ఖాన పడతాను.' అంటే అలా కూడా జరుగుతుందా?

ఇదెలాంటిదంటే, నేను, 'అన్నా, ఇప్పుడు బయట చీకటి పడింది' అంటే, 'లేదు వెలుగు ఉంది' అని అతను అంటే, 'అన్నా, దయచేసి మళ్ళీ చూడరాదు!' అని నేను అంటాను. అతను, 'లేదు వెలుగుంది' అని అంటే నాకు అర్థమౌతుంది, అతనికి ఎలా కనిపిస్తోందో అలా చెప్తున్నాడు అని. మనిషికుంటే దృష్టి కంటే ముందుకి అతని బాహ్య దృష్టి పోదు. అందువలన నేను అతనితో, మీ దృష్టిలో మీరనేది నిజం అంటాను. నాకు అంతకన్నా చేసేదేముందో చెప్పు. నేను ఇంతే అంటాను, 'యస్. యు ఆర్ కరెక్ట్ బై యువర్ వ్యూపాయింట్!' (ఔను మీరు మీ దృష్టికోణం నుంచి కరెక్ట్) అని ముందుకెళ్ళిపోతాను. అతనితో రాత్రంతా ఎక్కడ కూర్చోను? అలాంటివాళు ్ళ అలాగే ఉండిపోతారు. ఇలా భేదాభిప్రాయాలకు పరిష్కారం వెతుక్కోండి.

ఇక్కడి నుండి ఐదు వందల అడుగుల దూరంలో నేను ఒక తెల్లని గుర్రాన్ని నిలబెట్టాను అనుకోండి. ఇక్కడ ప్రతి ఒక్కరికి చూపించి, అక్కడ మీకేం కనిపిస్తోంది అని అడిగితే, ఒకతను, అక్కడ నాకు ఆవు కనిపిస్తోంది అని అంటే అందుకు ఏం

చెయ్యాలి? మన గుఱ్ఱాన్ని ఎవరైనా ఆవు అని అంటే, ఆ క్షణంలో అతన్ని మనం కొట్టాలా లేక ఏం చెయ్యాలి?

**ప్రశ్నకర్త :** కొట్టగూడదు.

**దాదాశ్రీ :** ఎందుకని?

**ప్రశ్నకర్త :** అతని దృష్టిలో అది ఆవులా కనిపించింది.

**దాదాశ్రీ :** ఔను. అతని కళ్ళజోడు అలాంటిది. పాపం అతనికి నంబర్ పెరిగిందని మీరు అర్థం చేసుకోవాలి. కాబట్టి అతని తప్పేమీ లేదు. అందువలన మీరు అతన్ని కోప్పడలేరు. అతనితో మీరు, 'బాబూ నీవనేది నిజమే' అనాలి. తర్వాత రెండవ మనిషిని అడుగు ఏం కనిపిస్తుందని. అతను గుఱ్ఱం కనిపిస్తోంది అని అంటాడు. అప్పుడు మీరు అర్థం చేసుకోవాలి అతనికి నంబర్ లేదని. మళ్ళీ మూడవ మనిషిని అడుగు ఏం కనిపిస్తోందని. 'అది ఎద్దులా కనిపిస్తోంది' అని అంటే మనకి అతని కళ్ళజోడు నంబర్ అర్థమౌతుంది. కనిపించలేదు అంటే నంబర్ ఉందని అర్థం చేసుకోవాలి. మీకేమనిపిస్తోంది?

నేను పెళ్ళి చేసుకుని యాభై ఐదు సంవత్సరాలయింది. కనుక ఇరవై ఐదు, ముప్పై సంవత్సరాల వరకు, జ్ఞానానికి ముందు ఏమైనా తప్పొప్పులు జరిగివుండవచ్చు. చిన్నతనంలో, నేను కూడా కొన్ని సంవత్సరాల వరకు పట్టుకారు తీసుకుని ఇలా గట్టిగా విసిరేసేవాడిని. గౌరవంగా బ్రతికినవాళ్ళం కదా! వంశం! ఆరు గ్రామాలకు పటేలు. తర్వాత తెలిసింది నా వంశం అంతరించింది. గౌరవం కాస్తా వేలంలో పోయింది. పట్టుకారు కొట్టినప్పుడే గౌరవం పోయింది అనొచ్చా? భార్యని పట్టుకారుతో కొడతారా మనవాళ్ళు? తెలివితక్కువ బస్తాసంచులు. మరింకేమీ దొరకలేదా పట్టుకారుతో కొట్టారు? ఇదేమైనా శోభనిస్తుందా మనకి?

**ప్రశ్నకర్త :** పట్టుకారు కొట్టారంటే ఒకసారి కొట్టగానే అయిపోయింది. అంతరంగ భేదాభిప్రాయాలు బిహేవియర్‌లోకి పరిణితి చెందుతాయి. అది భయంకరమని అనవచ్చు కదా?

**దాదాశ్రీ :** అంతరంగ భేదాభిప్రాయాలా, అవి చాల భయంకరమైనవి.

అయితే నేను వెతికిచూసాను ఈ అంతరంగ భేదాభిప్రాయలకు ఏమైనా ఉపాయం ఉందేమో అని. ఏ శాస్త్రంలోను అది దొరకలేదు. నేనే పరిశోధించి, నేను నా అభిప్రాయాలనే వదిలేస్తాను, ఇక అభిప్రాయభేదమనేదే ఉండదు, దాని ఉపాయం ఇంతేనని తెలుసుకున్నాను. నాకో అభిప్రాయమనేదే లేదు. మీ అభిప్రాయమే నా అభిప్రాయం.

ఒకసారి నా హీరా బా తో నాకు అభిప్రాయభేదం వచ్చింది. నేను ఇరుక్కుపోయాను. నా వైఫ్‌ని నేను 'హీరా బా' అని పిలుస్తాను. మేము జ్ఞాని పురుషులం అందరినీ 'బా' అనే పిలుస్తాం. మిగతావాళ్ళు అందరూ కూతురుగా పిలవబడతారు. వింటానంటే చెప్తాను. ఇదేమీ సుదీర్ఘమైన విషయం కాదు. చిన్న మాటే.

**ప్రశ్నకర్త :** ఆ. చెప్పండి ఆ విషయం.

**దాదాశ్రీ :** ఒకసారి అభిప్రాయ భేదం వచ్చింది. అందులో తప్పు నాదే, ఆమె తప్పు కాదు.

**ప్రశ్నకర్త :** అది ఆమెదే అయ్యుంటుంది. కానీ మీరు, అది నా తప్పు అనే అంటారు.

**దాదాశ్రీ :** ఆ. కానీ ఆమె తప్పు కాదు. నా తప్పు. నేనే భేదాభిప్రాయాన్ని తీసుకుని రాకుండా వుండాల్సింది. ఆమెదయినా ఏం పరవాలేదు, ఆమెది కాకపోయినా కూడా పరవాలేదు. నేను (అభిప్రాయభేదం) తీసుకునిరాకుండా వుండాల్సింది. కనుక అది నా తప్పే అనిపించుకుంటుంది కదా. దీన్ని ఇలా అంటే కుర్చీకి తగిలిందా లేక నాకా?

**ప్రశ్నకర్త :** మీకే.

**దాదాశ్రీ :** కాబట్టి నేను అర్థం చేసుకోవలసింది కదా.

ఇక ఒక రోజు ఆమెతో అభిప్రాయభేదం వచ్చింది. నేను ఇరుక్కుపోయాను. 'నా అన్న కూతుళ్ళు నలుగురు పెళ్ళి కావలసివున్నారు. వాళ్ళల్లో ఇది మొదటి అమ్మాయి

పెళ్ళి కదా మనం పెళ్ళిలో ఏమివ్వాలి' అని అడిగింది నన్ను. అయితే, అలా అడగకపోతే బావుండేది. ఏమిచ్చినా నేను అందుకు వద్దని అనేవాడిని కాను. నన్ను అడగబట్టి నేను నా బుద్ధినిబట్టి నడుచుకున్నా. ఆమెకున్న తెలివి నాకెక్కడుంది? ఆమె అడిగింది కాబట్టి నేను, 'ఈ అల్మైరాలో వెండివి ఉన్నాయి కదా, వాటిని ఇచ్చేయి కొత్తవి చేయించకుండా. వెండి వస్తువులు చిన్న చిన్నవి ఉన్నాయి అల్మైరాలో. వాటిలో కొన్నిటిని ఇవ్వు' అన్నాను. దానికి ఆమె ఏమందో తెలుసా? మా ఇంట్లో 'నాది, నీది' అనే పదాలను ఉపయోగించం. 'మనది, మనవి' అనే అంటాము. అప్పుడామె ఇలా అన్నది, 'మీ మామయ్య కూతుళ్ళ పెళ్ళికి ఇంతింత పెద్ద పెద్ద కంచాలు ఇచ్చారు కదా!' ఆ రోజు 'నాది, మీది' అనే మాట ఎత్తింది. మాములుగా అయితే 'మనది' అనే అంటుంది. నాది, నీది అనే భేదంతో మాట్లాడదు. నాకనిపించింది, 'నేను ఇరుక్కుపోయాను' అని. నాకు వెంటనే అర్థమైంది కనుక, అందులోంచి బయటపడే మార్గాన్ని వెతకటం మొదలుపెట్టాను. ఇప్పుడీ పరిస్థితిని ఎలా చక్కదిద్దను? రక్తం కారుతూవుందంటే రక్తం ఆగటానికి కట్టు ఎలా కట్టాలి అన్నది నాకు తెలుసు.

అంటే, ఆ రోజు 'నీది, నాది' అనేది వచ్చింది. 'మీ మామయ్య కూతుళ్ళు' అన్నది. ఈ పరిస్థితికి వచ్చిందంటే నా తెలివితక్కువతనం ఇంత తేడాగా ఉంది. ఈ రోజు దెబ్బ తినే స్థితి వచ్చింది అనుకున్నా. అందుకని నేను వెంటనే మాట మార్చేసా. మాట మార్చటం తప్పేమీ కాదు. అభిప్రాయభేదం కంటే మాట మార్చటమే మేలు. వెంటనే పూర్తిగా మాటమార్చాను. 'నేను అలా అందామనుకోలేదు' అన్నాను. నేను అబద్ధం చెప్పాను. 'నా చెప్పదలచుకున్నది వేరు. నువ్వు అర్థం చేసుకోవటంలో కాస్త తప్పు జరిగింది. నేను అనేది అది కాదు' అన్నాను. 'మరి ఏమంటున్నారు?' అంది. అప్పుడు నేను, 'ఈ వెండి వస్తువులు చిన్నవి ఇచ్చి, ఇంకా ఐదు వందలు నగదు ఇవ్వు. అవి వాళ్ళకి పనికొస్తాయి' అన్నాను. 'మీరు చాల అమాయకులు. ఇంత ఎవరైనా ఇస్తారా?' దానితో నాకు అర్థమైంది నేను గెలిచానని. మళ్ళీ నేను, 'అయితే ఎంత ఇవ్వాలనిపిస్తే అంత ఇవ్వు. నలుగురు అమ్మాయిలు మన పిల్లలే కదా' అన్నాను. ఇక ఆమె సంతోషపడింది. 'దేవుడిలాంటివారు మీరు' అంది.

చూడు మరి కట్టు కట్టాను కదా. నాకు తెలుసు ఐదు వందలు ఇవ్వమంటే అలా చెయ్యదు. ఇక ఆమెకే వదిలిపెట్టాను కదా. నాకు స్వభావం తెలుసు. నేను ఐదు వందలిస్తే ఆమె మూడు వందలే ఇస్తుంది. మరి చెప్పండి. అధికారం ఆమెకి ఇవ్వటం వలన నాకు నష్టమేమిటి?

## [ 4 ] భోజన సమయంలో కీచులాట

ఇంట్లో ఎందుకలా జోక్యం చేసుకుంటారు? మనిషులు తప్పు చేయరా ఏమిటి? పనిచేసేవాళ్ళు తప్పులు చేస్తారా లేక చేయనివాళ్ళా?

**ప్రశ్నకర్త :** చేసేవాళ్ళు.

**దాదాశ్రీ :** అలాంటప్పుడు, 'కడీలో ఉప్పు ఎక్కువైంది' అని తప్పులెంచగూడదు. ఆ కడీని పక్కకు పెట్టి, మిగతావేవైతే ఉంటాయో వాటిని తినాలి. ఎందుకంటే అతనికి అలవాటు భార్య చేసే పనులలో ఏదో ఒక తప్పు వెతకి చూపించి బెదిరించటం. ఇది అతని అలవాటు కదా అందుకే. అయితే ఆ సోదరి కూడా తక్కువదేమీ కాదు. అమెరికా అలా చేస్తే, రష్యా ఇలా చేస్తుంది. అంటే అమెరికా, రష్యా లాగా అయిపోయింది ఇది, కుటుంబంలో, ఫ్యామిలీలో. అందువలన నిరంతరం కోల్డ్‌వార్ నడుస్తుంటుంది. అలా వద్దు. ఫ్యామిలీలా ఉండు. నేను మీకు చెప్తాను ఫ్యామిలీలా ఎలా ఉండాలన్నది. ఇదంతా ఇంటింటి క్లేశాలు.

'కడీలో ఉప్పు ఎక్కువ అయింది' అని మీరు అనకపోతే నడవదా? ఒపీనియన్ ఇవ్వకపోతే వాళ్ళకి అర్థం కాదా, మనం చెప్పాల్సిందేనా? మీ ఇంటికి అతిథులు వచ్చివున్నారు కదా, అతిథులను కూడా తిననివ్వరా? మనమెందుకు ఇలా తయారయ్యాం? ఆమె తింటే ఆమెకి తెలియదా, అది కూడా ఢంకా బజాయించి చెప్పాలా?

**ప్రశ్నకర్త :** కడీలో ఉప్పు ఎక్కువయితే ఉప్పగా ఉన్నదని చెప్పాలి కదా?

**దాదాశ్రీ :** ఇక జీవితమే ఉప్పగా అయిపోతుంది కదా! అది ఉప్పగా ఉందని చెప్పి ఎదుటివారిని అవమానిస్తున్నారు. దాన్ని ఫ్యామిలీ అనరు.

**ప్రశ్నకర్త :** సొంత మనుషులకే చెప్పగలుగుతాం కదా, పరాయివాళ్ళకి ఎలా చెప్తాం?

**దాదాశ్రీ :** అంటే, సొంత మనుషులైతే బాధ కలిగించాలా?

**ప్రశ్నకర్త :** చెప్తే రెండవసారి సరిగ్గా చేస్తుంది కదా అందుకే.

**దాదాశ్రీ :** ఆమె సరిగ్గా చేసిందా, చేయలేదా అన్నది ఒట్టి మాట. అది దేని ఆధారంగా జరుగుతుంది? అది నాకు తెలుసు. చేసేవారి చేతిలో అధికారం లేదు. మీకు, అనేవాళ్ళకి కూడా అధికారం లేదు. ఇదంతా ఎవరి ఆధీనంలో నడుస్తోంది? అందువలన ఒక అక్షరంముక్క కూడా అనటానికి లేదు.

నువ్వు కాస్త తెలివైనవాడవయ్యావు కదా. ఇప్పుడు కాస్త తెలివైనవాడవయ్యావా లేదా? తెలివి రావాలి. సంపూర్ణంగా తెలివి రావాలి. ఇంట్లో భార్య, 'అరె, ఇలాంటి భర్త మళ్ళీ మళ్ళీ దొరకాలి' అనాలి. ఇప్పటి వరకు నాకు ఒకామే చెప్పిందీ మాట, 'దాదాజీ, భర్త దొరికితే సరిగ్గా ఇలాంటివాడే దొరకాలి' అని. నువ్వు కేవలం అలా దొరికావు. లేకపోతే చాలవరకు ముఖం ముందు మంచివాడు అంటుంది, వెనక తిట్టిపడేస్తుంది. 'నా ఉద్దేశ్యంలో' అనే ఆమె కూడా కనిపించింది.

స్త్రీ విషయానికి వస్తే ఎక్కువగా కట్టడులు చెయ్యగూడదు. 'కూరెందుకు చల్లబడిపోయింది, పప్పులో పోపెందుకు సరిగ్గా వేయలేదు' ఇలాంటి గొడవలెందుకు పెడతావు? పన్నెండు నెలల్లో ఒకటో అరో అంటే పరవాలేదు. కానీ ఇలా రోజా? 'మామ మర్యాదగా ఉంటే కోడలు బిడియపడతూ వుంటుంది' మీరు పద్ధతిగా ఉండాలి. పప్పు సరిగ్గా అవలేదు, కూర చల్లారిపోయింది అంటే అవన్నీ నియమం ప్రకారం జరుగుతాయి. ఒకవేళ చాల ఎక్కువగా జరిగి, ఎప్పుడైనా చెప్పాల్సివస్తే, నెమ్మదిగా అనాలి, 'ఈ కూర రోజూ వేడిగా ఉంటుంది కదా, అప్పుడు చాల రుచిగా ఉంటుంది' అని ఈ విధంగా అంటే ఉద్దేశ్యం అర్థం చేసుకుంటుంది.

ఇక్కడ ఇంట్లో 'దాదా' కి ఇది ఇష్టం అవుతుందా అవదా అన్న విషయం తెలియదు. వంట చెయ్యటం అంటే వంటచేసేవారి చేతిలో ఉంటుందా? తినేవాడి 'వ్యవస్థితం' ప్రకారం కంచంలోకి వస్తుంది. అందులో జోక్యం చేసుకోగూడదు.

## [5] పతి కావాలి కాని, పెత్తనం వద్దు

పెళ్ళిచేసుకునే ముందు అమ్మాయిని చూస్తానంటే చూడు. చూడు కానీ, జీవితమంతా అలాగే ఉండేదైతే చూడు. అలాగే ఉండిపోతుందా? ఎలా చూసారో అలాగే? మార్పు రాకుండా ఉంటుందా? మార్పు జరుగుతుంది కదా, అది సహించలేరు, వ్యాకులత కలుగుతుంది. ఎలా తప్పించుకోగలరు? మీరు ఇరుక్కుపోయారన్నా ఇరుక్కుపోయారు.

మరి పెళ్ళి అనేది ఎందుకు? మీరు బయటకు పోయి సంపాదించి తీసుకురండి, ఆమె ఇంటి పని చేస్తుంది, మీ కుటుంబాన్ని నడిపిస్తుంది, దానితోపాటు ధర్మకార్యాలు చెయ్యవచ్చు. అందుకే పెళ్ళి చేసుకునేది. ఒకరిద్దరు పిల్లలు ఉండాలి అని భార్య అంటే, ఆ పని పూర్తిచెయ్యి, ఇక ఆపై రామా అంతా నీ మాయ. కానీ, ఇక్కడీయన మొగుడు అవటానికి పోతాడు. అరె, ఎందుకు మొగుడు అవటం? నీ చేతిలో ఏ శక్తీ లేదు కాని మొగుడు అవటానికి పోతావు. 'నేను భర్తని' అంటాడు. పెద్ద వచ్చాడొక మొగుడు! ముఖం చూడు ఈ మొగుళ్ళది! కాని మనుషులు పతిపెత్తనం చూపిస్తుంటారు కదా?

ఆవులకు యజమానిగా ఉంటావు, గేదెలకు కూడా. కానీ ఆవులు కూడా నిన్ను యజమానిగా స్వీకరించవు. మీరేమిటంటే, మనసులో అనుకుంటుంటారు ఈ ఆవు నాది అని. పత్తిని కూడా నాది అంటారు మీరు 'ఇది నా పత్తి'. పాపం ఆ పత్తికి ఈ విషయం తెలియనుకూడా తెలియదు. మీదే అయితే మీరు చూస్తున్నప్పుడే పెరగాలి, మీరు ఇంటికపోగానే పెరగకూడదు. కానీ ఈ పత్తి రాత్రిపూట కూడా పెరుగుతుంది. పత్తి రాత్రిపూట పెరుగుతుందా పెరగటం లేదా?

**ప్రశ్నకర్త :** పెరుగుతుంది.

**దాదాశ్రీ :** వాటికి మీ అవసరం లేదు. వాటికి అవసరం వర్షం. వర్షం పడకపోతే పాపం అది ఎండిపోతుంది.

**ప్రశ్నకర్త :** కానీ దాని మీద మనం పూర్తిగా ధ్యాసపెట్టి చూసుకోవద్దా?

**దాదాశ్రీ :** ఓహోహో, భార్యని ధ్యానపెట్టి చూసుకోవటానికి తెచ్చుకున్నారా?

**ప్రశ్నకర్త :** అందుకే కదా భార్యని ఇంటికి తీసుకునివచ్చాం!

**దాదాశ్రీ :** భర్తగా పెత్తనం చెలాయించవద్దని అన్నారు శాస్త్రకారులు. వాస్తవానికి నువ్వు పతివి కావు, నీ పార్టనర్‌షిప్. వ్యావహారికంగా ఇక్కడ అంటూవుంటాం పతి-పత్ని అని, వరుడు-వధువు అని. కాని, నిజానికిది పార్టనర్‌షిప్. పతి అయినంత మాత్రాన మీకు దావా వేయగల హక్కేమీ లేదు. దావా చెయ్యలేరు. అర్థమయ్యేటట్లు చెప్తూ పనులు పనులన్నిటినీ సాగనీ.

**ప్రశ్నకర్త :** కన్యాదానం చేసారంటే, దానంలో కన్యని ఇచ్చారు కదా. అందువలన ఆమె పతియే కదా అవుతాము?

**దాదాశ్రీ :** అది నాగరిక సమాజం చేసే పని కాదు, అది వైల్డ్ (ఆటవిక) సమాజ విధానం. నాగరిక సమాజంగా మనం చేయవలసింది, భార్యకి ఎటువంటి కష్టమూ కలుగకుండా చూసుకోవటం. లేకపోతే మీరు సుఖపడరు. భార్యని దు:ఖపెట్టి ఎవరూ సుఖపడలేదు. అలాగే, ఏ స్త్రీ అయినా భర్తకి ఏమాత్రం దు:ఖం కలిగించిన ఆ ఎప్పుడూ స్త్రీ సుఖపడలేదు.

పతి అనే పెత్తనం కారణంగానే అతను నెత్తి మీద ఎక్కి కూర్చుంటాడు. భర్త పెత్తనం సాగించటమనేది భోగవటా (సుఖదుఖాల ప్రభావం), అది పార్టనర్‌షిప్. వైఫ్‌తో ఉండేది పార్టనర్‌షిప్ కాని యాజమాన్యం కాదు.

**ప్రశ్నకర్త :** ఈ వైఫే బాస్ అయ్యి కూర్చుంటుంది, మరి దానికేం చెయ్యాలి?

**దాదాశ్రీ :** అదేం పరవాలేదు. ఆమె జిలేబీ, పకోడీ వండిపెడుతుంది కదా! మనం ఆహాహా అనాలి. నువ్వు నాకు పకోడి, జిలేబీలు వండిపెట్టావు కదా అనాలి. అలా చేస్తే ఆమె సంతోషపడుతుంది. తెల్లవారికి తిరిగి చల్లబడిపోతుంది, దానంతటదే. ఆ విషయంలో గాభరాపడవద్దు. ఆమె మన మీద సవారీ ఎప్పుడు చేస్తుంది? ఆమెకు

మీసాలు మొలిచినప్పుడు, ఆమె సవారీ చేస్తుంది. కానీ మీసాలు వస్తాయా ఏమిటి? ఎంత తెలివిమీరినా మీసాలు రావు.

ఇకపోతే, ఒక జన్మలో మీకు ఎంత రాసిపెట్టుందో అంత జరుగుతుంది. అంతకంటే పెద్ద లెక్కేమీ ఉండబోదు. ఒక జన్మలో రాసిపెట్టివుంది నిశ్చయంగా జరిగేదే కదా మరి ప్రశాంతచిత్తంతో ఉండరాదా?

హిందువులు మూలంలోనే క్లేశపూర్ణ స్వభావం కలిగివుంటారు. మరి కొందరు ఎంత బాగా ఉంటారంటే, బయట జగడాలు పెట్టుకున్నా, ఇంట్లో భార్యతో జగడం పెట్టుకోరు. కొందరైతే భార్యను ఉయ్యాలలో ఊగిస్తారు కూడా.

**ప్రశ్నకర్త :** ఆయన ఉయ్యాల ఊగించారే మియ్యా భాయ్! ఆ విషయం చెప్పండి!

**దాదాశ్రీ :** ఒకసారి ఒక మియ్యాభాయ్ దగ్గరికి పోయాను. ఆ మియ్యాభాయ్ భార్యను ఉయ్యాల ఊగిస్తున్నాడు. అది చూసి నేను, 'మీరు ఇలా చేస్తే ఆమె తలమీద ఎక్కి సవారీ చెయ్యదా?' అని అడిగాను. అప్పుడతను, 'ఆమె ఏం సవారీ చేస్తుంది? ఆమె దగ్గర ఆయుధాలేమీ లేవు' అన్నాడు. 'మా హిందువులకైతే భయం భార్య సవారీ చేస్తే ఎలా అని. అందుకే ఉయ్యాల ఊగించం' అన్నాను. అప్పుడు ఆ మియ్యాభాయ్ ఇలా అన్నాడు, 'ఇలా ఉయ్యాల ఊగించటానికి కారణమేమిటో మీకు తెలుసా?'

జరిగిందేమిటంటే, 1943-44లో, నేను గవర్నమెంటు కాంట్రాక్ట్ పనిని తీసుకున్నాను. అందులో ఎన్నికచేసే పనిలో ముఖియా ఉన్నాడు, లేబర్ కాంట్రాక్ట్‌కి సంబంధించి. అతను సబ్‌కాంట్రాక్ట్ తీసుకున్నాడు. అతని పేరు అహ్మద్ మియ్యా. ఆ అహమద్ మియ్యా ఎన్నో రోజులుగా, 'సార్ మీరు నా ఇంటికి రండి, నా చిన్న కుటీరంలో అడుగుపెట్టండి' అంటూవుండేవాడు. చిన్న గుడిసె అని చెప్తున్నాడు పాపం. మాటల్లో తెలివైనవారిలా ఉంటారు కాని వ్యవహారంలో వేరుగా ఉండొచ్చు, ఉండకపోవచ్చు. కానీ మాటల్లో స్వార్థం లేకపోతే అక్కడ చాల బాగా అనిపిస్తుంది.

ఆ అహ్మద్ మియా ఒకరోజు, 'సేఠ్‌జీ, ఈ రోజు మా ఇంటికి విచ్చేయండి. మీరు మా ఇంట్లో అడుగుపెడితే నా భార్యా పిల్లలు అందరికీ ఎంతో ఆనందం కలుగుతుంది' అన్నాడు. ఆ సమయంలో జ్ఞానం, గీనం అంటూ ఏమీ లేదు కానీ ఆలోచనలు బావుండేయి. అందరి గురించీ మంచి భావనలుండేయి. నా దగ్గర పనిచేసి సంపాదిస్తున్నాడంటే అతను ఇంకా 'బాగా సంపాదించాలి' అనే భావన కూడా ఉండేది. అతను తన కష్టాలను దాటి సుఖంగా జీవించాలి అనే భావన.

ఈ కమ్యూనిటీలో ఎలాంటి గుణాలతో వుంటారో నేను చూసాను. నేను అతనితో, 'ఎందుకు రాను, నీ దగ్గరికే ముందుగా వస్తాను' అన్నాను. అప్పుడతను, 'మా ఇంట్లో ఒకే గది ఉంది. మిమ్మల్ని ఎక్కడ కూర్చోబెట్టాలి?' అన్నాడు. అందుకు నను, 'నేను ఎక్కడైనా కూర్చుంటాను. నాకు ఒక కుర్చీ మాత్రమే కావాలి. కుర్చీ లేకపోయినా పరవాలేదు. నీ దగ్గరికి తప్పక వస్తాను. అది నీ కోరిక కనుక తప్పక వస్తాను' అన్నాను. తర్వాత నేను వెళ్ళాను. మాది కాంట్రాక్ట్ పని. అందువలన నేను ముసల్మాన్‌ల ఇళ్ళకి వెళ్ళాల్సివచ్చేది, అక్కడ టీ కూడా తాగుతుండేవాడిని. ఎవరితోనూ నేను వేరుగా ఉండేవాడిని కాను.

'అరె, ఈ ఒక్క రూము చాల పెద్దగా ఉంది, రెండవది మరుగుదొడ్డి ఎంత చిన్నగా  ఉంది' అన్నాను. అప్పుడతను, 'సాహెబ్ ఏం చెయ్యను? మాలాంటి పేదవాళ్ళకి ఇదే ఎక్కువ!' అన్నాడు. 'నీ వైఫ్ ఎక్కడ పడుకుంటుంది?' అని అడిగితే, 'ఇదే రూములో, దీన్నే బెడ్ రూం అనండి, దీన్నే డైనింగ్ రూమ్ అనండి, అంతా ఇదే. నేను, 'అహ్మద్ మియా, మీ ఆవిడతో జగడం గిగడం ఏమీ జరగదు కదా?' అని అడిగాను. 'ఏమంటున్నారు మీరు?' అని అంటే, 'ఏమిటి?' అన్నాను. అతనప్పుడు, 'ఎప్పుడూ కాదు. నేనంతటి మూర్ఖుడను కాను' అన్నాడు. 'కానీ, ఏమైనా భేదాభిప్రాయాలు?' అంటే అతను, 'లేదు భేదాభిప్రాయాలు ఆమెతో ఉండదు. చెప్పేదేమిటంటే, భార్యతో నాకు గొడవలేమీ జరగవు. నేను అడిగాను, 'ఎప్పుడైనా భార్యకి కోపం వస్తే అప్పుడు మరి?' అని. అందుకతను, 'ప్రియే, బయట సాహెబ్ నన్ను చికాకుపెడుతుంటాడు. ఆ పైన నువ్వు కూడా నన్ను చికాకుపెడితే నా గతేమిటి? అని అంటే ఆమె ఇక ఏమీ మాట్లాడదు' అన్నాడు.

'అభిప్రాయభేదాలు లేవు కాబట్టి ఎటువంటి చికాకులు ఉండవు కదా?' అన్నాను. అందుకతను, 'అభిప్రాయభేదాలే వస్తే ఆమె ఎక్కడు పడుకుంటుంది, నేనెక్కడ పడుకుంటాను?' అన్నాడు. 'ఇక్కడేమైనా రెండు మూడు అంతస్తులుంటే నేను మూడవ అంతస్తు వెళ్ళగలను. కానీ, ఇక్కడ ఇదే రూములో పడుకోవాలి. నేను ఇటు తిరిగి పడుకుంటే ఆమె అటు తిరిగి పడుకుంటే ఏం బావుంటుంది? రాత్రంతా నిద్రే పట్టదు. ఇక సేఠ్‌జీ నేను ఎక్కడికి పోతాను? అందుకే ఈ నా భార్యకి ఎప్పుడూ దు:ఖం కలిగించను. భార్య నన్ను కొట్టినా కూడా ఆమెకు దు:ఖం కలిగించను. అందువలన నేను బయట అందరితో జగడమాడుతాను కాని, భార్యతో క్లియర్‌గా ఉంటాను. వైఫ్ ఏమీ చెయ్యనక్కర్లేదు' దురద పెడితే బయటికెళ్ళి జగడం పెట్టుకుంటాను కాని, ఇంట్లో కాదు.'

భార్య సులేమాన్‌తో మాంసం తెమ్మని చెప్తే, సులేమాన్‌కి పాపం జీతం తక్కువ. పాపం అతను మాంసం ఎక్కడి నుండి తెస్తాడు? నెలంతా భార్య, 'ఈ పిల్లలకు పాపం ఎంతో కోరికగా ఉంది. ఇప్పటికైనా మాంసం తీసుకురా' అంటూ వచ్చి, ఒక రోజు ఆమె మనసులో చిరాకుతో ఉంటే అతను, 'ఈరోజు తప్పక తెస్తాను' అంటాడు. అతని దగ్గర జవాబు సిద్ధంగా ఉంటుంది. అతనికి తెలుసు, జవాబివ్వకపోతే తిట్లకి లంకించుకుంటుందని.  అప్పుడు అంటాడు, 'ఈరోజు తెస్తాను' అని. అలా అని మరిపిస్తాడు. జవాబివ్వకపోతే బయటకు పోయే సమయంలో భార్య గొడవపెట్టుకుంటుంది. కనుక వెంటనే పాజిటివ్ సమాధానం చెప్పేస్తాడు, 'ఈరోజు తీసుకునివస్తాను, ఎక్కడి నుంచైనా సరే తెస్తాను' అని. అప్పుడు భార్య అనుకుంటుంది, ఈ రోజు తీసుకునివస్తే వండిపెడతాను అని. కానీ అతను వచ్చినపుడు ఖాళీ చేతులను చూసి భార్య అరుస్తుంది. అర్థం చేసుకోవటంలో సులేమాన్ దిట్ట కనుక, భార్యకి నచ్చచెప్తూ, 'నా పరిస్థితి నాకే తెలుసు, నీకెలా తెలుస్తుంది' ఇలాంటి మాటలు చెప్తే భార్య, 'సరే తర్వాత తేలే' అంటుంది. పది పదిహేను రోజుల తర్వాత మళ్ళీ అంటే, 'నా పరిస్థితి ఏమిటో నాకే తలుసు' అంటాడు. అప్పుడు భార్య ఒప్పుకుంటుంది. ఆమె ఎప్పుడూ జగడానికి రాదు.

మనవాళ్ళు ఆ సమయంలో, 'నువ్వు నా మీద పెత్తనం చెలాయిస్తావా?' అంటారు. అరె, భార్యతో అలా మాట్లాడగూడదు. అలా అంటేనే ఇట్‌సెల్ఫ్ అర్థం, నువ్వు అణగదొక్కు తున్నావని. అరె, నీ మీద పెత్తనం ఎలా చెలాయిస్తుంది? పెళ్ళి చేసుకునే సమయంలోనూ నీ చెయ్యి పైనే ఉంటుంది కదా నీ మీద ఎలా పెత్తనం చేస్తుంది. చెయ్యి పైన పెట్టుకునే పెళ్ళిచేసుకున్నారు, ఇప్పుడు పెత్తనం చేస్తుంది అంటున్నారంటే మీరు శాంతంగా ఉండాలి. నిర్బలులకే చిరాకు కలుగుతుంటుంది.

ఒకసారి ఒక వైద్యుని కొడుకు వచ్చాడు, ఔరంగాబాదులో. దాదా నుంచి కొన్ని ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పొందవచ్చని అతను ఎక్కడో వినివుంటాడు. కాబట్టి ఆ అబ్బాయి వచ్చాడు, పాతిక సంవత్సరాలే ఉంటాయి. అప్పుడు నేను సత్సంగంలో అన్నీ చెప్తున్నాను ప్రపంచానికి చెందినవి. ఎందుకంటే ఈ వైజ్ఞానిక పద్ధతే మంచిది, మీకు వినటానికి బావుంటుంది. ఇప్పటివరకు నడుస్తున్న కాలానికి అనుగుణంగానే రాసాను. కాలం ఎలా ఉందో, దాని ప్రకారమే వర్ణించాను. అంటే, కాలం ఎలా మారుతుంటుందో అలాగే వర్ణన కూడా మారుతుంటుంది. పైగంబర్ సాహెబ్ అంటే ఏమిటి? భగవంతుని పైగామ్ (సందేశం) తీసుకునివచ్చి అందరికీ అందజేసినవారి పేరే పైగంబర్ సాహెబ్.

నేను అతనితో మజాక్ చేసాను. నేను అతన్ని, 'పెళ్ళిగిళ్ళి చేసుకున్నావా లేక ఒట్టిగా తిరుగుతున్నావా' అని అడిగాను. 'పెళ్ళి చేసుకున్నా' అన్నాడతను. 'ఎప్పుడు చేసుకున్నావు? నన్ను పిలవనేలేదు' అన్నాను నేను. 'దాదాజీ నాకు మీతో పరిచయం లేదు కాని, లేకపోతే పిలిచేవాడినే ఆ రోజు. పెళ్ళయి ఇప్పటికి ఆరు నెలలే అయ్యాయి' అన్నాడతను. నేను కాస్త మజాక్ చేసాను. 'ఎన్నిసార్లు నమాజు చేస్తావు?' 'సాహెబ్, ఐదు సార్లు' అన్నాడతను. అరె, నీకు రాత్రి మూడు గంటలకు నమాజు చేయటం ఏ విధంగా అనుకూలంగా ఉంటుంది?' అంటే, 'చదవాల్సివస్తుంది. తప్పదు. మూడు గంటలకు లేచి చేస్తాను. చిన్న ప్రాయం నుంచే చేస్తూ వస్తున్నాను. మా నాన్నగారు వైద్యులు కూడా.' అన్నాడతను. 'ఇప్పుడు మరి భార్య వచ్చింది కదా, ఎలా చెయ్యనిస్తుంది మూడు గంటలకి?' 'భార్యే ఈ మాట నాతో అన్నది, నువ్వు నమాజు చెయ్యి అని' అప్పుడు నేను అడిగాను, 'భార్యతో జగడం జరగదా?' అని. 'ఏమంటున్నారు,

ఏమంటున్నారు అది?' 'ఏం?' అన్నాను. అప్పుడతను అన్నాడు, 'భార్య అంటే నోటిలోని పాన్. ఆమె నన్ను తిట్టినా సరే, నడుస్తుంది సాబ్'. భార్య వలనే బ్రతుకుతున్నాను. భార్య నాకు ఎంతో సుఖాన్నిస్తుంది. మంచి మంచి వంటకాలు చేసి పెడుతుంది. ఆమెకు దు:ఖాన్నెలా కలిగిస్తాను?' ఈమాత్రం అవగాహన ఉంటే మంచిదే. భార్య మీద ఒత్తిడి కలిగించగూడదు. మనం అర్థం చేసుకోవద్దా? భార్య తప్పేమైనా ఉందా? 'నోట్లో పాన్ మనల్ని తిట్టినా, ఏం పరవాలేదు. మరెవరైనా తిట్టితే వాళ్ళ సంగతి చూసుకుంటా. అప్పుడు చూడు. ఇప్పుడీ మనుషుల విలువ ఎంత?

## [ 6 ] ఇతరుల తప్పులెన్నే అలవాటు

**ప్రశ్నకర్త :** తప్పులెంచితే తప్పుగా అనిపిస్తుంది, తప్పులెత్తకపోయినా కూడా తప్పుగానే అనిపిస్తుంది.

**దాదాశ్రీ :** లేదు లేదు, తప్పుగా ఏమీ అనిపించదు. మీరు తప్పులెత్తి చూపించకపోతే, 'కడీలో ఉప్పు ఎక్కువైంది కాని మీరేమీ అనలేదు' అంటుంది. అప్పుడు అనండి, 'నీకు ఎలాగూ తెలుస్తుంది కదా, నేనెందుకు చెప్పటం?' అని. కానీ వీళ్ళు, కడీ ఉప్పగా ఉంటే ముఖం చిట్లించుకుని, 'కడీలో ఉప్పు ఎక్కువైంది' అంటారు. అరె, ఏం మనిషివి? ఇలాంటి మనిషి పతిగా ఎందుకు ఉంచాలి? అటువంటి భర్తని బయటకు వెళ్ళగొట్టేయాలి. అంత బలహీనుడైన భర్త! అరె, భార్యకి అర్థం కాదా నువ్వు చెప్తేకాని! తలకొట్టుకోవాలా? మరి ఆమె హృదయానికి దెబ్బ తగలదా? మనసులో అనుకుంటుంది, 'ఏమిటి నాకు అర్థంచేసుకోలేనా? ఈయన నా మీద బాణాలు వేస్తున్నాడు. ఈ ముఖంమాసినోడు రోజూ నా తప్పులే వెతుకుతుంటాడు.' మనుషులు కావాలనే తప్పులు వెతుకుతుంటారు. దానివలనే ఈ ప్రపంచం ఎక్కువగా పాడవుతోంది. మీకేమనిపిస్తోంది? అంటే, మనం కాస్త ఆలోచిస్తే ఏమిటి నష్టం?

**ప్రశ్నకర్త :** అలా తప్పు చూపిస్తే మళ్ళీ తప్పులు జరగవు కదా?

**దాదాశ్రీ :** ఓహో, అంటే పాఠం చెప్పటానికా? అలా అయితే తప్పులు పట్టుకోవటంలో తప్పు లేదు. నేను మీకు చెప్పేదేమిటంటే, తప్పులు ఎత్తిచూపించు.

కానీ, దాన్ని ఆమె మీరు చేస్తున్న ఉపకారంగా భావిస్తే తప్పులు పట్టుకో. ఆమె, 'మంచిదయింది నా తప్పులను నాకు చెప్పారు. నాకు తెలియనే తెలియదు అవి' అనేటట్లయితేనే. మీరు  ఉపకారం చేసినట్లని అనుకుంటున్నారా? సోదరీ, మీరు ఈయన చేసింది ఉపకారమని అనుకుంటున్నారా?

**ప్రశ్నకర్త :** లేదు.

**దాదాశ్రీ :** మరిక దాని ఉపయోగం ఏం జరిగింది? చేసిన తప్పేమిటో నీకు తెలుసు. ఆయన చెప్పటంలో అర్థమేమిటి? అతన్ని స్త్రీలు పనికిమాలినోడు అని అంటారు, 'ఎప్పుడు చూసినా మాట్లాడుతూనేవుంటాడు పనికిమాలినోడు' అని. ఏ తప్పయితే ఆమెకి తెలుసో, ఆ తప్పుని మనం బయటపెట్టకూడదు. వేరే ఏం జరిగినా, కడీలో ఉప్పు ఎక్కువైనా, లేక కూర చెడిపోయినా, ఆమె తిన్నప్పుడు ఆ విషయం ఆమెకి అర్థమవుతుందా లేదా? అందువలన మనం చెప్పవలసిన అవసరం లేదు. ఏ తప్పయితే ఆమెకి తెలియదో దాన్ని మనం చెప్తే మనం ఉపకారం చేసినట్లుగా భావిస్తుంది. మిగతా ఆమెకి తెలిసినవాటిని తెలియజేయటం తప్పవుతుంది. అలా మన ఇండియన్ వాళ్ళే తెలియజేస్తారు.

నేను శాంటాక్రూజ్‌లో మా ఇంట్లో మూడవ అంతస్తులో కూర్చునివున్నపుడు టీ వస్తుంది. ఒక రోజు ఎప్పుడైనావ పంచదార వేయటం కాస్త మరచిపోయిందనుకోండి, నేను తాగేస్తాను, అది కూడా దాదా పేరు చెప్పి. లోపల దాదాతో, 'టీలో పంచదార వేసుకోండి సాహెబ్' అని అంటాను. అప్పుడు దాదా వేస్తారు. అంటే, పంచదార లేకుండా టీ వస్తే, తాగేస్తాను అంతే. నాకేమీ సమస్య కాదు అది. ఇక ఆమె పరిగెత్తుకుంటూ పంచదార తీసుకునివస్తుంది. నేను, 'భయ్ పంచదార ఎందుకు తెచ్చావు? ఈ టీ కప్పు, ప్లేటు తీసుకునిపో' అంటాను. 'టీ చప్పగా ఉన్నా మీరు పంచదార అడగలేదు' అంటుంది. నేనెందుకు చెప్పాలి, అంటాను నేను. మీకు అర్థం కాని విషయమా అది?

నేను ఒకతన్ని అడిగాను, 'ఇంట్లో ఎప్పుడైనా మీ ఆవిడ తప్పులు పట్టుకుంటావా?' అని. దానికి అతను, 'ఆమె అలాంటిదే, తప్పులు చేస్తూనేవుంటుంది. కాబట్టి ఆ తప్పులను పట్టుకోవలసివుంటుంది కదా!' అన్నాడు. చూడు తెలివిగల బస్తా వచ్చాడు!

అమ్మటానికి పోతే ఈ గోనెబస్తాకి నాలుగణాలు కూడా రాలేదు. కానీ నా భార్య తప్పులు చేసే మనిషి అని నమ్ముతున్నాడు. చూడండి!

**ప్రశ్నకర్త :** చాలమంది తమ తప్పులను తెలుసుకుంటారు కాని బాగుపడరు. అప్పుడు?

**దాదాశ్రీ :** వాళ్ళకి చెప్తే మారరు. చెప్తే ఇంకా అడ్డంగా నడుస్తారు. ఆమె ఆలోచిస్తున్న సమయంలో అడగండి, ఈ తప్పును ఎలా సరిదిద్దుకోవచ్చు అని. ఎదురెదుగా ఫ్రెండ్స్‌లా కూర్చుని మాట్లాడుకోండి. వైఫ్‌తో ఫ్రెండ్‌షిప్ పెట్టుకోవాలి కదా! పెట్టుకోవద్దా? ఇతరులతో ఫ్రెండ్‌షిప్ చేస్తావు. ఫ్రెండ్‌తో ఇలా ప్రతిరోజూ క్లేశం పెట్టుకుంటావా? అతని తప్పులను డైరెక్ట్‌గా చూపిస్తుంటావా? లేదు. ఎందుకంటే ఫ్రెండ్‌షిప్ నిలబడాలి కదా. కాని, ఇక్కడేమో పెళ్ళి చేసుకున్నారు. ఎక్కడికి పోతుంది? ఇది మనకి శోభనివ్వదు. జీవితాన్ని ఒక పూలతోటలా చేసుకో. ఇంట్లో అభిప్రాయభేదాలు ఉండగూడదు, మరేమీ ఉండగూడదు. ఇల్లు పూదోటలా అనిపించాలి. ఇంటి విషయంలో ఎవరినీ ఏమాత్రం జోక్యం చేసుకోనివ్వద్దు. చిన్న పిల్లల తప్పులను కూడా వాళ్ళు తెలుసుకునేవైతే వాటిని ఎత్తిచూపించవద్దు. వాళ్ళకి తెలియని తప్పులను మాత్రమే చూపించాలి.

అనవసరమైన పిచ్చితనం, పతిలా పెత్తనం చేయటమనేది. అంటే పెత్తనం చెలాయించవద్దు అని అర్థం. ఎదుటివారు ప్రతిచర్య చెయ్యకపోతే అది పతిగా పెత్తనం చెలాయించటం అవుతుంది. ఇక్కడ ప్రతిచర్య వెంటనే జరుగుతుంది.

ఇంట్లో భార్యతో అందరూ పేచీ పెట్టుకుంటూవుంటారు. ఇదేమీ వీరత్వానికి చిహ్నం కాదు. వీరుడని ఎవరిని అంటారు? ఎవరైతే భార్యా పిల్లలలో ఎవరికీ కష్టం కలిగించని వాళ్ళని. పిల్లలు కాస్తేమైనా వ్యతిరేకంగా మాట్లాడినా, తల్లిదండ్రులు కోప్పడనివాళ్ళే సరైనవాళ్ళనిపించుకుంటారు. పిల్లలు పిల్లలే. మీకేమనిపిస్తోంది. న్యాయం ఏం చెప్తుంది?

ఏ విషయంలో మీరు అడ్డు చెప్పాలంటే, వాళ్ళకి అవగాహన లేని విషయంలో. అందులో మనం వాళ్ళకి అర్థమయ్యేటట్లు చెప్పాలి. వాళ్ళకుండే అవగాహన వాళ్ళకి

ఉంటుంది. మనం వాళ్ళకి చెప్పినపుడు వాళ్ళ ఇగోయిజమ్ దెబ్బతింటుంది. ఇక అవకాశం కోసం చూస్తారు, నా చేతికి దొరకనీ ఒకరోజు అని. అవకాశం ఎదురుచూస్తుంటారు. మరి అలా చేసే అవసరం ఏముంది? అంటే వాళ్ళకి ఏయే విషయాల మీద అవగాహన కలుగుతుందో, వాటి గురించి గట్టిగా చెప్పనక్కర్లేదు.

మరి చేదుగా అనిపిస్తే ఒంటరిగానే దాన్ని తాగేయాలి. ఆడవాళ్ళనెందుకు తాగనివ్వాలి? ఎందుకంటే మీరు సాక్షాత్తూ మహేశ్వరులు. మీరు మహేశ్వరుడు కాదా? పురుషులు మహేశ్వరునితో సమానులు. మరీ ఎక్కువ చేదుగా ఉంటే, 'నువ్వు నిద్రపో నేను తాగుతా' అనండి. ప్రపంచంలో ఆడవాళ్ళు పాపం సహకరించరా ఏమిటి? మరి వాళ్ళ విషయంలో జోక్యం ఎందుకు? ఆమెకేమైనా కష్టం కలిగితే, ఏకాంతంలో పశ్చాత్తాపపడాలి, ఇక నేను నీకు కష్టం కలిగించను, నా వలన ఈ తప్పు జరిగింది అని.

ఇంట్లో ఎలాంటి కష్టాలుంటాయి? ఎలాంటి జగడాలుంటాయి? ఎలాంటి అభిప్రాయ భేదాలు కలుగుతాయి? వీటన్నిటినీ ఇద్దరూ రాసి తీసుకునివస్తే, ఒక గంటలో అన్నిటికీ సమాధానం చెప్తాను. అభిప్రాయభేదం అవగాహనా లోపం వలనే వస్తుంది. వేరే కారణమేమీ లేదు.

ఇంట్లో విషయాలను ఇంట్లోనే ఉండనీయాలి. అలా ఫ్యామిలీలా జీవించాలి. ఈ మాత్రం పరివర్తన తీసుకునివస్తే అది ఎక్కువే. క్లేశాలు ఉండనేగూడదు. మీకు ఎన్ని డాలర్లు లభించాయో, అందులోనే గడపండి. మరి సోదరీ డబ్బు ఎక్కువగా లేనప్పుడు చీరల కోసం తొందరపాటు వద్దు. మీరు కూడా ఆలోచించాలి భర్త చికాకులలో ఉన్నాడని, అతనికి మరింత కష్టం కలిగించవద్దని. ఎక్కువగా ఉన్నప్పుడు ఖర్చు పెట్టుకోండి.

## [ 7 ] బండి వేడి మూడ్

ఎప్పుడైనా భర్త రాత్రి వేళ ఆలస్యంగా వస్తే ఏ కారణం చేతనానా, 'హు. ఇంత ఆలస్యంగా వస్తారా?' అంటే, ఆయనకి తెలియదా ఆలస్యమైందని? ఆయన మనసులో కూడా ఆలస్యమైందే, చాల ఆలస్యమైందే అని బాధగా ఉండివుండవచ్చు. దానికి

తోడు భార్య కూడా 'ఇంత ఆలస్యంగా ఎవరైనా వస్తారా?' అని అంటే పాపం! అంత మీనింగ్‌లెస్ మాటలు అనవచ్చా? నీకు అర్థమౌతోందా? అంటే, ఆయన ఇంటికి ఆలస్యంగా వస్తే, ఆ రోజు మీరు చూడాలి ఆయన మూడ్ ఎలా ఉందా అని. అందువలన వెంటనే అనాల్సింది, ముందు చాయ్‌గీయ్ ఏమైనా తాగి, తర్వాత భోజనానికి కూర్చుందురుగాని అని. ఇక మంచి మూడ్‌లోకి వచ్చేస్తాడు. మూడ్ సరిగ్గా లేకపోతే మంచినీళ్ళు, టీ అందించి ఆనందపరచాలి. ఎవరైనా పోలీసాయన వచ్చాడనుకోండి, మన మూడ్ బాగోలేకపోయినా, మంచినీళ్ళు, టీ అందించమా? ఈయన మీ సొంతం కదా, మరి ఆయన్ని ఆనందంగా ఉంచొద్దా? మీవాళ్ళు అనుకున్నప్పుడు వాళ్ళని సంతోషపరచాలి. చాలమందికి ఈ విషయం తెలుసు, బండి మూడ్‌లో లేకపోవటమనేది జరగదా? వేడెక్కిందని దాన్నింకా కర్ర తీసుకుని కొడుతుంటే? దాన్ని మూడ్‌లోకి తీసుకునిరావటానికి కాస్త చల్లబరచాల్సివస్తుంది. రేడియేటర్ తిప్పటం, ఫ్యాన్ తిప్పటం. అలా చెయ్యరా?

**ప్రశ్నకర్త (స్త్రీ):** బ్రాండి తాగటం ఎలా మాన్పించాలి?

**దాదాశ్రీ :** ఇంట్లో మీ ప్రేమని చవిచూస్తే అదంతా వదిలేస్తారు. ప్రేమ కోసం అన్నిటినీ వదిలెయ్యటానికి తయారౌతారు. ఇక్కడ ప్రేమ కనిపించకపోతేనే మద్యాన్ని ప్రేమించటం మొదలుపెడతారు, వేరేవాళ్ళను ప్రేమించసాగుతారు. లేకపోతే సముద్రపు బీచ్‌లో తిరుగుతుంటారు. అరె, ఇక్కడ నీ బాబేమి పాతిపెట్టాడు ఇంటికి పో. అప్పుడు అంటాడు, 'ఇంట్లో నాకేమి బాగనిపించదు' అని.

## [ 8 ] బాగుపరచటమా, బాగుపడటమా?

అంటే ఈ సంబంధం రిలెటివ్. చాలమంది అనేది, భార్యని బాగుచెయ్యటం కోసం ఎంత పట్టుదలకి పోతారంటే, ప్రేమ అనే తాడు తెగిపోయేంతవరకు మొండిగా లాగుతారు. వీళ్ళు, నేను ఈమెని బాగుచేయాల్సిందే అనుకుంటారు. అరె, నువ్వు బాగవు! నువ్వు ఒకసారి బాగవు. ఇది రియల్ కాదు రిలేటివ్. వేరయిపోతుంది. కనుక మనం వట్టిగా నాటకాలాడైనా ఆమె బండిని పట్టాల మీదకు ఎక్కించాలి.

ఇక్కడి నుండి పట్టాలు ఎక్కిందంటే స్టేషన్ చేరుకుంటుంది చకచకా. అంటే, ఇది రిలేటివ్. దాన్ని అర్థమయ్యేట్లుగా నచ్చచెప్పి తీర్మానానికి తీసుకునిరావాలి.

**ప్రశ్నకర్త :** ప్రకృతి మారకపోయినా వ్యవహారమైతే మారాలి కదా?

**దాదాశ్రీ :** వ్యవహారం మనుషులకు చేతనేకాదు. వ్యవహరించటం వచ్చివుంటే ఎప్పుడైనా, అరె! అరగంటైనా వ్యవహారం చేయటం వస్తే అది ఎక్కువే! వ్యవహారం అంటే ఏమిటో అర్థమే చేసుకోలేదు. వ్యవహారమంటే ఏమిటి? పైపైన. వ్యవహారం అంటే అర్థం సత్యం కాదు. వీళ్ళు వ్యవహారాన్నే సత్యమనుకుంటున్నారు. వ్యవహారంలోని సత్యం అంటే రిలేటివ్ సత్యం. అందువలన ఇక్కడ నోటు అసలిదైనదా లేక దొంగదైనా, రెండూ అక్కడ (మోక్షం) స్టేషన్లో పనికిరాదు. అందువలన దాన్ని వదిలిపెట్టి నీ పని పూర్తిచేసుకో. వ్యవహారమంటే తీసుకున్నదాన్ని తిరిగివ్వటం. ఎవరైనా, 'భయ్, నీకు బుద్ధి లేదు' అన్నారనుకోండి, మీరు అనుకోవలసింది, ఒకప్పుడు నేను ఇచ్చిందే నాకు తిరిగివస్తోంది అని. ఇది అర్థం చేసుకుంటే దాన్ని వ్యవహారం అంటారు. ఈ కాలంలో వ్యవహారం ఎవరిలోను లేనేలేదు. ఎవరి వ్యవహారమైతే వ్యవహారమో వారి నిశ్చయం నిశ్చయం.

ఎవరైనా, 'బాబు దాన్ని తిన్నగా చెయ్యి' అంటే, అరె, ఆమెని తిన్నగా చెయ్యటానికి పోతే నువ్వు వంకరౌతావు. అందువలన వైఫ్ని తిన్నగా చేసే ప్రయత్నం చెయ్యవద్దు. ఆమె ఎలా ఉంటే అదే కరెక్ట్ అనాలి. మనం ఆమెతో ఎప్పటికీ కలిసివుండేటట్లయితే అది వేరు కానీ, ఒక జన్మ తర్వాత విడిగా ఎక్కడెక్కడకి వెళ్ళిపోతారో కదా. ఇద్దరి మరణ కాలాలు వేరు వేరు. ఇద్దరి కర్మలు వేరు వేరు. ఇచ్చిపుచ్చుకునేవంటూ ఏమీ లేవు. ఇక్కడి నుండి ఆమె ఎవరి దగ్గరికి పోతుందో ఎవరికి తెలుసు? మనం ఆమెని తిన్నగా చేస్తే అది పోయి మరు జన్మలో వేరేవాళ్ళ ఖాతాలోకి పోతుంది.

తాను తిన్నగా ఉన్నవాళ్ళే ఇతరులను తిన్నగా చేయగలుగుతారు. ఎవరి ప్రకృతైనా తిట్టిదండిస్తే బాగుపడదు, నియంత్రణలోకి రాదు. తిట్లుదండనలతోనే ప్రపంచం నిలబడివుంది. తిట్లుదండనలతో ఆమె ప్రకృతి ఇంకా చెడిపోతుంది.

ఎదుటివారిని బాగుచేసే పనిలో, మీరు ఒకవేళ దయాళువు అయితే వాళ్ళని దండించవద్దు. వాళ్ళని బాగుచేసేందుకు వాళ్ళకి సరిపోయేవాళ్ళు వాళ్ళకి ఎదురౌతారు.

మన రక్షణలో ఉన్నవాళ్ళని మనం ఎలా భక్షిస్తాం? తానుగా మన ఆశ్రయంలోకి వచ్చినవాళ్ళని రక్షించాలి. అదే ముఖ్యమైన ధ్యేయం అవాలి. ఆమె తప్పు చేసినప్పటికీ ఆమెకి రక్షణనీయాలి. విదేశాలకు చెందిన సైనికులు ఇప్పటికీ ఇక్కడ బందీలుగానే ఉన్నారు. అయినా మన సైనికులు వాళ్ళకి రక్షణని ఏవిధంగా కలిగిస్తారు? మరి వీళ్ళయితే మన ఇంట్లోవాళ్ళే కదా! వీళ్ళు బయటివాళ్ళ దగ్గర మ్యావ్ అయిపోతారు. అక్కడ జగడాలు పెట్టుకోరు. ఇంటి దగ్గరే అవన్నీ చేస్తారు.

## [ 9 ] కామన్‌సెన్స్‌తో 'అడ్జస్ట్ ఎవిరీవేర్'

ఎవరితోనైనా అభిప్రాయ భేదం కలగటం, గోడకి కొట్టుకోవటం రెండూ ఒకటే. రెండిటిలో తేడా ఏమీ లేదు. గోడకి కొట్టుకోవటం అంటే అది కనపడక కొట్టుకోవటం జరుగుతుంది, అభిప్రాయభేదం అంటే, ఆ అభిప్రాయభేదం కూడా కనిపించని కారణంగానే జరుగుతుంది. ఎదురుగా ఉన్నది అతనికి కనపడదు. ముందు సొల్యూషన్ ఉండదు. అందుకే అభిప్రాయభేదం కలుగుతుంది. కోపం అనేది ఏదైతో ఉందో అది కూడా కనిపించక పోవటం వలనే జరుగుతుంది. క్రోధ, మాన, మాయా, లోభం వగైరాలకు లోబడ్డవారు కూడా కనపడకపోవటం వలనే అలా చేస్తారు. కాబట్టి విషయాన్ని ఇలా అర్థం చేసుకోవాలి కదా! ఎవరికి దెబ్బ తగులుతుందో వాళ్ళది తప్పు కాదు కదా. గోడదేమైనా తప్పుంటుందా? జగత్తులో అందరూ గోడలే. గోడ తగిలినప్పుడు మనం దాని తప్పులు పట్టం కదా, నాదే ఒప్పు అని. లడాయి జగడాలేమీ చెయ్యము కదా?

మనకి ఎవరైతే తగులుతారో వాళ్ళంతా గోడలే అనుకో. ఇక ద్వారం ఎక్కడుందా అని చూసుకోవాలి. అప్పుడు చీకట్లో కూడా ద్వారం దొరుకుతుంది. చేతితో ఇలా తడుముకుంటూ పోతే ద్వారం దొరుకుతుందా దొరకదా? ఇక అక్కడి నుంచి బయటకు వెళ్ళిపోండి. ఢీకొట్టగూడదు అనే నియమ పాలన చేసుకోవాలి, 'ఎవరితోనూ తలపడకూడదు' అని.

## [ 10 ] రెండు డిపార్ట్‌మెంట్లూ వేరు

పురుషుడు స్త్రీ విషయంలో సంతకం పెట్టగూడదు, స్త్రీ పురుషుని విషయంలో సంతకం పెట్టగూడదు. ప్రతి ఒక్కరు వారి వారి డిపార్ట్‌మెంట్లలోనే ఉండాలి.

**ప్రశ్నకర్త :** స్త్రీ డిపార్ట్‌మెంటు ఏమిటి? ఏయే విషయాల్లో పురుషులు సంతకం పెట్టగూడదు?

**దాదాశ్రీ :** అవేమిటంటే, వంట ఏం చెయ్యాలి, ఇల్లు ఎలా నడపాలి, ఇవన్నీ స్త్రీ డిపార్ట్‌మెంటు. గోధుమలు ఎక్కడి నుండి తీసుకునివస్తుంది, ఎక్కడి నుండి కాదు అన్నది తెలుసుకోవలసిన అవసరం మనకేమిటి? ఆమె మీతో, గోధుమలు తేవటంలో ఇబ్బంది కలుగుతోంది అని అంటే అది వేరు. కానీ, అలా మీతో అనకుండా, రేషన్ చూపించకుండా ఉన్నపుడు మనం ఆమె డిపార్ట్‌మెంటులో చేయి పెట్టవలసిన అవసరం ఏమిటి? 'ఈ రోజు పరమాన్నం చెయ్యి, ఈ రోజు జిలేబీ చెయ్యి' అని కూడా చెప్పవలసిన అవసరం ఏమిటి? టైము వచ్చినపుడు అవన్నీ పెడుతుంది. అది ఆమె 'డిపార్ట్‌మెంట్', ఆమెకున్న స్వాతంత్ర్యం. ఎప్పుడైనా బాగా కోరిక కలిగినపుడు 'ఈ రోజు లడ్డూ చెయ్యి' అనండి. చెప్పటమే వద్దని నేను అనను. కానీ, కారణం లేకుండా, ఇంకా అప్పుడప్పుడు అరుస్తూ, 'కడీలో ఉప్పు ఎక్కువైంది, ఉప్పగా ఉంది,' అనేవి తెలివితక్కువ మాటలు.

తెలివైన పురుషుడు ఇంటి విషయాలలో చెయిపెట్టడు. అతన్నే పురుషుడు అంటారు. లేకపోతే స్త్రీలా అయిపోతాడు. కొందరు మగవాళ్ళు ఇంట్లో మసాలా డబ్బాలో చూసి, 'ఇది రెండు నెలల క్రితం తెచ్చాను, ఇంత తొందరగా ఖర్చయిందా?' అంటారు. అరె, అలా అన్నీ చూస్తుంటే పని ఎలా జరుగుతుంది? అది ఎవరి డిపార్ట్‌మెంటో వాళ్ళకి ఉండదా ఆ చింత? ఎందుకంటే వస్తువులు వినియోగం అవతుంటాయి, కొత్తవి తీసుకోవటం కూడా జరుగుతుంటుంది. కాని ఇక్కడ కారణం లేకుండా ఎక్కువ తెలివితేటలు చూపించటం జరుగుతుంది. ఆమె వంట గదిలో చెయ్యి పెట్టగూడదు.

నాకు కూడా మొదట్లో ముప్ఫై సంవత్సరాల వరకు కాస్త ఇబ్బంది అయ్యింది. కాని, ఒక్కోదాన్ని ఏరిపడేసాను. ఇక డివిజన్ చేసేసాను వంటగది ఖాతా మీది, సంపాదన ఖాతా నాది, సంపాదించవలసింది నేను అని. మీ ఖాతాలో నేను చెయిపెట్టను. నా ఖాతాలో మీరు చెయిపెట్టవద్దు. కూరగాయలు మీరు తీసుకోవాలి.

కానీ మా ఇంట్లో పద్ధతి మీరు చూస్తే మీకు చాల బాగనిపిస్తుంది. హీరా బా శరీరం బాగున్నంతవరకు, బయట రోడ్డు చివర్లో కూరగాయల మండీ ఉండేది, అక్కడికి  కూరగాయలు తేవటానికి స్వయంగా వెళ్తుండేది. ఆ సమయంలో నేను కూర్చునివుంటే నన్ను అడిగేది, 'ఏం కూరగాయులు తేను?' అని. అప్పుడు నేను ఆమెతో, 'మీకు ఏది బాగుంటుందనిపిస్తే అది తీసుకురా' అనేవాడిని. ఇక ఆమే తీసుకునివచ్చేది. కానీ, రోజూ అలాగే జరిగితే ఏమౌతుంది? ఆమె అడగటం మానేస్తుంది. హీరా బా అంటుండేది, అరె, నాకు అదేంటమ్మా? 'మీకు ఏది బాగుంటుందనిపిస్తే అది' అని. తర్వాత ఐదారు రోజులు అడగటం మానేసింది. ఒకరోజు మళ్ళీ అన్నాను, 'కాకరకాయ ఎందుకు తెచ్చావు?' అని. అప్పడామె అంది, 'నేను అడిగినప్పుడు మీకు ఏది బాగుంటుందనిపిస్తే అది తీసుకునిరా అంటారు. ఈ రోజు ఇది తీసుకునివస్తే తప్పుపడుతున్నారా?' అప్పుడు నేను అన్నాను, "లేదు. మనం ఇలాంటి పద్ధతిని పెట్టుకోవాలి. మీరు నన్ను, 'ఏ కూరగాయలు తేను?' అని అడగాలి, నేను, 'మీకు ఏది బాగుంటుందనిపిస్తే అది' అని అంటాను. మనం ఈ పద్ధతిని పాటిద్దాం" అన్నాను. ఆమె చివరి వరకు పాటించింది. దీనివలన చూసేవాళ్ళకి కూడా శోభాయమానంగా ఉంటుంది వాహ్! ఈ ఇంట్లో ఎంత మంచి రివాజో ఏం చెప్పాలి అని. అంటే, మన వ్యవహారం బయటికి బాగుండాలి. ఏకపక్షంగా ఉండగూడదు. మహవీర్ భగవాన్ ఎంత కచ్చితంగా ఉండేవారు! వ్యవహారం, నిశ్చయం రెండూ వేరు వేరు. ఏకపక్షం కాదు. వ్యవహారాన్ని చూడరా? లోకులు రోజూ చూస్తారు కదా! 'రోజూ మిమ్మల్ని అడుగుతుందా?' అంటే, 'ఔను. రోజూ అడుగుతుంది' అంటాను. 'మరి అలిసిపోదా?' అంటారు. నేనంటాను, 'ఎందుకు అలిసిపోతుంది బా? ఎన్ని అంతస్తులు ఎక్కాలి లేక కొండ ఎక్కాలిగనక? అని. ఇద్దరి వ్యవహారాన్ని లోకం చూసేవిధంగా ఆచరించు.

**ప్రశ్నకర్త :** పురుషుని ఏ విషయాలలో స్త్రీ చెయిపెట్టగూడదు?

**దాదాశ్రీ :** పురుషునికి సంబంధించిన ఏ విషయంలోనూ జోక్యం చేసుకోగూడదు. 'దుకాణంలో సరుకు ఎంత వచ్చింది? ఎంత పోయింది? ఈ రోజు ఆలస్యంగా ఎందుకు వచ్చారు?' అప్పుడు ఆమెకి చెప్పవలసివస్తుంది, 'ఈ రోజు తొమ్మిది గంటల బండి తప్పిపోయింది' అని. అప్పుడు భార్య అంటుంది, 'అలా ఎందుకు తిరుగుతావు బండి తప్పిపోయేటట్లు?' అని. ఇక అతనికి కోపం వస్తుంది. అతనికి మనసులో అనిపిస్తుంది ఇలా భగవంతుడు అడిగినా కొడతాను అని. కాని, మరి ఇక్కడేం చెయ్యాలి? కారణం లేకుండా జోక్యం చేసుకుంటారు. మంచి బాస్మతీ బియ్యం వండుతారు, అందులో రాళ్ళు వేసుకుని తింటారు. అందులో ఏమి రుచి వస్తుంది? స్త్రీ పురుషులు ఇద్దరూ పరస్పరం హెల్ప్ చేసుకోవాలి. భర్తకి ఏమైనా చింత ఉంటే భార్య, ఆమెకి ఏ చింతా లేదు అనాలి. అలాగే భర్త కూడా భార్యకి ఏ కష్టం కలుగకుండా చూసుకోవాలి. భర్త కూడా అర్థం చేసుకోవాలి, ఇంటి దగ్గర పిల్లలు భార్యని ఎంత చికాకు పెడుతుంటారన్నది. ఇంట్లో ఏమైనా పగిలపోతే మగవాడు అరిచి గోలపెట్టగూడదు. కానీ మనుషులు ఇలా అరిచి గోలపెడుతుంటారు, 'పోయినసారి మంచివి డజన్ కప్పు, సాసర్లు తెచ్చాను, వాటన్నిటిని ఎందుకు పగలగొట్టావు? అంతా నాశనం చేసావు'. అలాంటప్పుడు భార్యకి మనసులో, నేను పగలగొట్టానా? నేనేమైనా వాటిని తిన్నానా? పగలిపోయేవి పగిలిపోయాయి. అందుకు నేనేం చెయ్యను?' అనిపిస్తుంది. 'నేనేం చెయ్యను?' అంటుంది. ఇక అక్కడ లడాయి. అక్కడ తీసుకోవటానికి ఏమీ లేదు, ఇవ్వటానికి ఏమీ లేదు. జగడం పెట్టుకునే కారణమే లేనిచోట కూడా దెబ్బలాటలు పెట్టుకుంటారు.

డివిజన్ అయితే నేను మొదటి నుంచీ చిన్నగా ఉన్నప్పటి నుంచీ చేసేసాను, వంటగది ఖాతా నీది, వ్యాపారం ఖాతా నాది అని. చిన్నప్పుడు ఇంట్లో ఆడది నన్ను వ్యాపారంలోని లెక్కల గురించి అడిగితే, నాకు బుర్ర తిరిగిపోతుండేది. ఎందుకంటే, నేను చెప్తాను నీ లైన్ కాదది అని. నువ్వు విదౌట్ ఎనీ కనెక్షన్ అడుగుతున్నావు. కనెక్షన్ (అనుసంధానం) సమేతంగా ఉండాలి. ఆమె అడుగుతుండేది, 'ఈ సంవత్సరం

ఎంత సంపాదించారు?' అని. నేను అనేవాడిని, 'అది నువ్వు అడగవలసింది కాదు. అది నా పర్సనల్ మేటర్. నువ్వలా అడిగితే, రేపు నేను ఎవరికైనా ఐదు వందలు ఇచ్చి వస్తే నువ్వు నా నూనె పిండుతావు'. ఎవరికైనా డబ్బులిచ్చి వస్తే అనేది, 'అలా జనంలో డబ్బులు పంచుతూవస్తే, డబ్బు అయిపోతుంది కదా' అని. అలా నువ్వు నా నూనె పిండుతావు కనుకనే పర్సనల్ మేటర్‌లో నీ సంతకం పెట్టనివ్వను.

## [11] స్వర్ణ లంకని శంక తగలబెడుతుంది

ఇంట్లో చాలవరకు ఈ కాలంలో శంకల వలనే గొడవలౌతాయి. ఇక్కడేమౌతుందంటే, శంకల వలన స్పందన కలుగుతుంది, ఆ స్పందనలు మంటలను రగిలిస్తాయి. శంకల్లేకుండా చేసుకుంటే, ఆ మంటలు వాటంతటవే చల్లారిపోతాయి. భార్యాభర్తలు ఇద్దరూ శంకించేవారే అయితే, మంటలు ఎలా ఆరతాయి? ఎవరో ఒకరు శంకించేవారు కాకపోతే పరిష్కారం దొరకవచ్చు. తల్లిదండ్రుల మధ్య గొడవల వలన పిల్లల సంస్కారం చెడిపోతుంది. అలా పిల్లల సంస్కారం చెడిపోకుండా ఉండాలంటే, ఇద్దరూ అర్థం చేసుకుని పరిష్కారాలకు పోవాలి. ఈ శంకని ఎవరు తొలగిస్తారు? మనలోని జ్ఞానమే సంపూర్ణంగా శంకలను దూరం చేయగలుగుతుంది.

ఒక భర్తకి తన భార్య మీద శంక కలిగింది. అది ఆగిపోతుందా? లేదు. అది లైఫ్ టైమ్ శంక అనిపించుకుంటుంది. పని జరిగిందా, పుణ్యవంతుడే (!) పుణ్యవంతుడు మనిషే అవుతాడు కదా! అదేవిధంగా, వైఫ్‌కి కూడా భర్త మీద శంక కలిగితే అది లైఫ్ టైమ్ పోదు.

**ప్రశ్నకర్త :** అలా చెయ్యాలనుకోకపోయినా జరిగిపోతే అదేమిటి?

**దాదాశ్రీ :** నాది అనే యాజమాన్య స్వభావం. నా భర్త! భర్త వరకు పరవాలేదు, భర్త అయితే ఏ బాధా లేదు. 'నా' అంటే తప్పేమీ లేదు. మమత (నా అనే భావన) ఉండగూడదు. నావాడు, 'నా భర్త' అని అలా అనవచ్చు కానీ, నా అనే భావన ఉండగూడదు.

ఈ ప్రపంచంలో పాటించాల్సినవి రెండు. పైపైన విశ్వసనీయతను వెతుక్కోవటం, పైపైన శంకించటం. లోతుల్లోకి పోవొద్దు. చివరకు విశ్వసనీయతను వెతికేవారు పిచ్చివాళ్ళయి పోతారు, జనం వాళ్ళని మెంటల్ హాస్పిటల్‌లో పడేస్తారు. ఆయన భార్యతో ఒకరోజు, 'నువ్వు శుద్ధమైనదానివనటానికి ఏమిటి ఋజువు?' అని అడిగితే అప్పుడు వైఫ్ అటుంది, 'అడివి మనిషి చచ్చినోడు' అని.

ఆడపిల్లలు బయటకు పోతే, చదువుకోవటానికి పోతే అప్పుడూ అనుమానమే. 'వైఫ్' మీద అనుమానం. అలా అంతా దగా! ఇంట్లో కూడా దగాయే కదా ఇప్పుడు! ఈ కలియుగంలో సొంత ఇంట్లో కూడా దగాయే. కపటం, మోసం. కపటం, మోసం. కపటం, మోసం. ఇదంతా సుఖపడేందుకే చేస్తారా? అది కూడా అర్థం చేసుకోకుండా, మత్తులో. నిర్మలమైన బుద్ధి కలిగినవారి ఇంట్లో కపటం, దగా ఉండదు. అది కేవలం 'ఫూలిష్' (మూర్ఖపు) మనిషి ఇంట్లోనే దగా, కపటం ఉంటుంది. కలియుగంలో 'ఫూలిష్' వాళ్ళే జమకూడివున్నారు కదా!

లోకులు అనవచ్చు ఇతను అయోగ్యుడు అని. మీరు వాళ్ళని యోగ్యుడు అనండి. ఎందుకంటే, అయోగ్యుడు కానప్పుడు మీరు అతన్ని అయోగ్యుడు అంటే అది పెద్ద తప్పు అవుతుంది. సతిని వేశ్య అంటే అది భయంకరమైన తప్పిదం అవుతుంది. దానికోసం ఎన్ని జన్మల వరకు అనుభవిస్తూవుండవలసివస్తుందో. అందువలన ఎవరి చరిత్ర గురించీ మాట్లాడవద్దు. ఎందుకంటే, అది పొరపాటు అయినట్లయితే? లోకులు అంటున్నారని మీరూ అంటే, అందులో మీ విలువేముంది? నేను ఎప్పుడు ఇతరుల గురించి అలా మాట్లాడను, ఎవరినీ అనలేదు. నేను జోక్యం కూడా చేసుకోను కదా! ఆ బాధ్యత ఎవరు తీసుకుంటారు? ఎవరి చరిత్రనూ శంకించగూడదు. అది చాల ప్రమాదం. నేను శంకించటం ఎప్పుడూ చేయను. నేను ఎందుకు ప్రమాదాన్ని కొనితెచ్చుకోవాలి?

ఒక మనిషికి అతని భార్య మీద అనుమానం ఉండేది. అతనితో నేను, 'ఏ కారణంతో శంకిస్తున్నావు?' అని అడిగాను. నువ్వు చూడటం వలన శంక కలుగుతోందా? నువ్వు చూడలేదు. కాబట్టి అలా జరగటం లేదా? పట్టుబడితేనే ఆ

మనిషిని 'దొంగ' అంటారు. అరె, అతన్ని దొంగ అని ఎందుకు అంటారు? అతను బలం లేకుండా ఉన్నాడు. చిన్న దొంగతనం చేసాడు కాబట్టే పట్టుబడ్డాడు. పెద్ద దొంగతనం చేసినవాడు పట్టుబడతాడా?

కనుక, పత్ని చరిత్రకి సంబంధించి మనశ్శాంతి ఉండాలంటే, అతనికి బాగా నల్లగా అందవికారంగా ఉండే భార్యను తీసుకురావాలి. అప్పుడు ఆమెకి వినియోగదారుడు ఎవరూ ఉండరు. ఎవరూ ఆమెని ఉంచుకోరు. ఆమె అంటుంది, 'నన్ను చూసుకునేవారెవరూ లేరు. ఈ పతి నాకు లభించాడు, ఆయనే నన్ను చూసుకుంటాడు' అని. కనుక, ఆమె మీ పట్ల సిన్సియర్‌గా ఉంటుంది, చాల సిన్సియర్‌గా ఉంటుంది. ఇక పోతే ఒకవేళ అందంగా ఉంటే, ఇతరులు భోగిస్తారు! అందంగా ఉంటే ఇతరుల దృష్టి వక్రించవచ్చు. ఎవరైనా అందమైన భార్యను తీసుకొస్తే నాకు అనిపిస్తుంది, 'ఈమె గతి ఎలా ఉంటుందో' అని. నల్ల మచ్చ ఉంటే సేఫ్‌సైడ్ గా ఉంటుంది.

భార్య చాలా అందంగా ఉంటే అతను భగవంతుడిని మర్చిపోతాడు కదా. అలాగే భర్త రూపవంతుడైతే భార్య కూడా భగవంతుడిని మర్చిపోతుంది. అంటే రూపం సామాన్యంగా ఉంటే అంతా బావుంటుంది. మన పూర్వీకులు అనేవారు, 'పొలం సమతులంగా ఉండాలి, భార్య కురూపిగా ఉండాలి' అని.

ఈ మనుషులు ఎలాంటివాళ్ళంటే, 'ఎక్కడ హెూటల్ చూస్తే అక్కడ తినేస్తారు'. కనుక జగత్తులో శంకించటం తగదు. శంక దు:ఖదాయకం అవుతుంది.

మరి ఈ మనుషులు, భార్య కొద్దిగా ఆలస్యంగా వస్తే, అప్పుడు కూడా శంకిస్తారు. అలా అనుమానపడాల్సిందేమీ లేదు. ఋణానుబంధం వలన బయట ఏమీ జరగదు. ఆమె ఇంటికి వచ్చినపుడు ఆమెకి అర్థమయ్యేట్లుగా చెప్పండి కానీ, అనుమానించకండి. శంకయితే ఇంకా ఎక్కువ ప్రోత్సాహమిస్తుంది. ఆ, జాగ్రత్తలు తప్పక చెప్పండి కానీ, ఏవిధంగానూ శంకించకండి. శంకించేవారు మోక్షాన్ని పోగొట్టుకుంటారు. అందువలన మీరు బయటపడాలంటే, మోక్షంలోకి వెళ్ళాలంటే, శంకలు పెట్టుకోగూడదు. ఎవరైనా

ఇతర వ్యక్తి మీ 'వైఫ్ మెడ చుట్టూ చేతులు వేసి తిరుగుతున్నట్లయితే, అది మీ కంటబడితే, మీరు విషం తీసుకోవాలా?

ఏ విషయంలోనైనా శంక కలిగుతుంటే, అటువంటి శంకే కలుగనీయవద్దు. మీరు ఎరుకలో ఉండండి కానీ, ఎదుటివారిని శంకించకండి. శంక మనల్ని నాశనం చేస్తుంది. జరగవలసిందేదో జరుగుతుంది కానీ, శంకే మనల్ని చంపేస్తుంది. ఎందుకంటే, శంక ఏదైతో ఉందో అది మనిషి మరణించేంత వరకూ అతన్ని వదిలిపెట్టదు. శంకిస్తే మనిషి బరువు పెరుగుతుందా? మనిషి జీవచ్ఛవంలా అవుతాడు.

## [ 12 ] పతిగా పెత్తనం తప్పు

**ప్రశ్నకర్త :** కొందరు, భార్యతో విసిగిపోయి ఇంట్లోంచి పారిపోతారు, ఎందుకలా?

**దాదాశ్రీ :** లేదు అలా పారిపోవటం ఎందుకు? మనమందరం పరమాత్ములమే. మీకు పారిపోవలసిన అవసరం ఏముంది? మీరు ఆమెతో 'సమభావంతో పరిష్కరించుకోవాలి'

**ప్రశ్నకర్త :** పరిష్కరించుకోవటం అంటే ఎలా చేసుకోవాలి? మనసులో భావించుకోవాలా ఇది పూర్వజన్మ నుంచి వచ్చిందని?

**దాదాశ్రీ :** అంతమాత్రంతో సమసిపోదు. పరిష్కరించుకోవటం అంటే, ఎదుటివారితో ఫోన్‌ని కలపాలి. వారి ఆత్మకి సమాచారం పంపాలి. ఆ ఆత్మ ముందు ఒప్పుకోవాలి (యాక్సెప్ట్ చేయాలి), నా వలన తప్పు జరిగింది అని. అంటే, పెద్ద ప్రతిక్రమణ చేయాలి.

**ప్రశ్నకర్త :** ఎవరైనా మనల్ని అవమానిస్తే అందుకు కూడా అతని కోసం ప్రతిక్రమణ చేయాలా?

**దాదాశ్రీ :** అవమానపరచినా ప్రతిక్రమణ చేయాలి. మనలని గౌరవిస్తే అప్పుడు చెయ్యనవసరం లేదు. ప్రతిక్రమణ చేస్తే వారి పట్ల మనలో ద్వేషభావం

ఉండదు. అంతేకాక, వాళ్ళ మీద మంచి ప్రభావం పడుతుంది. మనపట్ల ద్వేషభావం ఉండదు అన్నది మొదటి స్టెప్ అని తెలుసుకో. కానీ తర్వాత అతనికి సమాచారం కూడా చేరుకుంటుంది.

**ప్రశ్నకర్త :** వాళ్ళ ఆత్మకి చేరుకుంటుందా?

**దాదాశ్రీ :** ఔను. తప్పక చేరుకుంటుంది. ఆ తర్వాత అతని ఆత్మ, అతని పుద్గల్ (చైతన్యరహిత పదార్థం) ని ముందుకు తోస్తుంది, 'భాయ్ నీ ఫోన్ వచ్చింది' అని. మీ ఈ ప్రతిక్రమణ, అతిక్రమణని మించింది. కానీ క్రమణని మించింది కాదు.

**ప్రశ్నకర్త :** ఎక్కువ ప్రతిక్రమణ చెయ్యాల్సివుంటుందా?

**దాదాశ్రీ :** ఇల్లు ఎంత స్పీడుగా కట్టాలంటే, మేస్త్రీలను అంత పెంచాలి. సంగతేమిటంటే, బయటివారి కోసం ప్రతిక్రమణ చెయ్యకపోతే పరవాలేదు. కానీ మన దగ్గరివారు, ఇంట్లోవాళ్ళ కోసం ప్రతిక్రమణ ఎక్కువగా చెయ్యాలి. ఇంటివాళ్ళ కోసం మనసులో పెట్టుకోవలసిన భావం, 'తోడుగా ఉండటానికి జన్మతీసుకున్నాం. కలిసి జీవిస్తున్నాం, వాళ్ళు కూడా ఈ మోక్ష మార్గం లోకి రాగాక' అని.

ఒకతను నా దగ్గరికి వచ్చాడు. ఆయన నాతో, 'దాదా నేను పెళ్ళయితే చేసుకున్నాను. కానీ, నాకు నా భార్య అంటే ఇష్టం లేదు' అన్నాడు. నేను అతన్ని, 'ఎందుకు ఇష్టం లేదు వచ్చిన కారణమేమిటి?' అని అడిగాను. అప్పుడతను, 'కొద్దిగా కుంటిది. కుంటుకుంటూ నడుస్తుంది' అన్నాడు. 'మరి నీ భార్యకి నువ్వంటే ఇష్టమేనా లేదా?' అని అడిగితే, 'దాదా, నేనైతే ఇష్టమయ్యేటట్టుగానే ఉంటాను కదా! అందంగా ఉంటాను, చదువుకున్నవాడిని, సంపాదన ఉంది, వికలాంగుడను కాను' అన్నాడు. అయితే అందులో తప్పు నీదే. నీకలా ఎందుకు జరిగింది. కుంటామె ఎందుకు దొరికింది? ఆమె ఎంత పుణ్యం చేసిందో ఇంతటి మంచివాడు దొరికాడు? అరె, మనం చేసుకున్నదే మనకి ఎదురౌతుంది. అందులో ఎదుటివాళ్ళ దోషాన్నెందుకు చూడటం? వెళ్ళి నీ తప్పులకు నీవు అనుభవించు. మళ్ళీ మరో కొత్త తప్పు చెయ్యకు.

అతనూ అర్థం చేసుకున్నాడు, అతని లైఫ్ ఫ్రాక్చర్ అవబోతూ ఆగిపోయింది, బాగుపడింది.

## [ 13 ] భర్తలూ, దాదాజీ దృష్టితో నడవండి

**ప్రశ్నకర్త :** ఒకవేళ భార్య, మీ పేరెంట్స్ మనతోపాటు ఉండకూడదు లేక వాళ్ళని పిలవకూడదు అంటే ఏం చెయ్యాలి?

**దాదాశ్రీ :** అప్పుడు అర్థమయ్యేటట్టుగా నచ్చజెప్పి పని జరుపుకోవాలి. డెమోక్రాటిక్ పద్ధతిలో పని పూర్తిచేసుకోవాలి. ఆమె తల్లిదండ్రులను పిలిచి వాళ్ళకి మంచి సేవచెయ్యాలి...

**ప్రశ్నకర్త :** తల్లిదండ్రులు వృద్ధులు, వయసు బాగా మీరినవారు అయ్యుంటే, ఒక పక్క తల్లిదండ్రులు, మరో పక్క వైఫ్ ఉంటే వారిద్దరిలో ముందుగా ఎవరి మాట వినాలి?

**దాదాశ్రీ :** వైఫ్‌తో మీ సంబంధం ఎంత బాగుండాలంటే, వైఫ్ మీతో, 'మీ తల్లిదండ్రులను చూసుకోరాదా. ఎందుకలా చేస్తున్నావు?' అనాలి. వైఫ్ సముఖంలో తల్లిదండ్రుల గురించి వ్యతిరేకంగా మాట్లాడాలి. అందరూ ఏమంటారు? మా అమ్మలాంటి అమ్మ ఎవరికీ ఉండదు అని. నువ్వు వాళ్ళలా అనకు. ఆమె వ్యతిరేకంగా మాట్లాడినప్పుడు, అమ్మ స్వభావం ఈమధ్య అలాగే తయారైంది అను. ఇండియన్ మైండ్‌కి వ్యతిరేక దిశలో నడిచే అలవాటుంది. ఇండియన్ మైండ్ కదా!

నీకు తెలుసా మనుషులు వైఫ్‌ని గురువుని చేస్తారు అవునా?

**ప్రశ్నకర్త :** ఔనండి తెలుసు.

**దాదాశ్రీ :** ఆమె గురువుని చెయ్యతగ్గది కాదు. లేకపోతే తల్లి, తండ్రి, కుటుంబమంతా కష్టాలపాలౌతారు, గురువుని చేసినందుకు తాను కూడా కష్టాలపాలౌతాడు. అతనికి కూడా బొమ్మలా ఆడవలసివస్తుంది కదా! కానీ నా దగ్గరికి వచ్చినవాళ్ళకి అలా జరగదు. నా దగ్గర అంతా ఆల్‌రైట్. హింసాత్మక భావన కూడా

ఎగిరిపోతుంది కదా! హింసకు వెళ్ళే ఆలోచనే రాదు. ఏవిధంగా సుఖపెట్టగలను అనే ఆలోచనే వస్తుంది.

**ప్రశ్నకర్త :** ఈ ఆడవాళ్ళు పనిచేసి బాగా అలసిపోతారు. పని చెప్తే వంకలు తయారుచేసుకుంటారు, నేను అలసిపోయాను, తల నొప్పిగా ఉంది, నడుం నొప్పి అంటూ.

**దాదాశ్రీ :** అలాంటప్పుడు ఆమెకు ఉదయమే చెప్పేయాలి, 'చూడు నువ్వు పని చేయలేవు, నువ్వు అలసిపోయావు!' అని. అప్పుడు ఆమెకి ఉత్సాహం వచ్చి, 'లేదు. నువ్వు మాట్లాడకుండా కూర్చో. నేను చేస్తాను' అంటుంది. అంటే, మీకు కళను ఉపయోగించి పని చేయించుకోవటం రావాలి. అరె, కూరలు తరిగే కళ కూడా లేకపోతే రక్తం కారుతుంది.

**ప్రశ్నకర్త :** మేము బండిలో వెళ్తున్నపుడు ఆమె చెప్తూవుంటుంది, బండిని ఎక్కడ మలుపుతిప్పాలి, ఎప్పుడు బ్రేక్ వెయ్యాలి, ఇవన్నీ బండిలో నాకు చెప్తూవుంటుంది. అంటే బండిలో ఉన్నపుడు అడ్డు పడుతుంటుంది, 'ఇలా నడుపు, అవ నడుపు' అంటూ.

**దాదాశ్రీ :** అయితే ఆమె చేతికే ఇచ్చేయండి. బండిని ఆమెకే ఇవ్వండి. గొడవే ఉండదు. తెలివైన మగవాడు! అడ్డు పెడుతుంటే, ఆమెతో అనండి, 'రా. నువ్వే తీసుకో' అని.

**ప్రశ్నకర్త :** అప్పుడు అంటుంది, 'నాకు ఆ ధైర్యం లేదు' అని.

**దాదాశ్రీ :** ఎందుకు? అప్పుడు అడగండి, 'ఇందులో నీకు ఏమిటి సమస్య? నిన్నేమైనా పైన వేళ్ళాడదీసారా, అడ్డు తగులుతుండటానికి?' అని. బండి ఆమెకి ఇచ్చేయండి. అలా మధ్యలో అడ్డు చెప్తుంటే డ్రైవరుంటే తెలిసేది, ఇక్కడ ఇంటి మనిషి కదా. అందుకే అడ్డు పెడుతూవుంటుంది.

**ప్రశ్నకర్త :** భార్య పక్షం తీసుకోకపోతే ఇంట్లో గొడవలౌతాయి కదా.

**దాదాశ్రీ :** భార్య పక్షమే తీసుకోండి. భార్య పక్షం తీసుకోండి. సమస్యేలేదు. భార్య పక్షం తీసుకుంటేనే రాత్రిపూట ప్రశాంతంగా పడుకోగలుగుతావు. లేకపోతే ఎలా నిద్రపోతావు? అక్కడ కాజీ (న్యాయాధికారి) వి అయిపోకు.

**ప్రశ్నకర్త :** పొరుగువారి పక్షం తీసుకోనేకూడదు కదా?

**దాదాశ్రీ :** లేదు మీరు ఎప్పుడైనా వాది తరపు వకీలే అవాలి కాని ప్రతివాదికి కాదు. మనం ఏ ఇంట్లో తింటున్నామో దానికే. ఎదురింటివాళ్ళ వకీలుగా పనిచేస్తూ, ఈ ఇంట్లో తింటారా! అందువలన ఆ సమయంలో, ఎదుటివారి పక్షాన న్యాయం ఎంతుందో చూడవద్దు. మీ వైఫ్‌ది అన్యాయమే అయినా మీరు ఆమె ప్రకారమే నడవాలి. అక్కడ న్యాయం చేసేదేమీ లేదు, 'నీకే బుద్ధి లేదు అందుకే ఇది....' ఎందుకంటే రేపు భోజనం అక్కడే చేయాలి. నువ్వు నీ కంపెనీలోనే వకాలతు చెయ్యాలి. అలా అన్నట్లయితే ప్రతివాదికి వకీలు అయిపోతారు.

**ప్రశ్నకర్త :** ఎదుటివారు సమాధానపడ్డారని ఎలా అంటారు? ఎదుటివారు సమాధానపడ్డా, అది వాళ్ళకి ప్రయోజనకరం కాకపోతే?

**దాదాశ్రీ :** అది మీరు చూడొద్దు. ఎదుటివారి ప్రయోజనం లేకపోతే ఆ సంగతి వాళ్ళే చూసుకోవాలి. మీరు ఎదుటివారి హితాహితాలు చూడాలంటే అలా వాళ్ళ ప్రయోజనం చూడటంలో, మీకు ఏం శక్తి ఉంది? మీరు మీ ప్రయోజనమే చూసుకోలేరు, ఇతరుల ప్రయోజనం ఏం చూస్తారు? అందరూ వారి వారి శక్త్యానుసారం వాళ్ళ ప్రయోజనాలను చూసుకుంటారు. అంత ప్రయోజనం చూసుకోవాలి. కానీ, ఎదుటివారి ప్రయోజనం కోసం గొడవ వస్తే, అలా చేయగూడదు.

**ప్రశ్నకర్త :** ఎదుటివారిని సమాధానపరచటానికి మనం ప్రయత్నం చేసినపుడు ఫలితం వ్యతిరేకంగా వస్తుంది అని మనకు తెలిసినపుడు, ఏం చెయ్యాలి?

**దాదాశ్రీ :** ఫలితం ఏమైనా మనం 'ఎదుటివారిని సమాధానపరచాలి' అని మాత్రం నిర్ణయించుకోవాలి. సమభావంతో తొలగించుకోవాలని నిర్ణయించుకోవాలి. ఇక తొలగిపోతుందా లేదా అని ముందే చూడవద్దు. తప్పక తొలగిపోతుంది! ఈరోజు

కాకపోతే రేపు, లేక ఎల్లుండి జరగవచ్చు. ఋణానుబంధం గాఢంగా ఉంటే రెండు సంవత్సరాలు, మూడు సంవత్సరాలు లేక ఐదు సంవత్సరాలు కూడా పట్టవచ్చు. వైఫ్‌తో ఋణానుబంధం చాల చిక్కగా (గాఢంగా) ఉంటుంది. సంతానంతో గాఢంగా ఉంటుంది. తల్లిదండ్రులతో గాఢంగా ఉంటుంది. అక్కడ కాస్త ఎక్కువ సమయం పడుతుంది. వాళ్ళు మీతోపాటే జరుగుతుంది కనుక అక్కడ వీడిపోవటం నెమ్మది నెమ్మదిగా జరుగుతుంది. కానీ మీరు ఎప్పుడో ఒకప్పుడు 'నేను సమభావంతో తొలగించుకోవాలి' అని నిర్ణయం తీసుకుంటే, ఏదో ఒక రోజు దాన్ని తొలగించటం జరుగుతుంది. దాని అంతం వస్తుంది.

## [ 14 ] నాది అనే చుట్లు ఇలా విప్పుకుంటాయి

పెళ్ళి రోజున మండపంలో కూర్చుంటారు కదా. మండపంలో కూర్చున్నపుడు ఇలా చూసుకుంటారు. ఆ. ఈమె నా భార్య, అంటే అది మొదటి చుట్టు వేయటం జరిగింది. 'నా భార్య, నా భార్య, నా భార్య....' పెళ్ళి చేసుకోవటానికి కూర్చున్న దగ్గరి నుంచే చుట్లు చుడతూపోతాడు. వాహ్. ఇప్పటి వరకు చుట్లు వేస్తూనేవున్నాడు. ఇప్పటి వరకు ఎన్ని చుట్లు చుట్టుకున్నాయో తెలియదు. ఇప్పుడు అవి ఎలా విడతాయి? నాది అనే చుట్టు చుటుకుంది.

ఇప్పుడు, 'నాది కాదు, నాది కాదు, నాది కాదు... అంటూ అజపా జపం చేయి. 'ఈ స్త్రీ నాది కాదు, కాదు నాది' దానితో ఆ చుట్లు విప్పుకుంటాయి. యాభైవేల సార్లు 'నాది నాది' అంటూ చుట్లుచుట్టివుంటే, యాభై వేలసార్లు 'నాది కాదు, నాది కాదు' అనే చుట్లతో వదలిపోతుంది. ఇదేమైనా పనిలేని భూతమా? ఒక మనిషి భార్య చనిపోయి పది సంవత్సరాలయింది. అయినా అతను ఆమెని మరిచిపోలేకపాయాడు, ఏడుస్తూవుంటాడు. ఇదేమైనా భూతం పట్టుకుందా? నేను అతనికి, 'నాది కాదు', 'నాది కాదు' అనమని చెప్పాను. అయితే అతను ఏం చేసాడు, మూడు రోజుల వరకు 'నాది కాదు, నాది కాదు' అని అంటూనేవున్నాడు, దాన్నే పట్టుకునివున్నాడు. తర్వాత అతని ఏడుపు ఆగిపోయింది! ఇవన్నీ చుట్లే. దానివలనే కలిగింది ఇబ్బందంతా. అంటే, ఇదంతా కల్పితమే. మీకు అర్థమైందా నేను చెప్పేది? ఇలాంటి సరళమైన మార్గాన్ని ఎవరు చూపిస్తారు?

రోజంతా పనిచేస్తూ భర్త కోసం ప్రతిక్రమణ చేయండి. ఒక్క రోజులో ఆరు నెలల వైరం కట్ అయిపోతుంది. సగం రోజు అయినట్లయితే అర్థం చేసుకోండి, మూడు నెలలది పోతుంది. పెళ్ళికి ముందు భర్త అంటే నావాడు అనేది ఉంటుందా? లేదు. నా అనే బంధం ఎప్పుడు ఏర్పడింది? పెళ్ళి రోజున మండపంలో. ఎదురెదురుగా కూర్చునివున్నపుడు, నీవు నిర్ణయించుకున్నావు 'నాకు భర్త వచ్చాడు. కాస్త లావుగా ఉన్నాడు, చామనచాయలో ఉన్నాడు' అని. అలాగే అతను కూడా నిర్ణయించుకున్నాడు, 'ఈవిడ నా పత్నిగా వచ్చింది' అని. అప్పటి నుంచి, 'నాది నాది' అనే బంధాలు ఏర్పడ్డాయి, అవి అలా చుట్టుకుంటూనే వున్నాయి. ఇది 15 సంవత్సరాల ఫిల్మ్. ఆమెని 'నాది కాదు, నాది కాదు' అనుకుంటూపోతే చుట్టుకున్న ఆ బంధాలు విడిపోతాయి, నాది అనే భావన పోతుంది. పెళ్ళి జరిగిన దగ్గరి నుంచే ఈ అభిప్రాయం ఉత్పన్నమైంది. ప్రిజ్యుడిస్ (పూర్వాభిప్రాయం) ఉత్పన్నమైంది, 'ఆయన ఇలా ఉన్నారు, ఆయన అలా ఉన్నారు' అంటూ. దానికి ముందు అలా ఏమైనా ఉందా? ఇక ఇప్పుడు మనం మనసులో నిశ్చయం చేసుకోవలసింది, 'ఎలా ఉన్నారో అలా ఉన్నారు' నేను ఇష్టపడే తెచ్చుకున్నాను అని. ఇప్పుడు భర్తను మార్చుకోగలరా?

## [ 15 ] పరమాత్మ ప్రేమకి చిహ్నం

ఈ ప్రపంచంలో ఎవరైనా, 'స్త్రీ ప్రేమ ప్రేమ కాదా?' అంటే, నేను అనుకునేది ఏమిటంటే, తగ్గుతూ పెరుగుతూపోయేది ప్రేమే కాదు. రత్నాల హారం తీసుకునివచ్చి ఇవ్వండి, ఆ రోజు ప్రేమ బాగా పెరిగిపోతుంది. అదే, తీసుకునిరాకపోతే, ప్రేమ తగ్గిపోతుంది అంటే, అది ప్రేమ కాదు.

**ప్రశ్నకర్త :** నిజమైన ప్రేమ పెరగదు, తగ్గదు అంటే దాని స్వరూపం ఎలా ఉంటుంది?

**దాదాశ్రీ :** అది పెరగదు, తగ్గదు. ఎప్పుడు చూసినా ప్రేమ ఎలా ఉండేది అలాగే ఉంటుంది. మీతో పని జరిగినప్పుడు మీ పట్ల ప్రేమ ఉంటుంది, అదే పని జరగనప్పుడు ప్రేమ తెగిపోతుంది అంటే దాన్ని ప్రేమ అని ఎలా అంటారు? అంటే, స్వార్థం లేనిచోటే శుద్ధమైన ప్రేమ ఉంటుంది. స్వార్థం ఎప్పుడు ఉండదు?

నాది నీది అనేది ఉండకపోతే స్వార్థం ఉండదు. 'జ్ఞానం' ఉంటే నీది నాది అనేది ఉండదు. 'జ్ఞానం' లేకపోతే నీది, నాది అనేవి ఉంటాయి కదా?

ఇదంతా 'రాంగ్ బిలీఫ్'. 'నేను చందూభాయ్‌ని' అనేది రాంగ్ బిలీఫ్. అలాగే ఇంటికి వెళ్ళినపుడు మనం, 'ఇతను ఎవరు?' అని మనం అడిగితే, అప్పుడు అంటారు, 'గుర్తుపట్టలేదా? నేను ఈవిడ స్వామిని' అంటారు. ఓహోహో వచ్చాడండి పెద్ద స్వామి! స్వామికి స్వామి ఉండరని అనుకుంటున్నట్లుగా ఉంటాయి మాటలు. స్వామికి స్వామి ఉండరా? ఇక పైనుండే స్వామికి స్వామిని మీరయ్యారు, మీ స్వామిని ఆయనయ్యారు. ఎందుకీ గొడవలో పడటం? అసలు స్వామి అవటమే ఎందుకు? మన 'కంపానియన్' అని అనుకోవటంలో ఏమిటి సమస్య?

**ప్రశ్నకర్త :** దాదా పూర్తిగా 'మాడ్రన్' భాషను ఉపయోగించారు.

**దాదాశ్రీ :** మరి అయితే? టస్సల్ తగ్గిపోతుందిగా! ఔను, ఒక రూమ్‌లో ఇద్దరు కంపానియన్ ఉంటే, ఒక వ్యక్తి టీ పెడితే, రెండవ వ్యక్తి తాగుతాడు, రెండవ వ్యక్తి ఆ వ్యక్తి కోసం పనిచేస్తాడు. అలా చేస్తే 'కంపానియన్‌షిప్' ముందుకు నడుస్తుంది.

**ప్రశ్నకర్త :** 'కంపానియన్' లో ఆసక్తి ఉంటుందా లేదా?

**దాదాశ్రీ :** అందులో ఆసక్తి వుంటుంది. కానీ ఆ ఆసక్తి అగ్నిలా ఉండదు. ఆ పదమే అలా గాఢ ఆసక్తిదౌతుంది. 'పతి పత్ని' అనే పదంలోనే అంత గాఢ ఆసక్తి ఉంటుంది. 'కంపానియన్‌షిప్' అనగానే ఆసక్తి తగ్గిపోతుంది.

ఒకాయన భార్య 20 సంవత్సరాల క్రితమే చనిపోయింది. అప్పుడు ఒకతను నాతో, 'ఈ బాబాయిని ఏడిపించనా?' అన్నాడు. 'ఎలా ఏడిపిస్తావు?' అని అడిగాను. అ వయసులో అయితే ఏడవరు. అప్పుడతను అన్నాడు, 'చూడు అతనెంత సెన్సిటివో' అని. మళ్ళీ, 'ఏం బాబాయ్, పిన్ని సంగతి అడక్కు. ఆమె స్వభావమే వేరు!' అన్నాడు. అతను అలా అంటుంటే బాబాయ్ నిజంగా ఏడవటం మొదలుపెట్టాడు. అరె, ఏమిటీ విచిత్రం! అరవై సంవత్సరాల వయసులో కూడా భార్య కోసం ఏడుపు వస్తుందా! ఇదెలాంటి విచిత్రం? వీళ్ళు సినిమాలో కూడా ఏడుస్తారు కదా! అందులో ఎవరైనా చనిపోతే, చూస్తున్నవాళ్ళు కూడా ఏడుస్తారు.

**ప్రశ్నకర్త :** అయితే ఈ ఆసక్తి వదలదు ఎందుకని?

**దాదాశ్రీ :** అది వదలదు. 'నాది, నాది' అనుకున్నారు కదా. ఇప్పుడు 'నాది కాదు, నాది కాదు' అనే జపం చేస్తే అది ఆగిపోతుంది. తగులుకున్న ఆ బంధాలను వదిలిపెట్టవలసిందే కదా! అంటే, ఇది కేవలం ఆసక్తి మాత్రమే. చేతన అనే మాటే లేదు. వీళ్ళంతా కీ ఇచ్చిన మరబొమ్మలు.

ఆసక్తి ఉన్న చోట, ఆక్షేపం రాక మానదు. అది ఆసక్తి స్వభావం. ఆసక్తి ఉంటే ఆక్షేపం ఉంటుంది, 'నువ్విలా, నువ్వలా' అంటూ. నువ్వలాంటిదానివి, నువ్విలాంటిదానివి' అని అనుకుంటారా లేదా? మీ ఊళ్ళో అనుకోరా? లేక అనుకుంటారా? అలా అనటం అంతా ఆసక్తి కారణంగానే.

ఈ అమ్మాయిలు భర్తను ఇష్టపడతారు, బాగా చూసి ఇష్టపడతారు, తర్వాత జగడాలు పెట్టుకోరా? జగడం పెట్టుకుంటారు కదా? మరి దాన్ని ప్రేమ అని అననేలేము కదా! ప్రేమంటే ఎప్పటికీ ఉంటుంది. ఎప్పుడంటే అప్పుడు, అదే ప్రేమ. అలాగే కనిపిస్తే దాన్ని ప్రేమ అంటారు. అక్కడ నిశ్చయంగా చెప్పవచ్చు. మీకు ప్రేమ కలిగినప్పుడు, ఆ రోజు ఆమె అలిగి కూర్చుంటే, 'అప్పుడేం చెయ్యాలి', ఇదేం ప్రేమ నీది! ముఖం మాడ్చుకుని తిరుగుతుంటే, ఆ ప్రేమని ఏం చేసుకోవాలి? మీకేమనిపిస్తోంది?

ప్రేమ అధికంగా ఉన్న చోట, అయిష్టం కూడా ఉంటుంది. ఇది మానవ స్వభావం.

ఇదేమిటంటే, సినిమాకి వెళ్ళేటప్పుడు ఆసక్తితో హుషారుగా, వచ్చేటప్పుడు 'తెలివితక్కువ' అంటాడు. 'తమరికెక్కడుంది పద్ధతి' ఇలా మాట్లాడుకుంటూ ఇంటికి వస్తారు. ఈయన తెలివి వెతికితే, ఆమె పద్ధతి చూస్తుంది!

ప్రేమతో బాగుపడతారు. వీళ్ళంతా బాగుపడాలి కనుక ప్రేమ బాగుచేస్తుంది. వీళ్ళందరినీ నేను బాగుపరుస్తాను కదా, అది ప్రేమతో బాగుపరుస్తాను. నేను ప్రేమగానే మాట్లాడుతాను కనుక వ్యవహారం చెడిపోకుండావుంటుంది. ఏమాత్రం ద్వేషంతో మాట్లాడినా వ్యవహారం చెడిపోతుంది. పాలల్లో పెరుగు తోడు వేయకపోయినా, కొద్దిగా గాలి తగిలినా సరే ఆ పాల నుండి పెరుగవుతుంది.

**ప్రశ్నకర్త :** ప్రేమ, ఆసక్తిల మధ్య తేడా ఏమిటో కాస్త చెప్పండి!

**దాదాశ్రీ :** వికృత ప్రేమ ఏదైతే ఉందో అదే ఆసక్తి. ఈ ప్రపంచంలో మనం ప్రేమ అంటున్నది, వికృత ప్రేమ. దాన్ని ఆసక్తి అనే అనాలి.

ఇది సూది, అయస్కాంతాల మధ్య ఉండే ఆసక్తిలాంటిదే ఈ ఆసక్తి. అందులో ప్రేమ అనే వస్తువే లేదు. ప్రేమ అనేది ఉండనే వుండదు కాద ఎక్కడా. ఈ సూది, అయస్కాంతం మధ్య ఉండే ఆకర్షణని తీసుకుని, నాకు ప్రేమ ఉంది అని అనపిస్తుంది మీకు. అందుకే నేను లాగుతుంది. కానీ అది ప్రేమ వంటి వస్తువే కాదు. ప్రేమ అంటే జ్ఞాని పురుష్‌కి ఉండేది. దాన్నే ప్రేమ అంటారు.

ఈ ప్రపంచంలో శుద్ధ ప్రేమ అనేదే పరమాత్మ. అది తప్ప ప్రపంచంలో వేరే పరమాత్మ అనేదే ముందు లేదు, ఇక ముందు ఉండదు కూడా. అక్కడ హృదయం నిదానంగా ఉన్నప్పుడే మనసుపెట్టే పనిజరుగుతుంది. లేకపోతే మనసుపెట్టలేరు. హృదయం రెండు రకాలుగా నిదానమౌతుంది. అధోగతిలో పోవాలంటే స్త్రీ మీద మనసుపెట్టు. ఊర్ధ్వగతిలో పోవాలంటే జ్ఞానిపురుష్ మీద మనసు పెట్టు. ఆయన నిన్ను జ్ఞానమార్గంలో తీసుకెళ్తాడు. రెండు చోట్లా మనసుపెట్టవలసిన అవసరం ఉంది. అప్పుడే హృదయపూర్వకంగా పనిచేయటం వస్తుంది.

అంటే అర్థం, క్రోధం-మానం-మాయ-లోభం ఏమీ ప్రేమలో లేనప్పుడే, స్త్రీ కాదు పురుషుడు కాదు, ప్రేమ సమానులు ఒకేలా ఉంటారు. అలాంటి శుద్ధ ప్రేమను చూడాలి. అప్పుడే మనిషిలో మనసు నిదానంగా ఉంటుంది.

నేను ప్రేమ స్వరూపుడనయ్యాను. ఆ ప్రేమలోనే మీరు తన్మయత్వంలో ఉంటారు. ప్రపంచాన్నే మర్చిపోతారు. జగత్తునంతా మరపుకి రావటం జరుగుతుంది. ప్రేమలో మునిగితేలినపుడు మీ ప్రపంచం మీకు బాగనిపిస్తుంది. ఆదర్శవంతంగా నడుస్తుంది.

## [16] పెళ్ళి అంటే 'ప్రామిస్ టు పే'

1943 లో హీరా బా కన్ను ఒకటి పోయింది. డాక్టరు ప్రయత్నం చేసారు. ఆమెకి ఝూమర్ వ్యాధి ఉంది, వాళ్ళు ఝూమర్‌కి చికిత్స చేయబూనారు, దాని ప్రభావం కంటి మీద పడి దానికి నష్టం కలిగింది.

అందువలన మనవాళ్ళ మనసులో 'కొత్త పెళ్ళికొడుకు తయారయ్యాడు. మళ్ళీ పెళ్ళి చేయండి' అనిపించింది. కన్యలు చాలమంది ఉన్నారు, కన్యల తల్లిదండ్రులకు, ఎలాగైనా సరే ఆమెని నూతిలోకి తోసైనా సరే ఒక చోటికి చేర్చాలి అని కోరిక ఉంటుంది. అప్పుడు భాదరణకి చెందిన పాటీదార్ వచ్చాడు. ఆయన బావమరిది కూతురు ఉంది అందుకే వచ్చాడు. నేను అడిగాను, 'ఏమిటి మీకు?' అని. 'మీకు అలా జరిగిందా?' అన్నాడు అతను. అప్పుడు 1944లో నా వయసు 36 సంవత్సరాలు. నేను అప్పుడు అతన్ని అడిగాను, 'ఇది అడగటానికే వచ్చారా?' అని. ఆయన, 'ఒకటేమో హీరా బా కన్ను పోయింది, రెండవది పిల్లలు కూడా లేరు' అన్నాడు. నేను అన్నాను, 'ప్రజలు లేరు కానీ, నా దగ్గర ఒక స్టేట్ కూడా ఏదీ లేదు.' బరోడా 'స్టేట్' లేదు ఆయనకి ఇవ్వటానికి. స్టేట్ ఉంటే పిల్లవాడికిచ్చింది కూడా పనికివస్తుంది. ఏదో ఒకటి అర గుడిసెలున్నాయి, కాస్త జాగా ఉంది, అదైనా నన్ను రైతునే చేస్తుంది కదా. స్టేట్ (రాష్ట్రం) ఉంటే బావుండేది'. మళ్ళీ ఆయనతో, 'ఇప్పుడు మీరు ఇదంతా ఎందుకు చెప్తున్నారు? హీరా బా కి నేను ప్రామిస్ చేసాను, పెళ్ళి చేసుకునే సమయంలో. ఇక ఒక కన్ను పోతే ఏమిటి? రెండవది పోయినా చెయి పట్టుకుని నడిపిస్తా' అన్నాను.

**ప్రశ్నకర్త :** నా పెళ్ళయిన తర్వాత మేమిద్దరం ఒకరినొకరం గుర్తించాం. ఇష్టపడటంలో తప్పుచేసామని అనిపిస్తోంది. ఒకరి స్వభావం మరొకరితో కలవదు. ఇక ఇద్దరికీ ఎలా కలుస్తుంది, ఏం చేస్తే సుఖంగా జీవించగలుగుతాం?

**దాదాశ్రీ :** మీరు చెప్తున్న దానిలో ఒక్క మాటలో కూడా నిజం లేదు. మొదటిది, పెళ్ళయిన తర్వాత ఇద్దరు వ్యక్తులూ ఒకరినొకరు గుర్తిస్తారు. కానీ, నామమాత్రంగా కూడా గుర్తించరు. ఒకవేళ గుర్తించేవుంటే ఈ గొడవే ఉండదు. కొద్దిగా కూడా గుర్తించరు.

నేనైతే కేవలం బుద్ధి డివిజన్ (విభాగం) నుంచే అభిప్రాయభేదాలను సమాప్తం చేసాను. కానీ నాకు హీరా బా ని గుర్తించటం ఎప్పుడు జరిగింది? అరవై సంవత్సరాల వయసులో హీరా బా ని గుర్తించగలిగాను. 15 సంవత్సరాల వయసులో పెళ్ళయింది. 45 సంవత్సరాలు ఆమెని పరిశీలించాను. అప్పుడు నేను ఆమెని గుర్తించాను 'ఇలాంటిది' అని.

**ప్రశ్నకర్త :** అంటే జ్ఞానం పొందిన తర్వాత గుర్తించారా?

**దాదాశ్రీ :** ఔను జ్ఞానం పొందిన తర్వాత గుర్తించాను. లేకపోతే గుర్తించివుండే వాడిని కాను. మనిషి గుర్తించలేడు. మనిషి తనను తాను గుర్తించలేడు, నేను ఇలాంటివాడిని అని. అంటే, 'మేమిద్దరం ఒకరినొకరం గుర్తించాం' అనే మాటలకు అర్థం లేదు. పైగా, ఇష్టపడటంలో తప్పేమీ జరగలేదు.

**ప్రశ్నకర్త :** ఎలా గుర్తించవచ్చు అన్నది తెలియజేయండి. పతి తన పత్నిని నెమ్మది నెమ్మదిగా సూక్ష్మరూపంలో ప్రేమ ద్వారా ఏవిధంగా గుర్తించవచ్చు అన్నది వివరించండి.

**దాదాశ్రీ :** ఎప్పుడు గుర్తిస్తావు? ముందు సమానత్వంతో పందెం ఆడేటప్పుడు. ఆమెకి స్పేస్ ఇవ్వాలి. పందెంలో ఎదురెదురుగా కూర్చున్నప్పుడే పందెం సమానంగా సాగుతుంది. అప్పుడే ఆటలో మజా వస్తుంది. కానీ, వీళ్ళు సమానత్వంతో పందెం ఏం ఆడుతారు? నేను సమానంగా పందెం కడతాను.

**ప్రశ్నకర్త :** ఏవిధంగా ఇస్తారు? ప్రాక్టికల్‌గా ఏవిధంగా ఇస్తారు?

**దాదాశ్రీ :** ఆమెకు మనసులో తాను వేరు అనే భావన కలుగనీయను. ఆమె ఎక్కువతక్కువ మాట్లాడినా, అప్పటికీ ఆ విధంగా సమానంగా చూస్తాను. అంటే ప్రెషర్ చెయ్యను.

అంటే, ఎదుటివారి మనస్తత్వాన్ని గుర్తించాలి, మనస్తత్వం ఇలాంటిది అలాంటిది అని. తర్వాత వేరే మార్గం వెతికిపట్టుకోవాలి. నేను వేరే విధంగా పని జరిగేటట్లు

చూస్తాను ఇతరులతో. నా మాట వింటారా లేదా? వింటారు. అది ఎందుకంటే ఏదో కౌశలం ఉందని కాదు, నేను వేరే విధంగా పని జరిపిస్తాను.

ఇంట్లో ఉండటం ఇష్టం లేదనుకో, అయినప్పటికీ అంటాను, నువ్వు లేకపోతే నాకు బావుండదు అని. అప్పుడు ఆమె అంటుంది, నువ్వు లేకుండా నాకూ బావుండదు అని. అప్పుడు మోక్షానికి వెళ్ళగలం. దాదా కలిసారు కదా, అందువలన మోక్షానికి వెళ్ళగలుగుతాము.

**ప్రశ్నకర్త :** మీరు హీరా బా కి చెప్తారా?

**దాదాశ్రీ :** ఆ. నేను హీరా బా కి ఇప్పటికీ చెప్తానుగా.

నేను ఇప్పటికీ ఈ వయసులో కూడా, హీరా బా తో అంటాను, 'మీరు లేకుండా నేను బయటకు వెళ్తాను కానీ నాకు బాగనిపించదు' అని. అప్పుడామె మనసులో ఏమని అనుకుంటుంది? 'నాకు బాగానే ఉంటుంది కదా మరి ఆయనకి ఎందుకు బావుండదు' అని. అలా మాట్లాడితే సంసారం చెడిపోకుండావుంటుంది. ఇక నువ్వు నెయ్యి వేయి ఇక్కడి నుంచి. వెయ్యకపోతే ఎండిపోతుంది. మంచి భావనను రానీ. వీళ్ళు కూర్చున్నారు కదా, నేను చెప్తే హీరా బా అంటుంది, 'నేను కూడా మీకు గుర్తొస్తుంటానా?' అని. నేను 'బాగా. మనుషులు గుర్తొస్తారు, అలాంటప్పుడు మీరు గుర్తు ఎందుకు రారు?' అని అంటాను, నిజంగా గుర్తొస్తుంది కూడా, గుర్తు రాదని కాదు.

మా లైఫ్ (జీవితం) ఆదర్శవంతమైనది! హీరా బా కూడా అంటుంది, 'మీరు త్వరగా రండి' అని.

స్త్రీకి పతి అవటం వచ్చింది అని ఎప్పుడు అంటారంటే, స్త్రీ నిరంతరం పూజ్యతను అనుభవిస్తుంటే. పతి ఎలా ఉండాలి? ఎప్పుడూ స్త్రీకి, సంతానానికి, ఎటువంటి కష్టం కలుగనీయకుండా ఉండాలి. స్త్రీ ఎలా ఉండాలి? ఎప్పుడూ పతికి కష్టం కలిగించకుండా, అతని మీద ఆలోచనలలోనే జీవితాన్ని గడపాలి.

## [ 17 ] భార్యతో వివాదం

ఇద్దరూ ఎంత జాలీగా కేరింతలు కొట్టినా, లడాయి జగడాలు పెట్టుకున్నా, ఒకరి మీద మరొకరు కేసులు పెట్టుకోగూడదు. మనమేమైనా మధ్యలోకి వెళ్తే, వాళు ్ళ తమ పని చేయించుకుంటారు, వాళ్ళు మళ్ళీ ఏకమైపోతారు. వేరే ఇంటికి పోవటానికి చూడరు. దీన్ని 'తోతా మస్తీ' (చిలకాట) అంటారు. నేను వెంటనే అర్థం చేసుకుంటాను ఆ ఇద్దరిలో తోతా మస్తీ మొదలైందని.

ఒక గంటసేపు నౌకర్‌ని కాని, పిల్లలను కాని, లేక భార్యని కాని మళ్ళీ మళ్ళీ కోప్పడ్డావనుకో, వాళ్ళు (మరుజన్మలో) భర్త కాని, లేక అత్తగారు కాని అయ్యి మిమ్మల్ని జీవితాంతం వేధిస్తారు. న్యాయం జరగాలా వద్దా? దాన్నే అనుభవించాల్సి వుంటుంది. ఎవరికైనా మీరు దు:ఖాన్ని కలిగించినట్లయితే, మీకు జీవితాంతం దు:ఖం కలుగుతుంది. కేవలం ఒక గంట కష్టపెడితే, దాని ఫలితం జీవితాంతం ఉంటుంది. మళ్ళీ అరుస్తావు, 'భార్య నన్ను అలా ఎందుకు చేస్తుంది?' అంటూ. భార్యకి, 'నా భర్తతో నాకు ఎందుకు ఇలా అవుతోంది' అనిపిస్తుంది. ఆమెకి కూడా బాధ కలుగుతుంది కాని ఏం చెయ్యాలి? అప్పుడు నేను అతన్ని, 'మీ భార్య మిమ్మల్ని వెతికి తెచ్చుకుందా లేక మీరే భార్యని వెతికి తెచ్చుకున్నారా?' అడిగితే అతను, 'నేను వెతికి తెచ్చుకున్నాను' అన్నాడు. మరి ఇక పాపం ఆమెదేం తప్పు? మీరు తీసుకునివచ్చిన తర్వాత వంకరిదైతే అందులో ఆమేం చేస్తుంది, ఎక్కడికి పోతుంది మళ్ళీ?

**ప్రశ్నకర్త :** అబోలా (జగడం వలన పరస్పరం మాటలు లేకపోవటం) పెట్టుకుని మాట వినిపించుకోకపోతే దానికి నివారణ ఎలా చెయ్యవచ్చు?

**దాదాశ్రీ :** అలా జరగదు. మీకు ఎదురు పడ్డపుడు, 'ఎలా ఉన్నావు? ఎలా లేవు?' అంటూ మాట్లాడాలి. ఎదుటివారు కాస్త అరిచి గగ్గోలు పెట్టినా మీరు సమభావంతో పరిష్కరించుకోవాలి. దానికి నివారణయితే జరగాలి కదా ఎప్పుడో ఒకప్పుడు? మాటలాడుకోకుండా ఉంటే నివారణ జరగటం ఎలా అవుతుంది? అది నివారణ కాదు కనుకనే మాటలాడుకోవటం ఆగిపోయివుంది. మాట్లాడకపోవటం

అంటే భారమే. ఏ విషయాన్నయితే ముగించలేదో దాని భారం. మనం వెంటనే ఆపి, 'ఆగండి. నా తప్పేమైనా ఉంటే చెప్పండి. నాతో తప్పులు చాలా జరుగుతుంటాయి. నువ్వు తెలివైనదానవు, చదువుకున్న దానివి కనుక తప్పు నీ వలన జరగదు. కాని నేను తక్కువ చదువుకున్నవాడిని కనుక నా వలన తప్పులు జరుగుతుంటాయి' అనాలి. అలా అంటే ఆమె సంతోషపడుతుంది.

**ప్రశ్నకర్త :** అలా అన్నా ఆమె మెత్తబడకపోతే ఏం చెయ్యాలి?

**దాదాశ్రీ :** మెత్తబడకపోతే మీకేంటి? మీరు అలా అని ఊరుకోండి మరింకేం ఉపాయముంది? ఏదో ఒక రోజు ఆమె మెత్తబడే తీరుతుంది. ఒకవేళ బెదిరించి మెత్తబడేటట్లు చేద్దామని చూస్తే అసలు మెత్తబడదు. ఈరోజు మెత్తబడినట్లు కనిపించినా, మనసులో *నోంధ్* (అత్యంత రాగం లేక ద్వేషంతో దీర్ఘకాలం వరకు గుర్తుంచుకోవటం) జరుగుతుంది. మరి మీరు మెత్తబడ్డప్పుడు, అదంతా వెళ్ళగక్కుతుంది. అంటే జగత్తు వైరాలతో కూడింది. ప్రకృతి నియమం ఏమిటంటే, ప్రతి ఒక్క జీవి లోపల వైరభావం కలిగి ఉంటుంది. లోపల పరమాణువులను సమీకరించి పెట్టుకుంటుంది కనుక, మనం కేసుని సంపూర్ణంగా పరిష్కరించాలి.

**ప్రశ్నకర్త :** అయితే మరేమీ మాట్లాడవద్దా?

**దాదాశ్రీ :** మాట్లాడాలి కాని సరిగ్గా మాట్లాడాలి, మాట్లాడటం వస్తే. అంతేకానీ, కుక్కలాగా భౌ భౌమంటే ఏమిటి అర్థం? అంటే పద్ధతిగా మాట్లాడాలి.

**ప్రశ్నకర్త :** పద్ధతిగా అంటే ఎలా?

**దాదాశ్రీ :** ఓహెూహెూ! నువ్వు ఈ పిల్లవాడిని ఎందుకు కిందపడేసావు? కారణం ఏమిటి? అంటే ఆమె, 'కావాలని నేను పడేస్తానా? నా చేతిలోంచి జారి పడిపోయాడు' అంటుంది.

**ప్రశ్నకర్త :** అలా ఆమె అబద్ధం చెప్తుంది కదా?

**దాదాశ్రీ :** ఆమె అబద్ధం చెప్తోందా అన్నది మనం చూడవద్దు. అబద్ధం

చెప్పటం, నిజం చెప్పటం అనేది ఆమె ఆధీనంలో ఉంటుంది కానీ మీ ఆధీనంలో ఉండదు.

**ప్రశ్నకర్త :** అలా చెప్పటం రాకపోతే ఏం చెయ్యాలి? మాట్లాడకుండా కూర్చోవాలా?

**దాదాశ్రీ :** మౌనంవహించి, 'ఏం జరుగుతుందో' చూస్తుండు. సినిమాలో చిన్నపిల్లవాడిని పడేస్తుందనుకో, ఏం చేస్తారు మీరు? అనే అధికారం అందరికీ ఉంది కానీ, క్లేశం పెరగని విధంగా మాట్లాడే అధికారం ఉంది. ఇక క్లేశం పెరిగే విధంగా మాట్లాడితే అది మూర్ఖుల పని.

**ప్రశ్నకర్త :** మనం జగడం పెట్టుకోవద్దా అంటే, నేను జగడమే పెట్టుకోకపోయినా, ఇంట్లో అందరూ ఎదుటపడి జగడం పెట్టుకుంటూవుంటే అప్పుడేం చెయ్యాలి?

**దాదాశ్రీ :** మనం 'జగడంప్రూఫ్' అయిపోవాలి. 'జగడంప్రూఫ్' అయిపోతేనే ప్రపంచంలో బ్రతకగలుగుతాం. నేను మిమ్మల్ని 'జగడంప్రూఫ్' చేసేస్తాను. జగడమాడేవాడు కూడా అలసిపోయేటట్లుగా ఉండాలి మన స్వరూపం. 'వర్ల్డ్' మొత్తంలో ఎవరూ మనల్ని 'డిప్రెస్' చేయలేనట్లుగా తయారవ్వాలి. మనం 'జగడంప్రూఫ్' అయితే ఇక ఇబ్బందే ఉండదుకదా. మనుషులు జగడం పెట్టుకున్నా, తిట్లకు లంకించుకున్నా కూడా బాధ లేదు. అంతేకాదు సిగ్గులేనివాడివని కూడా అనిపించుకోవు సరికదా జాగృతి బాగా పెరుగుతుంది.

పూర్వం జగడం పెట్టుకున్నవారితో వైర బంధం ఏర్పడివుంటుంది. అది ఇప్పుడు జగడం రూపంలో తీర్చుకోవటం జరుగుతుంది. జగడం మొదలైనప్పుడే వైరం బీజం పడిపోతుంది, అది మరుజన్మలో అంకురిస్తుంది.

**ప్రశ్నకర్త :** మరి ఈ బీజం ఏవిధంగా దూరమౌతుంది?

**దాదాశ్రీ :** నెమ్మది నెమ్మదిగా సమభావంతో తీసివేస్తే దూరమౌతుంది. చాల పెద్ద బీజమైతే సమయం పడుతుంది. శాంతంగా ఉండాలి. ప్రతిక్రమణ ఎక్కువగా

చేయవలసి వుంటుంది. మనది ఎవరూ తీసుకోలేరు. రెండు పూటలూ తినటానికి, దుస్తులు లభిస్తే ఇంకేం కావాలి? గదికి తాళం వేసుకునిపోతాం కానీ రెండు పూటలూ తినటానికి దొరుకుతుందా లేదా అన్నదే చూడాలి. నన్ను ఇంట్లో బంధించి పోయినా ఏం పరవాలేదు. నేను నిద్రపోతాను. పూర్వజన్మలోని వైరం అలా బంధాలుగా ఉంటే తాళం వేసి నన్ను బంధించి పోనీ. వైరం, అతను కూడా అజ్ఞానంలో బంధించబడివున్నాడు. అర్థం చేసుకునేవాడయితే నేను అర్థం చేసుకుంటాను అతను అర్థం చేసుకునేవాడు అని. అప్పుడైనా సమాధానం దొరుకుతుంది. ఇక అర్థం చేసుకోనివాడయితే అక్కడ సమాధానం ఎలా దొరకుతుంది? అందువలన అక్కడ మాట్లాడటం మానేయాలి.

ఇక వైరాలన్నిటినీ వదిలేయాలి. అందువలన నా దగ్గరి నుంచి 'స్వరూప జ్ఞానం' తీసుకుంటే అప్పుడు వైరాలన్నీ వదిలిపోతాయి. ఈ జన్మలోనే వైరాలన్నిటినీ వదిలేయాలి. నేను మీకు దారి చూపిస్తాను.

నల్లులు కుట్టుతాయి. పాపం అవి మంచివే కాని, భర్త భార్యని కుట్టటం, భార్య భర్తని కుట్టటం ఇవి చాల ఎక్కువ బాధిస్తాయి. ఏం? కుట్టుతారా లేదా?

**ప్రశ్నకర్త :** కుట్టుతారు.

**దాదాశ్రీ :** కాబట్టి ఈ కుట్టటాన్ని నిలిపివేయాలి. నల్లులు కుడతాయి, కుట్టి వెళ్ళిపోతాయి. పాపం అవి తృప్తిపడి వెళ్ళిపోతాయి కాని, భార్యయితే ఎప్పుడూ కుట్టుతూనే వుంటుంది. ఒక మనిషి నాతో, 'నా వైఫ్ నన్ను ఆడపాములా కుట్టుతుంటుంది' అన్నాడు. మరి పెళ్ళెందుకు చేసుకున్నావు ఆడపాముతో? అతను పాము కాదా? అలాగే ఆడపాము దొరికివుంటుంది. మగ పాము కాబట్టే, ఆడ పాము వచ్చింది.

నేను అర్థం చేసుకునేదల్లా, జగడం అయిన తర్వాత వైఫ్‌తో వ్యవహారమే పెట్టుకో దలచుకోకపోతే వేరే సంగతి కానీ, మళ్ళీ మాట్లాడాలి అంటే మధ్యలోని భాషంతా తప్పు. రెండు గంటల తర్వాత మళ్ళీ మాట్లాడాలనే లక్ష్యం నాకు ఉంటుంది కనుక,

ఆమెతో కీచులాట పెట్టుకోను. ఒకవేళ మీ అభిప్రాయాన్ని మార్చుకోవాలంటే అది వేరు. మీ అభిప్రాయం మారలేదంటే మీరు చేసింది సరే. మళ్ళీ వైఫ్‌తో కూర్చోవటమే ఉండకపోతే మాత్రం మీరు చేసిన జగడం సరైనదే. కాని మళ్ళీ మరుసటి రోజున కలిసి భోజనం చెయ్యబోతుంటే, చేసిన నాటకమంతా ఏమిటి? అది ఆలోచించాలా వద్దా?

అన్నిటికన్నా ముందు భర్త భార్యను క్షమించమని అడగాలి. భర్తల మనసు విశాలంగా ఉంటుంది. భార్య ముందుగా క్షమాపణ కోరదు.

**ప్రశ్నకర్త :** భర్త మనసు ఉదారమైనదని అన్నారు కనుక వాళ్ళు సంతోషపడ్డారు.

**దాదాశ్రీ :** లేదు, వాళ్ళ మనసు ఉదారమైనదే. వాళ్ళ మనసు విశాలంగా ఉంటుంది. స్త్రీల మనసు సాహజికంగా ఉంటుంది. సాహజికంగా ఉంటుంది కాబట్టే లోపల ఉదయిస్తే క్షమాపణ కోరవచ్చు, కోరకపోవచ్చు. కానీ మీరు కోరితే ఆమె వెంటనే ఒప్పుకుంటుంది, ఇక మీరు ఉదయించిన కర్మ ఆధీనంలో ఉండరు. మీరు జాగృతి ఆధీనంలో ఉంటారు. ఆమె ఉదయ కర్మ ఆధీనంలో ఉంటుంది. అది సహజం అనబడుతుంది కదా! స్త్రీ సహజం అనబడుతుంది. మీలో సహజత్వం రాదు. సహజం ఐనట్లయితే చాల సుఖపడతారు.

**ప్రశ్నకర్త :** ఈ అహం తప్పు అని మాకు చెప్తారు, వీళ్ళంతా వింటారు, సంత్ పురుష్‌లు కూడా అలాగే చెప్తుంటారు, అయినా అహం పోదు ఎందుకని?

**దాదాశ్రీ :** అహం ఎప్పుడు పోతుంది? అది తప్పు అని మనం యాక్సెప్ట్ చేసినప్పుడు పోతుంది. వైఫ్‌తో గొడవలు జరుగుతుంటే, మనం అర్థం చేసుకోవాలి మన అహం తప్పని. అందువలన మళ్ళీ మీరు రోజూ ఆ అహంతో కూడా లోపల దాన్ని క్షమాపణ కోరుకోండి, అప్పుడు ఆ అహం పోతుంది. ఏదో ఒక ఉపాయం చేయాలి కదా?

నేను ఈ సరళమైన, తిన్నని మార్గాన్ని సూచిస్తాను. ఈ గొడవలు రోజూ అవుతాయా ఏమిటి? అవి కేవలం మన కర్మ ఉదయించినపుడు అవుతాయి. ఆ సమయాన్ని మీరు అడ్జస్ట్ చేసుకోవాలి. ఇంట్లో భార్యతో జగడమైనట్లయితే, జగడం అయిన తర్వాత వైఫ్‌ని హోటల్‌కి తీసుకెళ్ళి భోజనం చేయించి ఆనందపరచాలి. ఇక తంతం ఏమీ మిగలగూడదు.

అందువలన, ఈ 'జ్ఞానం' ఉంటే ఆ చికాకులు ఉండవు. జ్ఞానం ఉంటే మనం రోజూ ఉదయమే దర్శనం చేసుకుంటాం కదా. వైఫ్ లోపల భగవానుని దర్శనం కూడా చేసుకోవాలి కదా! వైఫ్‌లో కూడా దాదా కనిపిస్తే శుభమౌతుంది. వైఫ్‌ని చూస్తే దాదా కనిపిస్తారు కదా! ఆమె లోపల కూడా శుద్ధాత్మ కనపడుతుంది కదా! అయితే శుభమే జరుగుతుంది.

అందుకే ఏం చేసైనా అడ్జస్ట్ అవుతూ సమయాన్ని గడపితే అప్పు తీరిపోతుంది. ఒకరికి పాతిక సంవత్సరాలు, ఒకరికి పదిహేను సంవత్సరాలు, ఒకరికి ముప్పై సంవత్సరాలు, ఇష్టం లేకున్నా అప్పు తీర్చవలసిందే. ఇష్టం లేకపోయినా ఒకే గదిలో కలిసివుండాల్సిందే. ఇక్కడ పక్క బాయిది అయితే అక్కడ పక్క భాయ్‌ది. ముఖం మాడ్చుకుని పడుకున్నప్పటికీ బాయి గారి ఆలోచనలు భాయ్‌సాహెబ్ గురించే వస్తాయి కదా! వేరే దారే లేదు. ఈ ప్రపంచమే అలాంటిది. అందులో మీకు కేవలం ఆమే ఇష్టం లేదు అనేమీ కాదు, ఆమెకు కూడా మీరు ఇష్టం లేరు. అంటే ఇందులో ఆనందపడే విషయమేమీ లేదు.

'డోంట్ సీ లా, ప్లీజ్ సెటిల్' (చట్టాన్ని చూడకు, సమాధానపడు). ఎదుటివారిని సెటిల్‌మెంట్ చేసుకుందామని అడుగు. 'నువ్వలా చెయ్యి, ఇలా చెయ్యి' అని చెప్పటానికి సమయం ఎక్కడుంది? ఎదుటివారిలో వంద తప్పులే ఉండనీ, నీవు నీ తప్పులను ఒప్పుకుని ముందుకు సాగు. ఈ కాలంలో 'లా (నియమం)' ని ఎక్కడైనా చూస్తుండవచ్చేమో? వీళ్ళయితే అంతిమ చరణాన్ని చేరుకున్నారు.

**ప్రశ్నకర్త :** చాలసార్లు ఇంట్లో పెద్ద పెద్ద గొడవలే జరుగుతాయి అప్పుడేం చెయ్యాలి?

**దాదాశ్రీ :** తెలివైనవాడికి లక్ష రూపాయలిచ్చినా కానీ గొడవ పెట్టుకోరు. కానీ ఇతనైతే డబ్బు లేకుండానే గొడవలు పెడతాడంటే తెలివితక్కువవాడుకాక మరేమిటి? భగవాన్ మహావీర్‌కి కర్మ నాశనం చేయటం కోసం 60 మైళ్ళు నడిచి ఒక మూర్ఖుల క్షేత్రానికి వెళ్ళవలసివచ్చింది. ఇప్పుడు మనుషులంతా పుణ్యవంతులు. ఇంట్లో కూర్చునే మూర్ఖపు క్షేత్రం వెళ్తారు! ఎంతటి అహోభాగ్యం! ఇది ఎంతో లాభదాయకం, కర్మ నాశనం చేసుకునేందుకు, తిన్నగా నడుచుకుంటే.

ఇంట్లో ఎవరైనా ఏమైనా అడిగితేనే, సలహా అడిగితేనే జవాబివ్వు. అడక్కుండా సలహాలు ఇవ్వటాన్ని భగవాన్ 'అహంకారం' అన్నారు. ఈ కప్పు ఎక్కడ పెట్టాలి అని భర్త అడిగితే, అక్కడ 'ఫలానా జాగాలో పెట్టు! అని భార్య జవాబు చెప్తుంది. అప్పుడు మీరు అక్కడ పెట్టండి. దానిబదులు అతను, 'నీకు తెలివి లేదా ఇక్కడెక్కడ పెట్టమని అంటున్నావు?' అంటే భార్య, 'తెలివి లేదు కనుకనే నేను అలా చెప్పాను. ఇప్పుడిక నీ తెలివి ఉపయోగించి పెట్టు' అంటుంది. ఇక దీనికి పరిష్కారం ఎప్పుడు వస్తుంది? ఇది కేవలం సంయోగాల కలయికే. ఈ బొంగరాలు తినేటప్పుడు, పడుకుని లేచేటప్పుడు తగులుకుంటూనేవుంటాయి. బొంగరాలు కొట్టుకుంటాయి. చీరుకుంటాయి, రక్తం కారుతుంటుంది! అలా మానసిక రక్తం కారుతుంది! అది రక్తమైతే మంచిదే, పట్టీ కట్టుకుంటే నయమైపోతుంది. ఈ మానసిక గాయం మీద పట్టీ వేయటం అవదు కదా!

ఇంట్లో ఎవరికైనా, భార్యకో, చిన్న పాపకో, ఏ జీవికైనా కష్టం కలిగించి మోక్షానికి పోలేరు. ఏ కాస్త *తర్‌ఛోడ్* (విముఖత) కలిగినా, అది మోక్షానికి మార్గం అవదు.

**ప్రశ్నకర్త :** తిరస్కారం, *తర్‌ఛోడ్,* ఈ రెండిటిలో తేడా ఏమిటి?

**దాదాశ్రీ :** *తర్‌ఛోడ్,* తిరస్కారం పదాలలో, తిరస్కారమనేది లేనట్లే. *తరఛోడ్*‌తో పోలిస్తే తిరస్కారం అనేది చాల మైల్డ్ వస్తువు. *తరఛోడ్* ది ఉగ్ర స్వరూపం. *తరఛోడ్* తో వెంటనే రక్తం చిందుతుందా అన్నంత. దానితో ఈ శరీరంలోని రక్తం చిమ్మదు కానీ మనసులోని రక్తం కారుతుంది. *తరఛోడ్* అంత బలమైనది.

ఒక సోదరి ఉండేది, ఆమె నాతో అంటుండేది, 'పూర్వ జన్మలో మీరు నా ఫాదర్ అని అనిపిస్తోంది' అని. ఆమె చాల మంచిది, సంస్కారవంతురాలు. నేను ఆమెను, 'ఈ భర్తతో మీ సంబంధం ఎలా ఉంది?' అని అడిగాను. అప్పుడామె, 'ఆయన ఏమీ మాట్లాడరు, ఏమీ అనరు' అంది. అప్పుడు నేను, 'ఏదో ఒక రోజు ఏదో ఒకటి జరుగుతుందేమో?' అని అడిగితే, 'లేదు, ఎప్పుడైనా ఎత్తిపొడుపు మాటలు అంటారు' అని చెప్పింది. దానితో నేను అర్థం చేసుకున్నాను. 'ఆయన ఎత్తిపొడుపు మాటలు అంటుంటే అప్పుడు ఏం చేస్తుంటావు? అప్పుడు కర్ర తీసుకునివస్తావా లేదా?' అని అంటే, ఆమె, 'లేదు, కర్మ ఉదయం వలన నేను, మీరు కలిసాము. నేను వేరు, మీరు వేరు. ఇప్పుడు ఎందుకలా చేస్తున్నావు? ఎందుకీ ఎత్తిపొడపు మాటలు, ఏమిటిదంతా? ఇందులో ఎవరి తప్పు కూడా లేదు. ఇదంతా కర్మ ఉదయం వలన కలిగిన దోషం. అందువలన నన్ను ఏమైనా అనే బదులు కర్మని పోగొట్టుకుండూ ఉండరాదా?' అంటాను అన్నది. ఈ తగవు చాల బావుంది కదా! ఇప్పటి వరకూ చాలమంది స్త్రీలను చూసాను. కానీ ఇంత ఉచ్ఛ స్థితిలో తెలుసుకునివున్న ఆడమనిషిని ఈమెనే చూసాను.

నాది మౌలికంగా క్షత్రియ స్వభావం. నాది క్షత్రియ రక్తం కనుక, నా పైన (బాస్, వరిష్ఠ యజమాని) ని బెదిరించే అలవాటుంది, అండర్‌హ్యాండ్ కి రక్షణ కల్పించే అలవాటుంది. ఇది క్షత్రియ ధర్మ మూలగుణం అంటే, అండర్‌హ్యాండ్ కి రక్షణ కలిగించే అలవాటు. అందువలన వైఫ్ మరి ఇతరులు నాకు అండర్‌హ్యాండ్ కనుక వాళ్ళకి రక్షణ కలిగించే అలవాటు. వాళ్ళేమైనా తప్పులు చేసినా వాళ్ళని కాపాడే అలవాటు. నౌకరుంటే వాళ్ళ రక్షణను చూసుకుంటాను. వాళ్ళు తప్పులు చేసినా పాపం వాళ్ళనేమీ అనను. కానీ, నా పైవాళ్ళయితే వాళ్ళ సంగతి చూసుకోనా? అయితే వర్ల్డ్ అంతా అండర్‌హ్యాండ్‌తో కీచులాట పెట్టుకుంటుంది. అరె, స్త్రీ లాంటి వాడవు నీవు. స్త్రీ అలా చేస్తుంది అండర్‌హ్యాండ్‌ని. ఇది మీకు ఎలా అనిపిస్తోంది?

మీరు పెళ్ళిచేసుకుని ఇంటికి తీసుకునవచ్చి, భార్యను తిడుతున్నారు అంటే ఇది ఆవుని తీసుకునివచ్చి గుంజకి కట్టేసి కొడుతున్నట్లే. గుంజకి కట్టేసి కొడుతుంటే

అప్పుడు? ఇటువైపు నుంచి కొడితే అటు పోతుంది, అటు వైపు నుంచి కొడితే ఇటు పోతుంది అది పాపం! అది ఒక గుంజకి కట్టేసినప్పుడు ఎక్కడికి పోతుంది? సమాజపు గుంజ ఎలాంటిదంటే, పారిపోవటం కూడా కుదరదు. గుంజకి కట్టేసివున్నదాన్ని కొట్టినట్లయితే చాల పాపం తగులుతుంది. గుంజకి కట్టేయకపోతే చేతికి దొరకదు కదా! ఇక్కడ సమాజం వలన అణిగి వుంటుంది కాని లేకపోతే ఎప్పుడో పారిపోయేది. డైవర్స్ ఇచ్చిన తర్వాత కొట్టి చూడు? అప్పుడేం జరుగతుంది?

నిమిషం కూడా కష్టం రానివ్వనివాడే పతి. మిత్రులతో సంబంధం చెడిపోకుండా ఎలా ఉంటారో అలా కాపాడుకోండి. మిత్రునితో కాపాడుకోకపోతే మైత్రి తెగిపోతుంది. మిత్రాచారి అంటే మిత్రాచారి. షరతు ఏమిటో చెప్పండి 'నువ్వు మిత్రాచారంలో ఉన్నావు. ఔట్ ఆఫ్ మిత్రాచారమైపోతే తప్పవుతుంది. కలిసిమెలిసి మిత్రాచారాన్ని నిలబెట్టుకుందాం'

ఫ్రెండు పట్ల సిన్సియర్‌గా ఉంటావు. ఎంతవరకు అంటే, దూరంగా ఉన్నప్పటికీ, 'నా ఫ్రెండు ఇలాంటివాడు. నా గురించి ఎప్పుడూ చెడుగా ఆలోచించడు' అంటారు. అదే విధంగా భార్య గురించి కూడా తప్పుగా ఆలోచించగూడదు. ఆమె ఫ్రెండు కంటే ఎక్కువ కాదా?

## [ 18 ] భార్య వడ్డీతో సహా తిరిగిస్తుంది

రాత్రి భార్యతో మీకు గొడవ జరిగివుంటే, ఆమె ఆవేశం ఉదయం వరకు ఉంటుంది. అందుకే పొద్దున టీ ఇచ్చేటప్పుడు ఇలా పటుక్కున పెడుతుంది. ఇంకా కోపం అలాగే ఉందని, శాంతపడలేదని మీరు అర్థం చేసుకుంటారు. అలా పట్టుక్కున పెట్టటమే ఆవేశం అంటే.

'ఆమె ఏం చేస్తుంది? ఆమె ఎందుకలా చేస్తుంది? ఆమె మిమ్మల్ని అణచివేద్దామని అనుకుంటోంది. నువ్వు క్రోధం తెచ్చుకుంటే ఆమె అనుకుంటుంది, ఆ కానీ మెత్తబడ్డాడు అని. కోపం తెచ్చుకోకపోతే ఆమె ఇంకా ఎక్కువ చేస్తుంది.' అలా కలహం జరిగిన తర్వాత కూడా భర్త కోప్పడకపోతే, లోపలికి పోయి రెండు మూడు గిన్నెలను ఇలా

కిందపడేస్తుంది. అవి పడ్డ చప్పుడు రాగానే భర్త చిర్రెత్తిపోతాడు. అయినా చిర్రెత్తకపోతే కొడుకుని గిల్లి ఏడిపిస్తుంది. ఇక చికాకు పడిపోతాడు పాపం! 'నువ్వెందుకు వాడి వెనక పడ్డావ్, పిల్లలనెందుకు మధ్యలోకి తెస్తావ్? అట్లా ఇట్లా....' దానితో ఆమె అర్థం చేసుకుంటుంది ఆయన చల్లబడ్డాడని.

మగవాడు ఆ సందర్భాన్ని మర్చిపోతాడు కాని స్త్రీ జీవితాంతం గుర్తుంచుకుంటుంది. మగవాళ్ళు అమాయకులు, విశాల హృదయులు, భద్రికులు కనుక పాపం వాళ్ళు మరచిపోతారు. స్త్రీలైతే ఆ రోజు అలా అన్నావు, అది నా గుండెకి తగిలింది అంటారు ఎప్పుడైనా. అరె, ఇరవై సంవత్సరాలైనా ఆ విషయాలన్నీ తాజాగానే ఉంటాయి. కొడుకు ఇరవై సంవత్సరాలవాడయ్యాడు. అయినా ఆమె ఆమాటలను గుర్తుంచుకుందా? వస్తువులన్నీ చెడిపోతాయి కానీ ఈమె వస్తువులు చెడిపోవు. స్త్రీకి మీరిచ్చిన వస్తువులను వాటి అసలైన జాగాలో పెడుతుంది, గుండెల్లో. అందువలన ఇవ్వటాలు వద్దు. ఇదేమీ ఇవ్వవలసిన వస్తువూ కాదు. జాగ్రత్తగా ఉండవలసినటువంటిది.

ఎప్పుడైనా మీరు స్త్రీకి ఎంత అంటుంటే, అంత బాధ్యత వస్తుంది. ఎందుకంటే, మీ శరీరం ఆరోగ్యంగా ఉన్నంత వరకు ఆమె సహనం చూపిస్తుంది. మరి మనసులో ఏమని అనుకుంటుంది? కీళ్ళు బలహీనమైతే చూస్తా నీ సంగతి. వీళ్ళందరిలో కీళ్ళు బలహీనమైన వాళ్ళ సంగతి చూసుకుంది. నేను చూసాను కాబట్టే మనుషులకు సలహా ఇస్తాను, 'వద్దు బాబూ, భార్యతో గొడవ పెట్టుకోవద్దు. భార్యతో వైరం వద్దు. లేకపోతే చికాకులలో పడిపోతావు.

భారతీయ స్త్రీ తన మౌలిక సంస్కారపరంగా దేవీ స్వరూపమే. కాకపోతే బయటి సంస్కారాలు అంటుకున్నాయి కదా. అందువలన అవన్నీ భగ్గుమన్నాయి. భగ్గుమంటాయి. అందుకే శాస్త్రకారులు, '*रमा रमाडवी सहेल छे, विफरी तो महामुश्केल थई जाय*!' అన్నారు. అలా భగ్గుమనేటట్లుగా చేస్తారు. ఆమె వెంటపడి ఎగదోస్తారు, అన్నీ పోయి బాధితురాలవుతుంది. అంతవరకు పోగూడదు మీరు. మర్యాదను కాపాడాలి. స్త్రీని బాధిస్తుంటే పాపం ఆమె ఎక్కడికి పోతుంది? అందువలన

ఆమె వక్రంగా నడుస్తుంది. ముందు వక్రంగా (వంకరగా) వ్యవహరిస్తుంది, తర్వాత భగ్గుమంటుంది. ఆమె భగ్గుమంటే ఇక అంతే సంగతి. అందువలన ఆమెని వేధించకండి. లెట్ గో అనుకోండి.

స్త్రీ మండుతుంటే అప్పుడు మీ బుద్ధి పనిచేయదు, మీ బుద్ధి ఆమెని నియంత్రించదు. అందువలన ఆమె మండకుండా ఉండే విధంగానే మాట్లాడండి. కళ్ళల్లో ప్రేమ నింపుకుని ఉండండి. ఎప్పుడైనా అట్లా ఇట్లా అని అన్నా, స్త్రీ జాతి కదా, అందువలన లెట్ గో అనుకోండి. అంటే ఒక కంటిలో పూర్తిగా ప్రేమ ఉండాలి, మరో కంటిలో కాస్త కఠినత్వం ఉండాలి. అలా ఉండాలి. ఏ సమయంలో ఏది అవసరమో అలా. ప్రతి రోజు కఠినంగానూ ఉండగూడదు. ఆమెను ఒక కంటిలో కచ్చితత్వం, మరో కంటిలో దేవిలా చూడాలి. అర్థమైంది కదా?

**ప్రశ్నకర్త :** ఒక కంటిలో కచ్చితత్వం, మరో కంటిలో దేవి, ఒకే సమయంలో ఇదెలా సాధ్యం?

**దాదాశ్రీ :** మగవాడికి ఇవన్నీ వస్తాయి. నేను ముప్ఫై ముప్ఫై ఐదు సంవత్సరాల వయసులో ఉన్నపుడు, నేను ఇంటికి వస్తాను కదా అప్పుడు, హీరా బా ఒక్కతే కాదు, చుట్టుపక్కల ఆడవాళ్ళంతా ఒక కంటిలో కచ్చితత్తవం, మరో కంటిలో పూజ్య భావంతో ఉన్న నన్ను చూసేవారు. స్త్రీలంతా తల మీద ముసుగుతో కూర్చునివున్నవారంతా ఆశ్చర్యంగా చూసేవారు. హీరా బా అయితే నేను ఇంట్లోకి అడుగు పెట్టక ముందే భయపడేది. చెప్పుల శబ్దం వినే భయపడేది. ఒక కంట్లో కఠినత్వం, మరో కంట్లో మృదుత్వం. అలా లేకపోతే స్త్రీలను చూసుకోలేరు. అందువలన హీరా బా అంటుండేది, దాదా ఎలా ఉన్నారు అని.

**ప్రశ్నకర్త :** తీక్షణమైన భ్రమరం లాగానా?

**దాదాశ్రీ :** 'తీక్షణమైన భ్రమరం లా'. అలా ఎప్పుడూ ఉంచుకునేవాడిని. అలా అని ఆమెనేమీ బెదిరించేవాడిని కాను. ఇంటికి రాగానే నిశ్శబ్దం. అంతా మంచుపడ్డట్లు చల్లగా అయిపోయేది, చెప్పుల శబ్దం విన్న వెంటనే.

కఠినత్వం ఎందుకంటే, ఆమె మోసపోకుండా ఉండేందుకు, అందుకోసం కఠినంగా ఉండాలి. అందువలన ఒక కంట్లో కఠినత్వం, మరో కంటిలో ప్రేమ ఉంచుకోవాలి.

**ప్రశ్నకర్త :** అందుకే సంస్కృతంలో అన్నారు, 'యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతా' అని.

**దాదాశ్రీ :** ఆ అంతే. అందువలన నేను అలా అంటా కదా అప్పుడు, అందరూ నన్ను అడుగుతారు, 'మీరు స్త్రీల వెనకేసుకొస్తున్నారా లేక స్త్రీ పక్షపాతా?' అని.

అప్పుడు నేను, 'స్త్రీలను పూజించు' అంటాను. దాని అర్థం ఉదయాన్నే వెళ్ళి హారతివ్వమని కాదు. అలా చేస్తే ఆమె నీ తైలం తీస్తుంది. దాని అర్థం ఏమిటి? ఒక కంట్లో ప్రేమ, ఒక కంట్లో కఠినత్వం ఉంచుకోవాలి. అంటే పూజ చెయ్యవద్దు. అటువంటి యోగ్యత లేదు. కనుక, మనసులో పూజించాలి.

అంటే భార్యతో, 'నువ్వు నాతో ఎంత దెబ్బలాడాలనుకుంటే అంత దెబ్బలాడు. దాదా నన్ను దెబ్బలాడవద్దని చెప్పారు. దాదా నాకు ఆజ్ఞ ఇచ్చారు. నేను ఇక్కడ కూర్చున్నా ఇప్పుడు నన్నేం చెయ్యాలనుకుంటున్నావో చెప్పు' అని చెప్పండి.

**ప్రశ్నకర్త :** కాని, ఆమె చెప్పదుగా మరి.

**దాదాశ్రీ :** దాదా పేరెత్తగానే మాట్లాడకుండా ఉంటుంది. మరో ఆయుధమేమీ ఉపయోగించ వద్దు. ఈ ఆయుధాన్నే ఉపయోగించాలి.

ఒకామె నాతో. 'పెళ్ళయిన దగ్గరి నుంచి చాల పొగరుగా ఉండేవారు' అన్నది. నేను, 'ఇప్పుడు?' అని అడిగితే, 'దాదాజీ మీకు స్త్రీలందరి గురించీ తెలుసు, నాతో ఎందుకు చెప్పిస్తారు?' అంది. ఆయన నాతో సుఖాన్ని పొందాలంటే అప్పుడు నేను ఆయనతో, 'భాయ్‌సాబ్ చెప్పండి' అంటాను. అంటే, భాయ్‌సాబ్ అనిపిస్తాను అప్పుడు. 'అందులో నా తప్పేముంది? అంతకు ముందు నాతో భాయ్‌సాబ్ అనిపించేవారు, ఇప్పుడు నేను భాయ్‌సాబ్ అనిపిస్తున్నాను'. అర్థమౌతోందా?

ఈ అమల్‌దార్ కూడా ఆఫీసు నుంచి అలసిపోయి ఇంటికి వస్తాడు కదా, అప్పుడు బాయీ సాహెబ్ ఏమంటుంది? 'గంటన్నర లేటయింది ఎక్కడికి పోయావు' చూడు! అతని భార్య అతన్ని ఒకసారి బెదిరిస్తోంది. అప్పుడు పులిలాంటి ఆ మనిషి, గుజరాత్‌నంతా భయపెట్టేవాడు, అటువంటి మనిషిని కూడా భయపెట్టేది. చూడు మరి! గుజరాత్ మొత్తం మీద అతని పేరెత్తలేకపోయేవారు, అతని మాటలను అతని భార్య వినదు సరికదా అతన్నే బెదిరిస్తుండేది. ఇక నేను ఒక రోజు ఆమెను అడిగాను, 'బెహన్, మీ భర్త నిన్ను వంటరిగా వదిలి పది పదిహేను రోజులు బయటకు వెళ్తే?' అని. 'నాకు భయమేస్తుంది' అన్నదామె. 'ఎవరి వలన భయం?' అని అడిగితే ఆమె, 'లోపల రెండవ రూమ్‌లో కప్పు శబ్దం వినిపించినా, నా మనసులో భూతమేమైనా వచ్చిందేమో అనిపిస్తుంది' అంది. ఒక ఎలుక గ్లాసుని తగిలి శబ్దం చేసినా భయమేస్తుంది. మరి ఈ పతి! పతిని చూస్తే భయం వేయదా? ఆయననే నువ్వు భయపెడుతుంటుంది! పులివంటి భర్త తైలం పిండి తీస్తుంది.

ఒక వ్యక్తి మూడువేలకి ఒక గుర్రాన్ని తెచ్చాడు. రోజూ తండ్రి ఆ గుర్రం ఎక్కేవాడు. ఆయన కొడుకుకి ఇరవై నాలుగు సంవత్సరాలు. ఒకసారి కొడుకు గుర్రాన్ని ఎక్కి చెరువు వైపు పోయాడు. ఆ గుర్రాన్ని కాస్త గెలికాడు. దాన్నలా కెలకకూడదు. దాన్ని తన నడకలోనే నడవనీయాలి. మరి అతను దానితో ఆటలాడేటప్పటికి గుర్రం తన వెనక రెండు కాళ్ళ మీద నిలబడింది, ఆ అబ్బాయి కిందపడ్డాడు. మూట కిందపడింది. ఆ మూట ఇంటికొచ్చి ఏమంటాడు, 'ఈ గుర్రాన్ని అమ్మేసేయి. గుర్రం మంచిది కాదు.' వీడికి కూర్చోవటం చేతకాదు కాని గుర్రాన్ని తప్పుపడుతున్నాడు. చూడు, అతను దాని యజమాని! వీళ్ళంతా యజమానులు! ఇక నేను అన్నాను, 'ఔనా గుర్రం తప్పుదే. ఇది మూడువేల రూపాయల గుర్రం'. అరె, నీకు సవారీ చెయ్యటం రాకపోతే గుర్రానికి ఎందుకు చెడ్డపేరు అంటగడుతున్నావు?

ఒకసారి భర్త భార్య మీద ప్రతీకారానికి పోతే, దాని ప్రభావమే ఉండదు. మీ ఇల్లు బాగా నడుస్తోంది, పిల్లలు బాగా చదువుకుంటున్నారు, ఏ విషయంలోనూ ఎటువంటి సమస్యా లేదు, మరి అవి మీకు సరిగ్గా ఉన్నట్లు కనిపించకపోతే, మీరు

ఏ కారణం లేకుండానే ప్రతీకారం చేస్తుంటే, అప్పుడు మీ తెలివిని మీ ఆవిడ కొలవగలుగుతుంది, అందులో సారమేమీ లేదని.

మీకు స్త్రీలతో డీలింగ్ (వర్తనం) చేతకాదు. మీ వ్యాపారులకు వినియోగదారులతో డీలింగ్ చేయటం రాకపోతే, వాళ్ళు మీ దగ్గరకు రారు. అందుకే అంటారు 'సేల్స్‌మన్ మంచివాళ్ళను పెట్టుకో' అని. మంచి హుషారైన సేల్స్‌మన్ ఉంటే కొనేవారు కాస్త ఎక్కువ పెడతారు కూడా. అదేవిధంగా మీకు స్త్రీతో డీలింగ్ చేయటం రావాలి.

స్త్రీ జాతి కారణంగానే జగత్తులో అంతా వెలుగులతో నిండివుంది. లేకపోతే ఇంట్లో సాధువు కంటే కూడా పరిస్థితి ఘోరంగా ఉంటుంది. ఉదయం ఇల్లు ఊడవటం కూడా ఉండదు. టీ కూడా ఉండదు. అదంతా వైఫ్ ఉండి చెప్పటం వలనే పొద్దున్నే గబగబా లేచి స్నానం చేస్తారు. ఆమె వలనే అంతా శోభాయమానంగా ఉంటుంది. ఆవిడ శోభ మీ వల్లనే.

స్త్రీ అంటే సహజ ప్రకృతి. భర్తకి ఐదు కోట్ల రూపాయల నష్టం వచ్చినట్లయితే భర్త రోజంతా చింతిస్తుంటాడు. దుకాణంలో నష్టం వస్తే ఇంటికి వచ్చి తిండితిప్పలు మానేస్తాడు. కానీ భార్యయితే ఇంటికి రాగానే, 'లే. ఇక ఎక్కువగా బాధపడకు. టీ తాగు, తర్వాత నెమ్మదిగా భోజనం చెయ్యి' అంటుంది. సగం భాగస్వామ్యం ఉన్నప్పటికీ ఆమెకి చింత ఎందుకు కలుగదు? ఎందుకంటే ఆమె సాహజికం. కనుక, అటువంటి సహజంతో ఉంటే, జీవించటమనేది ఉంటుంది, లేకపోతే జీవించటం ఉండదు. ఇద్దరు మగవాళ్ళు కలిసివుంటే ఎదురెదురుగా చచ్చిపోతారు. అంటే స్త్రీ సహజస్వరూపం కనుకనే ఇంట్లో కొద్దో గొప్పో అనందం ఉంటుంది.

స్త్రీ దైవిక శక్తి. కానీ ఈ విషయం పురుషుడికి అర్థమైతే సవ్యంగా సాగుతుంది. స్త్రీ తప్పేమీ లేదు. మీరు తప్పుగా అర్థం చేసుకోవటమే తప్పు. స్త్రీలు దేవతలు. వాళ్ళని ఆ దేవతా స్థితి నుంచి కిందికి దించకండి. 'దేవి' అని అంటారు కదా. ఉత్తర ప్రదేశ్‌లో అయితే అక్కడక్కడ, 'రండి దేవీ' అంటారు. ఇప్పటికీ, 'శారదా దేవి వచ్చింది, ఫలానా మణి దేవి వచ్చింది' అంటూవుంటారు.

నలుగురు మగవాళ్ళు కలిసివుంటే, ఒక వ్యక్తి వంటచేయాలి, ఒక వ్యక్తి.... ఆ ఇంట్లో శోభాయమానంగా ఉండదు. ఒక పురుషుడు, ఒక స్త్రీ ఉన్నారంటే ఇల్లు చూడటానికి బావుంటుంది. స్త్రీ అలంకరణలు చాల బాగా చేస్తుంది.

**ప్రశ్నకర్త :** మీరు కేవలం స్త్రీ పక్షమే తీసుకోకుండి.

**దాదాశ్రీ :** నేను స్త్రీ పక్షం తీసుకోను. ఈ పురుషుల పక్షం కూడా తీసుకుంటాను. స్త్రీలకు వాళ్ళ పక్షాన మాట్లాడినట్లు అనిపిస్తుంది కాని నేను పురుషుల తరఫునే మాట్లాడుతాను. ఎందుకంటే ఫ్యామిలీకి యజమానులు మీరే. షి ఈజ్ నాట్ ఓనర్ ఆఫ్ ఫ్యామిలీ, యు ఆర్ ఓనర్ (కుటుంబానికి ఆమె యజమాని కాదు, మీరు యజమానులు). బొంబాయిలో మనుషులు అంటారు కదా, 'మీరెందుకు పురుషుల పక్షం తీసుకోరు, స్త్రీ పక్షం తీసుకుంటారు?' అని. నేనంటాను, 'వాళ్ళ గర్భం నుంచే మహావీర్ జన్మించారు. నీ గర్భం నుంచి ఎవరు జన్మిస్తారు? కారణం లేకుండా నువ్వు తీసుకుంటున్నావా?'

**ప్రశ్నకర్త :** ఏదిఏమైనా, మీరు స్త్రీ పక్షమే ఎక్కువగా తీసుకుంటారు. ఇదే మేము నమ్మే విషయం.

**దాదాశ్రీ :** ఆ. నా మీద ఆ నింద ఉంది కాస్త. అన్ని చోట్లా జరుగుతుంది. ఈ ఆరోపణ మనుషులు నా మీద వేసారు. కానీ నేను మగవాళ్ళకి ఎలాంటి జ్ఞానాన్ని ఇస్తానంటే, ఆ తర్వాత స్త్రీలు వాళ్ళకి గౌరవమిస్తారు. అటువంటి వ్యవస్థను కల్పిస్తాను. కాకపోతే చూడటానికి స్త్రీలను వెనకేసుకువచ్చినట్లు అనిపిస్తుంది కాని, వాస్తవానికి లోపలి నుంచి మగవాళ్ళ కోసమే ఉంటుంది అందులో. అంటే, ఈ వ్యవస్థంతా ఎలా ఉండాలంటే, ఆ మార్గంలో వెళ్తే ఇద్దరూ సంతోషంగా జీవిస్తారు.

నాకైతే (వ్యవహారంలో) స్త్రీలతో కూడా అనుకూలంగానే ఉంటుంది, పురుషులతో కూడా అంతే అనుకూలంగా ఉంటుంది. కానీ వాస్తవానికి నేను స్త్రీ పక్షంలో ఉండను, పురుషుల పక్షంలోను ఉండను. ఇద్దరూ కలిసి సంసారాన్ని మంచిగా సాగనీయండి. పూర్వం మనుషులు స్త్రీలను తక్కువ స్థాయికి దించారు. స్త్రీలది హెల్పింగ్ (సహాయకం). ఆమె లేకపోతే మీ ఇంటిని ఎవరు నడుపుతారు?

## [19] పత్ని ఆరోపణలు

నువ్వు ఆరోపించటం మొదలుపెడితే నువ్వు ఆరోపించేవాడిగానే తయారౌతావు. నేనైతే, ఆరోపణ చెయ్యటానికి ఎవరు వస్తారో, వారిదే తప్పు అని అనుకుంటాను. నీకు ఆరోపణలు చేసే సమయం ఎందుకు వచ్చింది. ఆరోపణలు చేసేవారే చాలవరకు నిందితులైవుంటారు. తాను స్వయంగా నేరస్తుడైతేనే నేరారోపణ చెయ్యటానికి వస్తారు. ఫిర్యాదులు చేస్తూవుంటే నీవు ఫిర్యాదీగానే తయారౌతావు, ఎదుటివారు ఆరోపి అవుతారు. అందువలన, అతని దృష్టిలో నీవు ఆరోపి అవుతావు. కాబట్టి ఎవరికి వ్యతిరేకంగా ఆరోపణ చేయవద్దు.

ఆమె భాగహారం చేస్తే నువ్వు గుణింతం చెయ్యి. రాశి శూన్యమౌతుంది. ఎదుటివారి గురించి అతను నన్ను ఇలా అన్నాడు, అలా అన్నాడు అని ఆలోచించటమే తప్పు. దారిలో పోతున్నప్పుడు గోడ కొట్టుకుంటే దాన్ని ఎందుకు తిట్టరు? చెట్టుని జడమని ఎందుకు అంటారు? ఎవరి వలనైతే దెబ్బ తగిలిందో వాళ్ళంతా పచ్చని చెట్లలాంటివాళ్ళే కదా? ఆవు కాళ్ళతో నిన్ను తొక్కితే దాన్ని మీరేమైనా అంటారా? ఈ మనుషులంతా కూడా అలాంటివాళ్ళే. 'జ్ఞాని పురుష్' అందరినీ ఎందుకు క్షమిస్తారు? వాళ్ళకి తెలుసు అందరూ (మనుషులు) అర్థం చేసుకోరు చెట్టు లాగా అని. అర్థం చేసుకున్నవాళ్ళకి చెప్పే పని వుండదు. అతను వెంటనే లోపల ప్రతిక్రమణ చేస్తాడు.

భర్త అవమానిస్తే, అప్పుడు ఏం చేస్తావు మరి? దావా వేస్తావా?

**ప్రశ్నకర్త :** అలా ఎక్కడైనా చేస్తారేమో? అలా ఎప్పుడైనా జరుగుతుండవచ్చా?

**దాదాశ్రీ :** అప్పుడేం చేస్తావు? 'నా ఆశీర్వాదం ఇది' అని నిద్రపో! బెహన్, నువ్వు నిద్రపోతావా లేక మనసులో తిట్టుకుంటూవుంటావా? మనసులోనే తిట్టుకుంటూవుంటుంది.

ఇక మూడు వేల రూపాయల చీర చూస్తే, ఇంటికి రాగానే ముఖం మాడ్చుకుంటుంది. అది చూసి మీరు, 'ఏమిటి, ఏమైంది?' అంటారు. ఆమె చీరలోనే మునిగివుంటుంది. అది తీసుకునివచ్చి ఇచ్చిన తర్వాత వదిలేస్తుంది. లేకపోతే అప్పటి వరకు క్లేశాలు పెట్టుకోవటం ఆపదు. అలా జరగకూడదు.

'మన సోఫా డిజైన్ బాగోలేదు. మీ మిత్రుడి ఇంటికి వెళ్ళాంకదా. ఆ డిజైన్ ఎంత అందంగా ఉంది!' అని భార్య అంటుంది. అరె, ఇది సోఫా. అందులో నీకు సుఖంగా లేదా? అప్పుడు అంటుంది, 'లేదు. నేను అక్కడ చూసినదానిలో సుఖంగా ఉంది' అని. తర్వాత భర్తకి అలాంటి సోఫా తీసుకుని రావలసివస్తుంది. ఇప్పుడికి కొత్తది తీసుకునివచ్చిన తర్వాత, కొడుకు బ్లేడుతో ఎక్కడైనా కట్‌చేస్తే, లోపల ఆత్మ కట్ అయినట్లనిపిస్తుంది! పిల్లలు సోఫాని కట్‌చేస్తారా లేదా? అప్పుడు అతని మీద ఎగురుతారు కదా? అలా ఎగిరినప్పుడు అతని ఛాతీ మీద ఎగిరితన్నినట్లనిపిస్తుంది. అంటే, అదే మోహం. ఆ మోహమే మిమ్మల్ని ముక్కలు ముక్కలు చేసి తైలం పిండుతుంది.

అనవసరం జన్మ వృదా అవతుంది అందులో. మరొకటేమిటంటే, సోదరీమణులతో షాపింగ్ చేయవద్దని చెప్తాను. షాపింగ్ నిలిపివేయండి. ఈ డాలర్లు వచ్చాయి... అవసరం లేకపోతే ఎందుకు తీసుకుంటారు యూజ్‌లెస్? ఏదైనా మంచి పనికి డబ్బు ఖర్చవాలి కదా, అలా ఖర్చవద్దా? ఎవరికైనా కుటుంబంలో కష్టాలుంటే, పాపం వాళ్ళ దగ్గర లేకపోతే, యాభై వంద డాలర్లు వాళ్ళకిస్తే ఎంత బాగనిపిస్తుంది! షాపింగ్‌లో అనవసరమైన ఖర్చు పెడతావు, ఇంట్లో అంతా నిండివుంటుంది.

**ప్రశ్నకర్త :** ఇక స్త్రీలు *త్రాగా* (తనకి ఇష్టమైన పని చేయించుకునేందుకు ఆడే నాటకం) చేస్తారు.

**దాదాశ్రీ :** *త్రాగా* స్త్రీలు కాదు, మగవాళ్ళు చేస్తారు.

ఈ కాలంలో మనుషులు ఎక్కువేమీ చెయ్యరు. *త్రాగా* అంటే ఏమిటి? తన కోసం అనుభవించేందుకు ఎదుటివారిని బెదిరించి అనుభవిస్తారు. ధార్య (ఇష్టమొచ్చిన రీతి) చేస్తారు.

**ప్రశ్నకర్త :** అన్నిచోట్లా ఆడవాళ్ళ తప్పులనే చూస్తారెందుకు? పురుషులవి ఎందుకు చూడరు?

**దాదాశ్రీ :** అదేమిటంటే, పురుషుల చేతిలో చట్టం ఉండేది. అందువలన స్త్రీలకే నష్టం కలిగించారు.

ఈ పుస్తకాలన్నిటినీ పురుషులే రాసారు కనుక పురుషులనే ముందుకు నెట్టారు. స్త్రీలను తొలగించారు. అందులో వాళ్ళ వాల్యూని లేకుండా చేసారు. ఇక దెబ్బ కూడా అంతే తిన్నారు. నరకంలోకి కూడా వీళ్ళే వెళ్తారు. ఇక్కడి నుండే నరకంలోకి పోతారు. స్త్రీలకు అలా జరగదు. స్త్రీ మనస్తత్వం వేరుగా ఉన్నప్పటికీ, ఆమె మనస్తత్వం ప్రకారమే అదీ ఫలం ఇస్తుంది, ఈమే ఫలమిస్తుంది. స్త్రీది అజాగ్రత్ మనస్తత్వం. అజాగ్రత్ అంటే సహజ మనస్తత్వం.

**ప్రశ్నకర్త :** ఎప్పటి వరకు మనం ఇలా సహిస్తూవుంటాలి?

**దాదాశ్రీ :** సహనంతో ఉన్న కొద్దీ శక్తి ఇంకా ఎక్కువ పెరుగుతుంది.

**ప్రశ్నకర్త :** అయితే అలా సహిస్తూనేవుండాలా, అలా?

**దాదాశ్రీ :** సహించే బదులు ఆ విషయంలో ఆలోచించాలి. ఆలోచించి దాని సొల్యూషన్ కనిపెట్టాలి. ఇక, సహిస్తూనేవుండటం తప్పు. ఎక్కువ సహనశీలత వచ్చినట్లయితే, తర్వాత స్ప్రింగ్‌లా ఎగురుతుంది. అది ఇంటినంతా గందరగోళం చేసిపెడుతుంది. సహనశీలత అనేదైతే స్ప్రింగు. స్ప్రింగు మీద ఎప్పుడూ లోడు వెయ్యగూడదు. అది కొద్ది సేపటికైతే పరవాలేదు. ఇప్పుడు దార్లో వెళ్తున్నప్పుడు ఎవరికైనా ఏమైనా అయితే అక్కడ ఈ స్ప్రింగుని ఉపయోగించాలి. ఇక్కడ ఇంట్లోవాళ్ళ మీద 'లోడ్' వెయ్యగూడదు. ఇంట్లోవాళ్ళ మీద సహనం చూపిస్తే ఏమౌతుంది? స్ప్రింగు ఎగిరిపడుతుంది అది.

**ప్రశ్నకర్త :** సహనశీలతకి లిమిట్ ఎంత పెట్టుకోవాలి?

**దాదాశ్రీ :** అది ఒక హద్దు వరకు సహించాలి. తర్వాత ఆలోచించి, వాస్తవంగా అది ఏమిటి అన్న విచారణ చెయ్యి. ఆలోచిస్తే అర్థమౌతుంది దాని వెనక ఉన్నది ఏమిటన్నది. కేవలం సహిస్తూనేపోతే స్ప్రింగు ఎగురుతుంది. ఆలోచించే అవసరం ఉంది. విచారహీనత వలనే సహించవలసి వస్తుంది. ఆలోచిస్తే అర్థమౌతుంది అందులో తప్పు ఎక్కడ జరుగుతున్నది అన్నది. దానితో అతనికి సమాధానమంతా బయటకు వస్తుంది. లోపల అనంత శక్తి వుంది. అనంత శక్తి! మీరు కోరుకున్నప్పుడు

ఆ శక్తి మీరు లభించేటట్లుగా. వీళ్ళు లోపలి శక్తిని వెతకరు కాని బయటి శక్తిని వెతుకుతారు. బయట ఎటువంటి శక్తి వుంది?

సహించటం వలనే ఇంటింటా విస్ఫోటాలు జరుగుతాయి. నేను ఎంత సహించాలి, అని మనసులో అనుకుంటారు. ఇక ఆలోచించి మార్గాన్ని వెతుక్కోవాలి. దొరికిన సంయోగం, ప్రకృతి నిర్మాణమైన సంయోగం, దాని నుంచి నీవెలా తప్పించుకుంటావు? కొత్త వైరాలు బంధించకుండా, పాత వైరాలను వదిలించుకోవాలంటే, అందుకు మార్గాన్ని అన్వేషించాలి. ఈ జన్మలోని వైరాలను వదిలించుకోవటానికి, వైరం వదిలించుకునే దార్లు, 'ప్రతి ఒక్కరితోను సమభావంతో తొలగించు'. ఇక చూడు మీ పిల్లలు ఎంత సంస్కారవంతులౌతారో.

**ప్రశ్నకర్త :** నా స్నేహితురాలి ప్రశ్న ఏమిటంటే, ఆమె భర్త ఎప్పుడూ ఆమె మీద కోపం చూపిస్తుంటాడు. అందుకు కారణం ఏమయ్యుంటుంది?

**దాదాశ్రీ :** అది మంచిదే. లోకులు కోపం చూపించేదానికన్నా, భర్తే కదా, అది మంచిదే. ఇంటి మనిషే కదా!

ఇది ఎలాంటిదంటే, లోహకారులు, భారీ లోహం ఉంటే, దాన్ని వంచాలంటే, దాన్ని వేడి చేస్తారు. ఎందుకు చేస్తారు? అది చల్లగా వంగకుండా ఉంటుంది కనుక, లోహాన్ని వేడిచేసి వంచుతారు. అది ఇక రెండు సుత్తి దెబ్బలకే వంగిపోతుంది. మనం ఎలా అవాలనుకుంటే అలా తయారౌతుంది. ప్రతి ఒక్క వస్తువూ వేడైతే వంగుతుంది ఎప్పుడైనా. ఎంత వేడెక్కితే అంత బలహీనం అంటే ఒకటి రెండు సుత్తి దెబ్బలకే ఆ పతికి మీకు కావలసిన డిజైన్ ఏదైతో ఉందో ఆవిధంగా మలుచుకోవాలి.

**ప్రశ్నకర్త :** ఎలాంటి డిజైన్ చెయ్యాలి దాదా? చేతికి వచ్చిన తర్వాతనా?

**దాదాశ్రీ :** మీకు ఎలా కావాలంటే అలా తయారుచేసుకోవచ్చు డిజైన్‌ని. తన భర్తని చిలుకలా తయారుచేసుకుంటుంది. భార్య, 'ఆయా రామ్' అంటే అతను కూడా 'ఆయా రామ్' అంటాడు. 'గయా రామ్' అంటే అతను కూడా 'గయా రామ్' అంటాడు. అలా చిలకలా తయారౌతాడు. కానీ మనుషులకు సుత్తి దెబ్బలెయ్యటం రాదు కదా! అవన్నీ బలహీనతలే. కోపం తెచ్చుకోవటం బలహీనత.

మీరు బయట వెళ్తున్నప్పుడు ఇంటి పై నుండి ఒక రాయి వచ్చి తల మీద పడి, రక్తం కారుతున్నదనుకోండి. ఆ సమయంలో ఎక్కువ కోపం తెచ్చుకుంటావా?

**ప్రశ్నకర్త :** లేదు. అది హ్యాపెన్ (జరిగిపోయింది).

**దాదాశ్రీ :** కాదు, కాని అక్కడ కోపం ఎందుకు చూపించరు? మీరు ఎవరినీ చూడలేదు కదా, ఇక కోపం ఎందుకు వస్తుంది?

**ప్రశ్నకర్త :** ఎవరూ కావాలని కొట్టలేదు.

**దాదాశ్రీ :** అంటే, మన దగ్గర కంట్రోల్ ఉంది కోపానికి. కనుక మనం అర్థం చేసుకోవలసింది ఏమిటంటే, ఎవరైనా కావాలని కొట్టకపోతే అక్కడ కంట్రోల్ పెట్టుకోవచ్చు. కంట్రోలైతే ఉంది. అయినా, 'నాకు కోపం వచ్చింది' అంటారు. అరె, అక్కడ ఎందుకు రాదు? పోలీసుతో, పోలీసు బెదిరిస్తే, ఆ సమయంలో కోపం ఎందుకు రాదు? అతనికి భార్య మీద వస్తుంది, పిల్లల మీదవస్తుంది, పొరుగువారి మీద, 'అండర్‌హ్యాండ్' మీద కోపం వస్తుంది కాని, 'బాస్' (యజమాని) మీద ఎందుకు రాదు? కోపం మనిషికి దానంతటదే రాదు. అది 'ధార్య' (ఇచ్ఛానుసారం) చేసేదే.

**ప్రశ్నకర్త :** ఇంట్లో, ఫ్రెండ్స్‌లో, అన్ని చోట్ల, ప్రతి వారి అభిప్రాయం వేరువేరుగా ఉంటుంది. అక్కడ మన ధార్య లేకపోతే, మనకి కోపం వస్తుంది. అప్పుడేం చెయ్యాలి?

**దాదాశ్రీ :** అందరూ తమ తమ ఇచ్ఛానుసారం చేసుకుంటూపోతే ఏమౌతుంది? అలాంటి ఆలోచనే ఎందుకు వచ్చింది. వెంటనే రావలసిన ఆలోచన ఏమిటంటే, నా ఇచ్ఛానుసారం చేస్తే ఎదురెదురుగా గిన్నెలను పగలగొట్టుకోవటం జరుగుతుంది, తినటానికి కూడా ఏమీ మిగలదు. అందువలన ధార్య ఎప్పుడూ చేయవద్దు. ధారణే వద్దు. అప్పుడు దానికి వ్యతిరేకంగా జరగటమనేదే ఉండదు. ఎవరికి అవసరమో వాళ్ళు ధారణ చేస్తారు, అలా అనుకో.

**ప్రశ్నకర్త :** మనం ఎంత శాంతంగా ఉన్నా, మగవాడు కోపం తెచ్చుకుంటాడు. అప్పుడేం చెయ్యాలి?

**దాదాశ్రీ :** ఆయన కోపం తెచ్చుకుని జగడం పెట్టుకోవాలని అనుకుంటే మీరు కూడా కోపం చూపించండి, లేకపోతే ఊరుకోండి. ఫిల్మ్‌ని అవగొట్టాలంటే నెమ్మదిగా ఉండండి. ఫిల్మ్‌ని అవగొట్టగూడదనుకుంటే, రాత్రంతా నడవనీయండి. ఎవరు కాదంటారు? బాగుంటుందా ఫిల్మ్?

**ప్రశ్నకర్త :** లేదు. ఫిల్మ్ బావుండదు.

**దాదాశ్రీ :** కోపం తెచ్చుకుని ఏం చెయ్యాలి? మనిషి తనంతటతాను కోపం తెచ్చుకోడు. ఇదంతా మెకానికల్ అడ్జస్ట్‌మెంట్ తెచ్చుకునే కోపం. తనకు తానుగా కోపాన్ని రానివ్వడు. అతనికి తర్వాత మనసులో పశ్చాత్తాపం కలుగుతుంది, కోపం రాకపోతే బాగుండేది కదా అని.

**ప్రశ్నకర్త :** అతన్ని చల్లబరచే ఉపాయమేమిటి?

**దాదాశ్రీ :** ఆ మెషీన్ వేడెక్కివుంటే, దాన్ని చల్లబరచాలంటే, కాసేపు అలా ఉండనీ. కానీ చెయివేసి అటు ఇటు ఏమైనా చేస్తే మనకి కాలుతుంది.

**ప్రశ్నకర్త :** నాకు, మా వారికి మధ్య కోపం, వాగ్వాదం జరుగుతుంటుంది. ఎన్నో అనటం వినటం జరిగిపోతుంది. మరి ఏం చెయ్యమంటారు?

**దాదాశ్రీ :** కోపం నువ్వు తెచ్చుకుంటావా లేక అతనా? కోపం ఎవరికి వస్తుంది?

**ప్రశ్నకర్త :** ఆయనకి వస్తుంది. ఆ తర్వాత నాకు కూడా వస్తుంది.

**దాదాశ్రీ :** అయితే మీరు లోపల మీకు మీరే తిట్టుకోండి, 'నువ్వెందుకు అలా చేస్తావు?' అని. మరి చేసినదానికి అనుభవించాలి కదా. కానీ ప్రతిక్రమణ (పశ్చాత్తాపం) చేయటం వలన దోషాలన్నీ పోతాయి. లేకపోతే మనం కలుగజేసిన దు:ఖమే మనమూ అనుభవించవలసి వుంటుంది. కానీ ప్రతిక్రమణ చేయటం వలన విషయం కాస్త చల్లబడుతుంది.

**ప్రశ్నకర్త :** కానీ, భార్యభర్తల మధ్య కాస్త కోపం ఉండాలి కదా?

**దాదాశ్రీ :** లేదు, అలాంటి చట్టమేమీ లేదు. భార్యాభర్తల మధ్య ఎంతో శాంతి ఉండాలి. దు:ఖమనేది ఉంటే, వాళ్ళు భార్యాభర్తలే కారు. ఫ్రెండ్‌షిప్‌లో ఉండదు. నిజమైన ఫ్రెండ్‌షిప్‌లో ఉండదు. మరి ఇది ఎంతో పెద్ద ఫ్రెండ్‌షిప్! ఇక్కడ ఉండనేగూడదు. ఈ మాటను మనుషులు మధ్యలోకి తీసుకువచ్చారు. వాళ్ళకి అలా అయిందేమో మధ్యలోకి తీసుకువచ్చి, అదే నియమం అన్నట్లుగా మాట్లాడుతున్నారు! భార్యాభర్తల మధ్య ఏమాత్రం ఉండగూడదు, ఎవరెంత చెప్పినా.

**ప్రశ్నకర్త :** మన శాస్త్రాలలో, స్త్రీ తన పతిని పరమేశ్వరునితో సమానమని భావించాలని, అతని ఆజ్ఞానుసారం నడుచుకోవాలని రాసారు. ఇప్పుడు, ఈ కాలంలో దాన్ని ఎలా పాటించాలి?

**దాదాశ్రీ :** భర్త రాముడిలాంటివాడైతే, మనం సీతలా ఉండాలి. భర్త వక్రంగా ఉన్నపుడు, మనం కూడా వక్రంగా వెళ్ళకపోతే ఎలా నడుస్తుంది? తిన్నగా ఉండగలిగితే ఉత్తమమే. కానీ, తిన్నగా ఉండలేరు కదా! మనిషి తిన్నగా ఎలా ఉంటాడు. మళ్ళీ మళ్ళీ వేధిస్తుంటాడు. మరి పాపం భార్య ఏం చేస్తుంది? పతికి పతిధర్మ పాలన చేయాలి, పత్ని పత్నిధర్మ పాలన చేయాలి. ఒకవేళ భర్త వలన ఏమైనా కాస్త తప్పు జరిగితే దాన్ని సవరించటమే, స్త్రీ అనబడుతుంది. కానీ, అన్నెన్ని తిట్లు తిట్టటం చేస్తే పాపం ఆ భార్య ఏం చేస్తుంది?

**ప్రశ్నకర్త :** పతే పరమాత్మ, ఇదేమైనా తప్పా?

**దాదాశ్రీ :** ఈ కాలంలో పతులను పరమాత్మగా భావిస్తే, పిచ్చెక్కి తిరిగినట్లే!

**ప్రశ్నకర్త :** పతిని పరమేశ్వరుడని అనాలా? ప్రతిరోజూ దర్శనం చేసుకోవాలా? ఆయన చరణామృతాన్ని సేవించాలా?

**దాదాశ్రీ :** ఆయన్ని పరమేశ్వరుడని అనవచ్చు కాని అతను మరణించని వాడయ్యుండాలి, అప్పుడే పరమేశ్వరుడు. మరణించేవారు పరమేశ్వరుడెలా ఔతాడు? పతి పరిమేశ్వరుడు ఎందుకు? ఈ కాలంలోని పతి పరమేశ్వరౌతాడా?

**ప్రశ్నకర్త :** నేనైతే రోజూ పతి చరణ స్పర్శ చేస్తాను.

**దాదాశ్రీ :** అలా చేసి మోసం చేస్తారేమో పతిని! పాదాన్ని తాకి పతిని మోసం చేస్తున్నారేమో. పతి అంటే పతి, పరమేశ్వరుడంటే పరమేశ్వరుడు! ఆ పతి మాత్రం ఎక్కడంటున్నాడు, 'నేను పరమేశ్వరుడిని' అని? 'నేనైతే పతిని' అనే అంటాడు కదా!

**ప్రశ్నకర్త :** ఔను. 'పతిని' అనే అంటాడు.

**దాదాశ్రీ :** ఆ.... మరి ఆవుకి కూడా పతి ఉంటాడు. అందరికీ పతి ఉంటాడు. కేవలం ఆత్మే పరమేశ్వరుడు, శుద్ధాత్మ!

**ప్రశ్నకర్త :** చరణామృతం తాగవచ్చా?

**దాదాశ్రీ :** ఈకాలంవాళ్ళు, దుర్గంధంతో కూడిన మనుషుల చరణామృతం ఎలా తాగుతారు? ఈ మనుషులు వాసనొస్తారు. అలా కూర్చున్నా కూడా వాసనొస్తారు. పూర్వం సుగంధ భరితమైన మనుషులు ఉండేవారు. అప్పటి సంగతి వేరు. ఇప్పుడు మనుషులంతా వాసన వస్తుంటారు. నా తల పగిలిపోతుంటుంది. ఏదో ఒకటి చేసి ప్రదర్శించాలి మేము భార్యాభర్తలమని.

**ప్రశ్నకర్త :** ఇప్పుడు అందరూ దాన్ని కేన్సిల్ చేసారు దాదా! ఇప్పుడందరూ చదువుకున్నవాళ్ళు కదా, అందువలన అందరూ ఆ పరమేశ్వరుడనే పదాన్ని తొలగించేసారు.

**దాదాశ్రీ :** పతి పరమేశ్వరుడై కూర్చున్నాడు చూడూ! అతని చేతిలో పుస్తకం రాసే అధికారం. అందువలన ఎవరు చెప్పేవారు. ఏకపక్షంగా చేసారు కదా. అలా జరగకూడదు.

**ప్రశ్నకర్త :** ఈరోజుల్లో స్త్రీ తన భర్తని పూర్వకాలపు స్త్రీలా గౌరవం ఇవ్వటం లేదు.

**దాదాశ్రీ :** ఔను. పూర్వకాలం పతి 'రామ' అయితే ఇప్పుడు 'మరా'

**ప్రశ్నకర్త :** ఈమైతే యమరాజు అంటుంది.

**ప్రశ్నకర్త :** పతి పట్ల పత్ని కర్తవ్యం ఏమిటి అన్నది చెప్పండి.

**దాదాశ్రీ :** స్త్రీకి ఎల్లప్పుడూ భర్త పట్ల సిన్సియర్ (నిజాయితీ) గా ఉండాలి. పతి పత్నితో, 'నువ్వు సిన్సియర్‌గా లేకపోతే నా బుర్ర పాడవుతుంది' అని హెచ్చరించాలి. 'బివేర్' (జాగ్రత్త) చెప్పాలి కాని, వత్తిడి తేగూడదు, నువ్వు సిన్సియర్‌గా ఉండు అని. కానీ ఆమెని 'బివేర్' అనవచ్చు. సిన్సియర్‌గా ఉండాలి జీవితమంతా. రాత్రిం బవళ్ళు సిన్సియర్. ఆలోచనంతా వాళ్ళ మీదనే ఉండాలి. మీకు వాళ్ళ చింత ఉంటేనే సంసారం బాగా సాగుతుంది.

**ప్రశ్నకర్త :** పతిదేవుడు సిన్సియర్‌గా లేకపోతే పత్ని బుర్ర పాడైపోతుంటే పాపం తగలదా?

**దాదాశ్రీ :** బుర్ర పాడౌతుంటే దాని రుచిని ఆస్వాదించాలి కదా! పతి కూడా రుచిని ఆస్వాదిస్తాడు ఆ తర్వాత! అలా చెయ్యగూడదు. యాజ్ ఫార్ యాజ్ పాసిబుల్ (వీలైనంతవరకు). పతి ఇచ్ఛానుసారం కాక, పతి వలన తప్పు జరిగితే, పతి అందుకోసం క్షమాపణ కోరాలి, 'నన్ను క్షమించు, ఇంకెప్పుడూ అలా జరగదు' అని. సిన్సియర్‌గా ఉండాలి కదా మనిషి? సిన్సియర్‌గా ఉండకపోతే ఎలా నడుస్తుంది?

**ప్రశ్నకర్త :** క్షమాపణ కోరతాడు పతి, మాటి మాటికీ క్షమాపణ కోరుతాడు కానీ మళ్ళీ అలాగే చేస్తే ఏం చెయ్యాలి?

**దాదాశ్రీ :** పతి క్షమాపణ కోరినంత మాత్రాన భావించగూడు, పాపం ఎంత అశక్తతను అనుభవిస్తున్నాడో అని! అందువలన లెట్‌గో అనుకోవాలి. అతనికి ఆ 'హాబిట్' (అలవాటు) అవలేదు. 'హ్యాబిచ్యువేటెడ్' (అలవాటు) అయిపోలేదు. అతనికీ ఇష్టం ఉండదు కాని ఏం చేస్తాడు? బలహీనతలో అలా చేస్తాడు. తప్పొప్పులు జరుగుతుంటాయి కదా!

**ప్రశ్నకర్త :** భర్తకి హ్యాబిట్ అయిపోతే ఏం చెయ్యాలి?

**దాదాశ్రీ :** ఏం చేస్తావు మరి? అతన్ని బయటకు పంపిచేస్తావా? పంపిచేస్తే బయట పరువు పోతుంది. కాబట్టి గుట్టుగా మూసివుంచాలి. ఇంకేం చేస్తాం? మురుగు కాలువని మూసివుంచుతామా, తెరిచి పెడతామా? ఈ గటర్‌లను మూసిపెట్టివుంచాలా లేక తెరిచిపెట్టి ఉంచాలా?

**ప్రశ్నకర్త :** మూసివుంచాలి

**దాదాశ్రీ :** అలా కాకుండా తెరిచివుంచితే కంపుకొడుతుంది. మన తలే తిరుగుతుంది.

**ప్రశ్నకర్త :** ఈ బొట్టు ఎందుకు పెట్టుకుంటారు? అమెరికాలో చాల మంది ఆడవాళ్ళు అడుగుతుంటారు నువ్వు బొట్టు ఎందుకు పెట్టుకుంటావని.

**దాదాశ్రీ :** బొట్టు ఎందుకంటే ఆర్య స్త్రీలు కనుక. మనం అనార్యులం కాము. ఆర్య స్త్రీ బొట్టు పెట్టుకునేవుంటుంది. అంటే, భర్తతో ఎంత దెబ్బలాట పెట్టుకున్నా, ఆమె ఇల్లు వదిలి పోదు. బొట్టు లేని ఆమె రెండవ రోజే వెళ్ళిపోతుంది. ఈమె స్టెడీ (స్థిరం) గా ఉంటుంది, ఈ బొట్టు పెట్టుకునే ఆమె. ఇది మనసు స్థానం. ఆమె ఒకే పతిని మనసులో పెట్టుకుంటుంది కనుక.

**ప్రశ్నకర్త :** స్త్రీలు ఏం చెయ్యాలి? పురుషుల విషయంలో మీరు చెప్పారు కానీ ఆడవాళ్ళు రెండు కళ్ళల్లో ఏం పెట్టుకోవాలి?

**దాదాశ్రీ :** స్త్రీలు, వాళ్ళకి ఎలాంటి భర్త దొరికినా, ఎవరు భర్తగా వచ్చినా, అతను తన ఖాతాలో ఉన్నవాడే. పతి లభించటమంటే వట్టిగా జరిగేది కాదది. కనుక, ఏ పతి దొరికితే అతని పట్ల పతివ్రతగా ఉండే ప్రయత్నం చేయాలి. ఒకవేళ అలా చేయలేకపోతే, అతనికి క్షమాపణ కోరుకో. కాని మీ దృష్టి అలా ఉండాలంటే, భర్తతో పార్టనర్‌షిప్ (భాగస్వామ్యం) తో ఏ విధంగా ముందుకు సాగాలి, ఊర్ధ్వగతి ప్రాప్తి జరగాలి, ఏ విధంగా మోక్షం పొందాలి, ఇలాంటి ఆలోచనలలో ఉండాలి.

## [ 20 ] విడాకుల పరిణామం

అభిప్రాయ భేదాలు ఇష్టమా? అభిప్రాయ భేదాలుంటే జగడాలు వస్తాయి, మానసిక వేదన కలుగుతుంది. కాబట్టి మానసిక భేదాల వలన జరిగేదేమిటి? మానసిక భేదాలు వస్తే 'డైవర్స్' తీసుకుంటారు, తన్భేదం వస్తే శవం లేస్తుంది.

**ప్రశ్నకర్త :** వ్యావహారికంగా, అభిప్రాయ భేదాలుంటే, వాటిని ఆలోచనలలో భేదాలు అంటారా లేక అభిప్రాయ భేదాలు అంటారా?

**దాదాశ్రీ :** వాటిని అభిప్రాయ భేదాలు అంటారు. జ్ఞానం తీసుకునివుంటే ఆలోచనలలో భేదం అంటారు. లేకపోతే అభిప్రాయ భేదాలు అంటారు. అభిప్రాయ భేదాలతో మనసుకి దెబ్బ తగులుతుంది.

**ప్రశ్నకర్త :** అభిప్రాయ భేదాలు తక్కువగా ఉంటే మంచిదేకదా?

**దాదాశ్రీ :** మనుషుల మధ్య అభిప్రాయ భేదాలు ఉండనేకూడదు. అభిప్రాయ భేదం ఉంటే అది మానవత్వమే అనిపించుకోదు. ఎందుకంటే అభిప్రాయ భేదంతో మానసిక భేదం ఏర్పడుతుంది. అభిప్రాయ భేదంతో మానసిక భేదం ఏర్పడితే, 'నువ్వలాంటిదానివి, నువ్వు నీ ఇంటికి వెళ్ళిపో' అనటం మొదలౌతుంది. అందులో మరి మజా ఉండదు. ఎలాగోలా సాగించాలి.

**ప్రశ్నకర్త :** ఇప్పుడు అభిప్రాయభేదం సామాన్యమైపోయింది.

**దాదాశ్రీ :** అదే చెప్తున్నా. అది మంచిది కాదు. బయట శోభనివ్వదు. దీనికి అర్థమే లేదు. ఇప్పటికైనా బాగుపడవచ్చు. మనం మనుషులం. కాబట్టి బాగుపడవచ్చు. ఎందుకలా అవాలి? అరె, మర్యాద పోగొట్టుకుంటున్నారు. కాస్త అర్థం చేసుకోవాలి కదా. వీటన్నిటిలో సూపర్‌ఫ్లువస్‌గా ఉండాలి. ఎందుకంటే ఒక స్త్రీకి భర్త అయ్యారు, కొంతమంది. అరె, పతి పెత్తనం ఎందుకు చేస్తారు. ఇక్కడ బ్రతికున్నంత వరకు పతి. రేపు డైవర్స్ తీసుకోనంతవరకు పతి! రేపు భార్య డైవర్స్ తీసుకుంటే ఎవరికి భర్త?

**ప్రశ్నకర్త :** ఈ కాలంలో అందరూ డైవర్స్ తీసుకుంటారు, విడాకులు తీసుకుంటారు. చిన్నచిన్న పిల్లలను వదిలి విడాకులు తీసుకుంటారు. మరి వాళ్ళ శాపం తగలదా?

**దాదాశ్రీ :** తగులుతాయి అన్నీ. కానీ ఏం చేస్తాం. వాస్తవానికి విడాకులు తీసుకోగూడదు. నిజం చెప్పాలంటే అందరూ సర్దుకుపోవాలి. పిల్లలు పుట్టక ముందు తీసుకుంటే సరే కాని, పిల్లలు పుట్టిన తర్వాత విడాకులు తీసుకుంటే పిల్లల శాపం తగులుతుంది.

**ప్రశ్నకర్త :** పిల్లల తండ్రికి ఏమాత్రం మెదడు పనిచేయటం లేదు. ఏం పని చెయ్యడు. మోటల్ నడపటం రాదు. నాలుగు గోడల మధ్య ఇంట్లోనే కూర్చునివుంటాడు. ఏం చెయ్యాలి?

**దాదాశ్రీ :** కాని ఏం చేస్తావు? ఆ తర్వాత మంచివాడు దొరుకుతాడో లేదో ఏమిటి నమ్మకం?

**ప్రశ్నకర్త :** నమ్మకమైతే లేదు...

**దాదాశ్రీ :** రెండవ వాడు ఇంతకంటే చెడ్డవాడైతే అప్పుడేం చేస్తావు? చాలమంది ఆడవాళ్ళకి అలాగే జరిగింది. మొదటి భర్త మంచివాడు. అరె, పిచ్చిదానా, నువ్వెక్కడున్నావో అక్కడే ఉండొచ్చుగా? అలా మనసులో అనుకోవాలా వద్దా?

**ప్రశ్నకర్త :** అంతా దాదాకి వదిలిపెడితే రెండవవాడు సరైనోడు దొరుకుతాడు కదా?

**దాదాశ్రీ :** మంచివాడు దొరకి రెండు సంవత్సరాల తర్వాత అటాక్ వస్తే అప్పుడేం చేస్తావు? వట్టిగా భయం కలిగించే ఈ ప్రపంచంలో ఎందుకు ఇదంతా... ఏం జరిగిందో అదే కరెక్ట్ అని సరిపెట్టుకోవటం మంచిది.

మొట్టమొదటి భర్త ఎప్పుడైనా మంచివాడే అవుతాడు. కాని రెండవ వాడు ఆవారాయే అవవచ్చు. ఎందుకంటే అతను కూడా అలాగే వెతుకుతుంటాడు. ఆవారా

అయితే వెతుకుతాడు, వాళ్ళు కూడా అవారాయే అవుతారు. అప్పుడే ఇద్దరూ కలుస్తారు కదా! దారితప్పిన వారిద్దరూ కలుస్తారు. దాని బదులు మొదటివాడే నయం. మనకి తెలిసినవాడే కదా! అరె, అలా కాదా! అతను రాత్రి పూట గొంతు పిసికేవాడు కాదుగా! అలా నీకు నమ్మకం ఉంది కదా! కాని రెండవ వాడు గొంతు కూడా పిసకవచ్చేమో!

పిల్లల కోసం కూడా మీరు అర్థం చేసుకోవాలి. ఒకరు లేక ఇద్దరు పిల్లలే కావొచ్చు కానీ వాళ్ళు అనాధులౌతారు కదా! అనాథులనిపించుకోరా?

**ప్రశ్నకర్త :** అనాథులే అనిపించుకుంటారు.

**దాదాశ్రీ :** అమ్మ ఎక్కడికి పోయింది? నాన్న ఎక్కడికి పోయాడు? ఒకసారి ఒక కాలు తెగిపోతే ఒక జన్మని గడపరా లేకపోతే ఆత్మహత్య చేసుకుంటారా?

భర్త చెడ్డవానిగా కనపడడు. అలా అనిపిస్తే ఏం చేస్తావు? భర్త మెదడు కాస్త వక్రంగా ఉందే అనుకో. కాని పెళ్ళి చేసుకున్నావు కదా, నా భర్త, అంటే నాకు అందరిలోకి మంచివాడు- బెస్ట్ అలా అనుకోవాలి. కనుక చెడు అనేదేమీ ఉండనేవుండదు ఈ ప్రపంచంలో ఏదీ.

**ప్రశ్నకర్త :** బెస్ట్ అన్నబట్టే కదా భర్త నెత్తినెక్కి కూర్చుంటాడు.

**దాదాశ్రీ :** లేదు. నెత్తినెక్కి కూర్చోడు. అతను పాపం రోజంతా బయట పనిచేస్తుంటాడు అతనేం ఎక్కుతాడు నెత్తిమీదకు. భర్త ఎవరైతే మీకు లభించాడో, అతనితోనే సర్దుకోండి. రెండవవాడినేం తెచ్చుకోబోతున్నారు? అమ్మకానికి దొరుకుతాడా? ఏమైనా ఎక్కువతక్కువ చేస్తే డైవర్స్ తీసుకోవలసివస్తుంది. కాని అది తప్పుగానే కనిపిస్తుంది. అతను కూడా అంటాడు డైవర్స్ తీసుకున్నామె కదా అని. అప్పుడు ఎక్కడికి పోతావు? దానికంటే, ఒకరిని పెళ్ళి చేసుకున్నావు కనుక అక్కడే సర్దుకునివుండు. అంటే అంతటా అలాగే జరుగుతుంది. మనతో సర్దుబాటు కానప్పుడు ఏం చేస్తాం? ఇక ఎక్కడికి పోతాం? అందుకే, అతనితోనే సర్దుబాటు చేసుకో. మనం భారతీయులం ఎంతమంది భర్తలను మారుస్తాం? ఒకతన్ని చేసుకున్నాం అతనే...

ఎవరు దొరికారే వాళ్ళే సరి. కేసుని ఒక పక్కకి పెట్టేయండి. అలాగే మగవాళ్ళకి ఎటువంటి భార్య దొరికినా, గొడవలు పెడుతున్నా సరే, ఆమెతోనే సర్దుకుపోయి వుండటం మంచిది. ఆమె ఏమన్నా పొట్టలో పొడిచేస్తుందా? బయట గగ్గొలు పెడుతుందేమో, లేకపోతే ముఖం మీదనే తిట్టిపోస్తుందేమో. పొట్టలో పొడిచినట్లయితే ఏం చేస్తావు? అందరూ అలాంటివాళ్ళే. రేడియోయే. కాని మీకు తెలియదు వాస్తవంగా... ఆమే అంతా చేస్తోందని మీకు అనిపిస్తుంది. కానీ ఆమెకి కూడా పశ్చాత్తాపం కలుగుతుంది, అరె, నేను ఆ మాట అనివుండగూడదు, నోరు జారింది అని. అప్పుడు ఆమె చేసినట్లా లేక రేడియో చేసినట్లా?

ఒకామె సంసారం ముంబైలో ఫ్రాక్చర్ అవటానికి వచ్చింది. భర్త రహస్యంగా వేరే సంబంధం పెట్టుకున్నాడనుకుంటా. ఈమెకి తెలిసిపోయింది. అందువలన భయంకరంగా గొడవలవటం మొదలైంది. అప్పుడు ఆమె నాతో, 'ఇతను అలాంటివాడు. నేనేం చెయ్యను? నేను లేచిపోతాను' అన్నది. నేను ఆమెతో, 'ఏకపత్నీ వ్రతం పాటిస్తున్నవాడు ఎవరైనా దొరికితే లేచిపో. లేకపోతే రెండవవాడు మంచివాడెక్కడ దొరుకుతాడు? అయినా ఒక్కామెనే ఉంచుకున్నాడు కదా' అంటే, 'ఔను. ఒక్కామెనే ఉంచుకున్నాడు' అంది. నేను, 'లెట్ గో' (పోనీలే) అనుకో. పెద్ద మనసు చేసుకో. నీకు ఇంతకంటే మంచివాడు దొరకడు' అన్నాను.

కలియుగంలో భర్త కూడా మంచివాడు దొరకడు, భార్యా మంచిది దొరకదు. ఈ సరుకంతా చెత్తవంటిదే కదా! ఇష్టపడే సరుకులా ఉండదు. అందువలన దాన్ని ఇష్టపడకు. ఇది నీకు సమాధానం అవాలి. కర్మల లెక్కలు తేల్చేయాలి కనుక సమాధానపడాలి. మనుషులు ఇష్టపడే పతిపత్నిలా ఉంటారా? అరె, సమాధానపడు ఇటు నుంచి. ఏదోవిధంగా క్లేశాలు తగ్గాలి. ఆ విధంగా పరిష్కారం తెచ్చుకో.

**ప్రశ్నకర్త :** దాదా, ఆమెకి అలాంటి సంయోగం జరిగిందంటే, అది కూడా రాసిపెట్టి వున్నట్లే జరిగింది కదా!

**దాదాశ్రీ :** రాసిపెట్టివుండకపోతే అలా జరగనే జరగదు.

సంసారమంటే మరి దెబ్బ తగులుతుంది కదా. బాయి సాహెబ్ అంటుంది ఈ గాయం పూడదు అని. కానీ సంసారంలో నిమగ్నమైపోతే గాయం పూడుతుంది. మూర్ఖత్వం. మోహం కారణంగా మూర్ఖత్వం. మోహం వలన గాయం పూడిపోతుంది. అలా గాయం పూడిపోకపోతే వైరాగ్యమే వచ్చివుండేది కదా! మోహమని దేన్ని అంటారు? ఎన్నో అనుభవాలు కలుగుతుంటాయి కాని మర్చిపోతారు. 'డైవర్స్' తీసుకునేటప్పుడు నిర్ణయించుకుంటారు, ఇక ఏ ఆడదాన్ని పెళ్ళిచేసుకోగూడదు అని. కాని, మళ్ళీ తిరిగి ఎగిరిగంతేస్తారు.

**ప్రశ్నకర్త :** నేను అతనితో అంటుంటాను, మన వైవాహిక జీవితం తొంభైతొమ్మిది శాతం సరైన జంట కాదు అని.

**దాదాశ్రీ :** ఎప్పుడైనా సరైన జంట కాదు అనిపించుకునేది కలియుగంలో, సరైన జంట కాకపోతే, ఆ సరికాని జంటే పైకి తీసుకెళ్తుంది లేదా ఒక్కసారిగా అధోగతిలోకి తీసుకుపోతుంది. రెండిటిలో ఒకరు పనికివచ్చేవారు అయ్యుంటారు, వారి జంట పనికిరానివారుగా ఉంటారు. సరికాని జంట కనుక, ఉచ్ఛ గతిలోకి తీసుకునిపోతుంది. అదే సరైన జంట అయితే ఇలా ఇక్కడే కలిసి తిరుగుతుంటారు.

సరిలేని జంటలో ఎలా ఉండాలి? అవతలివారు ఆవేశపడితే మనం శాంతం వహించాలి– మనం తెలివైనవాళ్ళమైతే. కాని, అవతలివారూ ఆవేశపడి, మనమూ ఆవేశపడితే ఇక అందులో ఏముంటుంది?

**ప్రశ్నకర్త :** డైవర్స్, ఎలాంటి సంయోగం జరగటం వలన డైవర్స్ తీసుకోవాలి?

**దాదాశ్రీ :** ఈ డైవర్స్ అనేది ఇప్పుడు వచ్చింది. పూర్వం డైవర్స్ అనేది ఎక్కడుంది?

**ప్రశ్నకర్త :** ఇప్పుడైతే అవుతున్నాయి కదా? కనుక, ఏ సందర్భాలలో అదంతా చెయ్యాలి?

**దాదాశ్రీ :** అసలు ఎందులోనూ కలవకపోతే, అప్పుడు విడిపోవటం మంచిది. అడ్జస్టబులే కాలేని సందర్భంలో విడిపోవటమే మంచిది. అయితే నేను అనేది ఒకటే, 'అడ్జస్ట్ ఎవిరీవేర్'. 'ఇలాంటిది, అలాంటిది' అని ఇతరులకు చెప్పి తప్పు చేయకండి.

**ప్రశ్నకర్త :** ఈ అమెరికాలో డైవర్స్ తీసుకున్నవారు, తప్పుచేసారంటారా లేక పరస్పరం పడకపోతే డైవర్స్ తీసుకున్నారంటారా?

**దాదాశ్రీ :** డైవర్స్ తీసుకోవటమంటే అర్థమేమిటి మరి? ఇవేమైనా కప్పు, సాసర్లా? కప్పు, ప్లేట్లను విడివిడిగా పంచరు. వాటికి డైవర్స్ చెయ్యరు. కాని, ఈ మగవాళ్ళు, ఆడవాళ్ళకి డైవర్స్ చేస్తారేమో? ఆ మనుషులకు, విదేశీయులకు ఇది సరియైనదే. కాని మీరు ఇండియన్స్. ఇక్కడ ఏకపత్నీవ్రతం, ఏకపతీవ్రతం అనే నియమం ఉండేది. ఒక భార్యని తప్ప మరో భార్యని కన్నెత్తి చూడను, అనేవారు, అలాంటి ఆలోచన ఉండేది. ఆలాంటిచోట డైవర్స్ శోభనిస్తుందా? డైవర్స్ అంటే ఎంగిలి గిన్నెల మార్పిడి. భోజనం చేసిన ఎంగిలి కంచాన్ని రెండవ మనిషికి ఇవ్వటం, తర్వాత మూడో మనిషికి ఇవ్వటం. వట్టిగా ఎంగిలి కంచాలను మార్చుకుంటూపోవటమే డైవర్స్ అంటే! నీకు ఇష్టమేనా డైవర్స్?

కుక్కలు, జంతువులన్నీ డైవర్స్ తీసుకున్నవే. ఇక ఈ మనుషులు కూడా అలాగే చేస్తే తేడా ఏముంటుంది? మనిషి బీస్ట్ (జంతువు) అయిపోయాడు. మన భారతదేశంలో ఒక పెళ్ళి తర్వాత రెండవ పెళ్ళి చేసుకోరు. అక్కడ భార్య చనిపోయిన తర్వాత కూడా పెళ్ళి చేసుకోరు, అలాంటివాళ్ళు! అలాంటి పవిత్రులు జన్మించారు.

అరె, విడాకులు తీసుకున్నవారిని ఒక గంటలో మళ్ళీ కలుపుతాను. విడాకులు తీసుకోవాలని అనుకునేవాళ్ళను నా దగ్గరికి తీసుకునిరండి. నేను ఒకే గంటలో వాళ్ళని తిరిగి కలుపుతాను. తర్వాత వాళ్ళు కలిసేవుంటారు. భయమనేది తెలివిలేనితనం. ఎంతోమంది విడిపోయారు, వాళ్ళని తిరిగి కలిపే మేలా జరిగింది.

ఇది మన సంస్కారం. దెబ్బలాడుతూ దెబ్బలాడుతూ ఎనభై ఏళ్ళు గడిచిపోతాయి. అయినా చనిపోయిన తర్వాత పదమూడవ రోజున శయ్యాదానం చేస్తారు. శయ్యాదానంలో బాబాయికి ఇది ఇష్టం, అది ఇష్టం అని పిన్ని బొంబాయి నుంచి అవన్నీ తెప్పించి పెడుతుంది. అప్పుడు ఒక అబ్బాయి, ఎనభై సంవత్సరాల పిన్నమ్మతో, 'అమ్మా! బాబాయి నిన్ను ఆరు నెలల క్రితం కిందపడేసాడు. అప్పుడు నువ్వు వ్యతిరేకంగా మాట్లాడావు బాబాయి గురించి' అంటాడు. 'అయినా, అలాంటి భర్త నాకు దొరకడు' అన్నదామె. అలా అన్నదామె! జీవితాంతం కలిగిన అనుభవంతో ఆయనలో వెతికి, 'కాని ఆయన మనసు చాల మంచిది. ప్రకృతే బాగోలేదు కాని హృదయమైతే....' అంటారు.

మనుషులు చూసేటట్టుగా ఉండాలి మన జీవితం. మనం ఇండియన్స్. మనం విదేశీయులం కాము. మనం స్త్రీని జాగ్రత్తగా చూసుకుంటాం, స్త్రీ మనల్ని మంచిగా చూసుకుంటుంది. అలా చేస్తూ ఎనభై ఏళ్ళు గడుపుతాం. కానీ వాళ్ళు (ఫారినర్స్) ఒక గంట సేపు కూడా ఒకరినొకరు మంచిగా చూసుకోరు, భర్త కూడా ఒక గంటైనా మంచిగా చూడడు.

ప్రతి వాళ్ళ ప్రకృతి అనే టపాకాయ పేలుతుంది. ఎక్కడి నుంచి వచ్చాయి ఈ టపాకాయలు?

**ప్రశ్నకర్త :** మన ప్రకృతుల నుంచే.

**దాదాశ్రీ :** 'ఇది పేలుతుంది' అని అనుకుంటే అప్పుడు అది తుస్సుమంటుంది! తుస్సు...తుస్సుమంటుంది. అవుతుందా అవదా?

ఒకవేళ మనసు, 'ఎంత ఎక్కువగా మాట్లాడటం జరిగింది! అంతా ఎలా అయింది?' అని ఆరోపిస్తే, అప్పుడు మనసుకి చెప్పండి, 'పడుకో. ఈ గాయం పూడిపోతుంది' అని. గాయం వెంటనే నయమౌతుంది. భుజం మీద తపతప కొడుతుంటే నిద్రపోతాడు. నీ గాయాలన్నీ పూడిపోయాయి కదా! లేదా? మిగిలిపోయిన గాయలు మరి?

**ప్రశ్నకర్త :** జగడమాడితేనే లోపల నిండిపోయివున్న సరుకంతా ఖాళీ అవుతుంది కదా?

**దాదాశ్రీ :** జగడం పెట్టుకుంటే లోపల కొత్త సరుకు నిండుతుంది. కానీ జ్ఞానం లభించిన తర్వాత నిండివున్న సరుకంతా బయటికి పోతుంది.

**ప్రశ్నకర్త :** భర్త జగడమాడుతున్నప్పుడు నేను ఆ సమయంలో ప్రతిక్రమణ చేస్తే?

**దాదాశ్రీ :** తప్పేం లేదు.

**ప్రశ్నకర్త :** నిండివున్న సరుకంతా బయటకు పోతుందా?

**దాదాశ్రీ :** అప్పుడైతే అంతా పోతుంది. ప్రతిక్రమణ ఎక్కడ జరుగుతుందో అక్కడ సరుకు బయటకు పోతుంది. ప్రతిక్రమణే ఏకైక ఉపాయం ఈ జగత్తులో.

భర్త తిడుతుంటే ఏం చేస్తావు ఇప్పుడు?

**ప్రశ్నకర్త :** సమభావంతో బయటకు పంపిచేస్తాం.

**దాదాశ్రీ :** ఔనా! వెళ్ళిపోవా ఇప్పుడు?

**ప్రశ్నకర్త :** లేదు.

**దాదాశ్రీ :** ఆయనే వెళ్ళిపోతే ఏం చేస్తావు అప్పుడు? 'నాకు నీతో పడదు' అంటే అప్పుడు?

**ప్రశ్నకర్త :** పిలుచుకునివస్తాను. క్షమించమని అడిగి, కాళ్ళమీద పడి వెనక్కి తీసుకునివస్తాను.

**దాదాశ్రీ :** ఆ. వెనక్కి తీసుకునిరా. అనునయించి, తల మీద చెయి పెట్టి, తల నిమిరి.. అలా కూడా చెయ్యాలి అతను ఊరుకునేటట్లు.

తెలివిగానే వ్యవహరిస్తే పని జరుగుతుందంటే తెలివిని ఉపయోగించాలి. మళ్ళీ రెండవ రోజు అతను, 'నా కాళ్ళు పట్టుకున్నావు కదా!' అంటే, 'ఆ సంగతి వేరు.

మీరెందుకు వదిలి వెళ్ళిపోతున్నారు, అర్థం చేసుకోకుండా ఉన్నారు. అందుకే పట్టుకున్నా' అనండి. అతను అనుకుంటాడేమో శాశ్వతంగా పట్టుకున్నావని కాని అది ఆ సమయం కోసం మాత్రమే, ఆన్ ద మూమెంట్ (ఆ క్షణం కోసం).

## [ 21 ] సప్తపది సారం

జీవించే కళ ఈ కాలంలో లేదు. మోక్షమార్గాన్ని వదిలిపెట్టు, కనీసం జీవితాన్ని జీవించటమైనా రావాలి కదా? ఈ మార్గం ఇలా ఉంటుంది, ఆ మార్గం అలా ఉంటుంది అని అర్థం చేసుకోవాలి. ఆ తర్వాత ఏ మార్గంలో వెళ్ళాలన్నది నిర్ణయించుకోవాలి. అర్థం కాకపోతే దాదాని అడగండి. అప్పుడు దాదా మీకు, ఈ మూడు మార్గాలు ప్రమాదకరమైనది, ఈ మార్గం సురక్షితమైనది అని మీకు చూపిస్తారు. ఆ మార్గంలా మా ఆశీర్వాదం తీసుకుని నడవండి.

పెళ్ళయినవాళ్ళకి, నేను బాగా ఇరుక్కుపోయాను అనిపిస్తుంది. పెళ్ళి కానివాళ్ళకి వాళ్ళు మజా చేసుకుంటున్నారు అనిపిస్తుంది. ఈ ఇద్దరి మధ్య ఉన్న తేడాని ఎవరు దూరం చేస్తారు? పెళ్ళి చేసుకోకుండానే ఉందామా అంటే అదీ వీలు కాదు ఈ ప్రపంచంలో. మరెందుకు పెళ్ళి చేసుకుని దు:ఖపడటం అంటే అంటారు, వీళ్ళకి దు:ఖం లేదు, ఎక్స్‌పీరియన్స్ (అనుభవం) పొందుతున్నారు అని. సంసారం సరిగ్గా నడుస్తున్నదా లేక తప్పుగానా? సుఖమనేది ఉందా లేదా? లెక్క పూర్తవటానికే సంసారం. మీరు మీ బైఖాతాలోని లెక్కలను తీర్చుకున్నారా?

ప్రపంచమంతా గానుగ లాంటిది. మగవాడు ఎద్దు జాగాలో ఉన్నాడు, స్త్రీ నూనె తీసేవాని జాగాలో. అక్కడ నూనెతీసేవాడు పాడుతాడు, ఇక్కడ స్త్రీ పాడుతుంది. ఎద్దేమో కళ్ళకి గంతలతో గానుగలోనే తిరుగుతుంటుంది. చుట్టూ తిరుగుతుంటుంది. రోజంతా అలాగే బయట తిరుగుతుంటాడు. కాశీ చేరుకున్నానని అనుకుంటాడు కానీ, పట్టీ విప్పి చూస్తే భాయ్‌సాబ్ ఎక్కడివాడు అక్కడే ఉంటాడు. మరి ఆ ఎద్దుని నూనెతీసేవాడు ఏమంటాండు? మరికాస్త దానా ఎద్దుకి తినిపిస్తాడు, ఇక ఎద్దు సంతోషంగా మళ్ళీ తిరగటం మొదలుపెడుతుంది. అలాగే ఇక్కడ స్త్రీ మంచి ఆహారాన్ని తినిపిస్తే, భాయ్ మంచిగా తిని మళ్ళీ మొదలుపెడతాడు.

ఇక రోజులు ఎలా గడుస్తాయి అన్నది కూడా కష్టంగానే ఉంది. భర్త వచ్చి, 'నాకు హార్ట్‌లో నొప్పిగా ఉంది' అంటాడు, కొడుకు వచ్చి, 'నేను ఫెయిల్ అయ్యాను' అంటాడు. భర్తకి గుండెల్లో నొప్పిగా ఉన్నపుడు భార్యకి 'హార్ట్ ఫెయిల్ అయితే ఎలా?' ఆలోచన వస్తుంది. అన్ని రకాల ఆలోచనలు ముసురుకుంటాయి. ప్రశాంతత ఉండదు.

పెళ్ళి విలువ ఎప్పుడు తెలుస్తుంది? లక్షల్లో ఒకటో అరో మనిషికి పెళ్ళయితే. ఇక్కడ అందరూ పెళ్ళి చేసుకుంటున్నారు, అందులో ఏముంది? స్త్రీ పురుషుల వ్యవహారం (పెళ్ళి తర్వాత) ఎలా ఉండాలి అన్నదానికి చాల పెద్ద కాలేజ్ ఉంది. వీళ్ళు అందులో చదవకుండానే పెళ్ళి చేసుకుంటారు.

ఇక ఒకసారి అవమానం జరిగినట్లయితే అవమానాన్ని సహించటంలో తప్పు లేదు. కానీ దానితోపాటు అవమానపు లక్ష్యం (జాగృతి) లో పెట్టుకునే అవసరం ఉంది, అవమానం కోసమే జీవించాలా అని. అవమానం వలన నష్టం లేదు కానీ మానం అవసరం కూడా ఏమీ లేదు. కాని, మన జీవితం అవమానం కోసమేనా? అటువంటి లక్ష్యమైతే ఉండాలి కదా?

భార్య అలిగివుంటే అప్పటి వరకు భగవంతుని గుర్తు చేసుకుంటూవుంటాడు. భార్య మాటలు కలిపితే భాయ్ తయారు! ఇక భగవాన్, మిగతావన్నీ పక్కకు వెళ్ళిపోతాయి. ఏమిటీ అలజడి! ఇలా దు:ఖం పోతుందా?

ప్రపంచమంటే ఏమిటి? ఒక వల. ఈ శరీరం లభించిందంటే, అది కూడా ఒక వలే. వల అంటే సరదాపడేవాళ్ళుంటారా? వలని ఇష్టపడేవాళ్ళుంటారంటే ఆశ్చర్యం కదా! చేపల వల వేరు, ఈ వల వేరు. చేపల వలని కట్‌చేసి బయటపడవచ్చు. కానీ, ఇందులోంచి బయటపడలేరు. చివరకు శవం లేచినపుడు మాత్రమే బయటపడతారు.

'జ్ఞాని పురుష్' ఈ ప్రాపంచిక వల నుంచి బయటపడే మార్గాన్ని చూపిస్తారు, మోక్ష మార్గాన్ని చూపించి, సరైన దారిలోకి తీసుకునివస్తారు, ఈ వల నుంచి విముక్తులయ్యామని మనకి తెలుస్తుంది.

దీన్ని జీవితమని ఎలా అంటారు? జీవితం సుశోభితంగా ఉంటుంది. ఒక్కో మనిషి నుంచి సుగంధం రావాలి. చుట్టుపక్కల కీర్తి ఎలా వ్యాపించాలంటే, 'ఈ సేఠ్ ఉన్నాడే, ఎంత మంచివాడు! ఆయన మాటలు ఎంత బావుంటాయి! ఆయన ప్రవర్తన ఎంత బావుంటుంది!' ఇలాంటి కీర్తి అన్ని వైపులా కనిపిస్తుందా? ఇలాంటి సుగంధం వస్తోందా మనుషుల నుంచి?

**ప్రశ్నకర్త :** అప్పుడప్పుడు కొందరి నుంచి సుగంధం వస్తుంది.

**దాదాశ్రీ :** కొందరు మనుషుల నుంచి, కాని వాళ్ళు ఎంతమంది? మరి వాళ్ళ ఇంటికిపోయి అడిగితే దుర్గంధం వస్తుంది. బయట సుగంధం వస్తుంది కాని ఇంటికి పోయి అడిగితే, 'అతని పేరే ఎత్తకు, ఆయన మాట ఎత్తవద్దు' అంటారు. కనుక, దాన్ని సుగంధం అని అనలేము.

జీవితం సహాయం చేసేందుకే ఉండాలి. ఈ అగర్‌బత్తి కాలినపుడు, అది దాని సుగంధం తీసుకుంటుందా?

మరి ఈ ప్రపంచం ఒక మ్యూజియమ్. ఈ మ్యూజియమ్‌లో నియమం ఏమిటి? ప్రవేశంలోనే రాసివుంటుంది, 'భాయ్, నీవు తినటం, తాగటం, అనుభవించటం అంతా లోపలే చెయ్యి. దేన్నీ బయటకు తీసుకునివెళ్ళవద్దు, కొట్లాటలు వద్దు. ఎవరి పట్లా రాగద్వేషాలు వద్దు. తినటం తాగటం అంతా చెయ్యి కాని రాగద్వేషాలు వద్దు. లోపలికెళ్ళి వీళ్ళు పెళ్ళిచేసుకుంటారు. అరె, పెళ్ళి ఎవరు చేసుకున్నారు? అది, బయటకు పోయేటప్పుడు వీడిపోతుంది. కాని అతను, నేను బంధింపబడ్డాను అంటాడు. చట్ట ప్రకారం లోపలికి పోయి తినండి, తాగండి, పెళ్ళి చేసుకున్నా పరవాలేదు. స్త్రీతో, 'చూడు, ఈ ప్రపంచం ఒక సంగ్రహాలయం, ఇందులో రాగద్వేషాలు పెట్టుకోవద్దు. బాగనిపించినంత వరకు తిరిగి చూడండి కానీ, చివరకు రాగద్వేషాలు లేకుండా వెళ్ళిపోండి' అని చెప్పాలి. ఆమె మీద ద్వేషం లేదు. మరుసటి రోజు మరొకరితో తిరుగుతూవున్నా, ఆమె మీద ద్వేషం లేదు. ఈ సంగ్రహాలయం అలాంటిది. మరి మీరు ఎలాంటి యుక్తులు పన్నాలో అన్నీ చేయండి. ఇప్పుడు సంగ్రహాలయాన్ని

దూరం చెయ్యలేరు. ఇక ఇప్పుడు ఏం జరిగితే అదే సరి. మనం సంస్కారవంతమైన దేశంలో జన్మించాం కదా! కనుక, మ్యారేజ్ వ్యారేజ్ అంతా సక్రమంగా జరగాలి.

## [22] స్త్రీ పురుషుల ప్రాకృతిక పర్యాయపదాలు

**ప్రశ్నకర్త :** స్త్రీలకు ఆత్మజ్ఞానం వస్తుందా లేదా? సమకితం ఔతారా?

**దాదాశ్రీ :** వాస్తవానికి అవదు. కానీ నేను ఇక్కడ వచ్చేటట్లు చేస్తాను. ఎందుకంటే ప్రకృతిలోని ఆ తరగతి ఎలాంటిదంటే, అందులోకి ఆత్మజ్ఞానం చేరదు. ఎందుకంటే, స్త్రీల కపట గ్రంథి చాల పెద్దది. మోహం, కపటం, ఈ రెండు గ్రంథులూ ఆత్మజ్ఞానాన్ని తాకనివ్వవు.

**ప్రశ్నకర్త :** అంటే అది వ్యవస్థలో జరిగిన అన్యాయం కాదా?

**దాదాశ్రీ :** కాదు. ఆమె తర్వాత జన్మలో పురుషుడిగా పుట్టి మోక్షానికి పోతుంది. స్త్రీలు మోక్షానికి పోలేరని వీళ్ళంతా అంటారే ఆ మాట వట్టిది కాదు. పురుషుడై తర్వాత పోతుంది. స్త్రీ ఎప్పుడూ స్త్రీగానే ఉండిపోవాలనే చట్టమేమీ లేదు. ఆమె పురుషిడిలా ఎప్పుడౌతుందంటే, పురుషుడితో స్పర్థ, అహంకారం పెంచుకుని, క్రోధం పెంచుకుంటే ఆమె స్త్రీత్వం ఎగిరిపోతుంది. అహంకారం, క్రోధం పురుషుని ప్రకృతి. మాయ, లోభం స్త్రీ ప్రకృతి. అలా నడుస్తుంది ఈ బండి. కాని మన అక్రమ విజ్ఞానం ప్రకారం, స్త్రీకి మోక్షం కలుగుతుంది. ఎందుకంటే ఆ విజ్ఞానం ఆత్మని మేలుకొలుపుతుంది. ఆత్మజ్ఞానం జరగకపోయినా పరవాలేదు. ఆత్మను మేలుకొల్పుతుంది. ఎంతమంది స్రీలో ఉన్నారు నిరంతరం ఇరవై నాలుగు గంటలు దాదాని స్మరించుకునేవారు. భారత్‌లో ఎంతమంది, అమెరికాలో దాదాని నిరంతరం గుర్తుంచుకునేవారు ఎంతమంది ఉండవచ్చు!

**ప్రశ్నకర్త :** అయితే ఆత్మకి జాతి అనేదే లేదా?

**దాదాశ్రీ :** ఆత్మకి జాతి అనేదే ఉండదు కదా! ప్రకృతికి జాతి ఉంటుంది. ప్రకాశవంతమైన సరుకు నిండివుంటే ప్రకాశవంతమైన సరుకే బయటకు వస్తుంది.

నల్లటిది నిండివుంటే నల్లటిదే బయటకు వస్తుంది. ప్రకృతి, ఇది కూడా నిండివున్న సరుకే. సరుకు నిండివున్నది ప్రకృతి, దాన్ని పుద్గల్ అంటారు. అంటే సంపూర్ణమైనది విడుదలచేయుటం జరుగుతుంది. భోజనం పూర్తయితే అది మరుగుదొడ్డిలో విసర్జించబడుతుంది. తాగిన నీళ్ళు మూత్రంలో, ఉఛ్వాస నిశ్వాసలో, అన్నీ పుద్గల్ పరమాణువులు.

పురుషుడు అవాలంటే ఈ రెండు గుణాలు పోతేనే సాధ్యమౌతుంది, మోహం, కపటం. మోహం, కపటం అనే రెండు పరమాణువులు కలిస్తే స్త్రీ అవుతుంది. క్రోధం, మానం రెండూ కలిస్తే పురుషుడౌతాడు. అంటే పరమాణువు ఆధారంగా ఇదంతా జరుగుతోంది.

ఒకసారి బెహన్‌లు నన్ను అడిగారు, మాలో కొన్ని విశేషమైన దోషాలుంటాయి. వాటిలో ఎక్కువ హానికరమైన దోషాలు ఏమిటి అని. అప్పుడు నేను, 'తన *ధార్య* చేయించాలనుకుంటుందే, అది' అన్నాను. బెహన్‌లందరి ఇచ్ఛ ఏమిటంటే వాళ్ళ *ధార్య* (మనసుకి నచ్చినది) నెరవేరాలని. భర్తకి కూడా తప్పుగా చెప్పి అతనితో తన *ధార్య* చేయిస్తుంది. కనుక ఇది తప్పు, వ్యతిరేక మార్గం. నేను వాళ్ళచేత రాయించాను, ఈ మార్గం తొక్కగూడదు అని. *ధార్య* చేయించటమంటే అర్థమేమిటి? చాల నష్టదాయకం.

**ప్రశ్నకర్త :** కుటుంబానికి లాభం కలుగుతుందనుకున్నది మేము చేయిస్తే దాంట్లో తప్పేముంది?

**దాదాశ్రీ :** లేదు అది మేలు చేయనేచేయలేదు కదా! *ధార్య* చేయించేవారు, కుటుంబానికి మేలుచేయరు, ఎప్పుడూ. కుటుంబానికి మేలు ఎవరు చేస్తారు, 'అందరికీ వారి వారి *ధార్య* ఉంటే బావుంటుంది' అని అనుకునేవారు. అందరికీ, ఎవరికీ కూడా మనసు నొచ్చుకోగూడదు అలా జరిగితే అప్పుడు. *ధార్య* చేయించాలనుకునేవారు కుటుంబానికి చాల పెద్ద నష్టం చేస్తారు. అది గొడవలు, జగడాలు పెట్టుకునే సాధనం. తనకంటూ *ధార్య* లేకపోతే అసలు తినదు కూడా, దు:ఖంతో ఉండిపోతుంది. ఎవరిని దెబ్బతీయాలంటే వాళ్ళని మానసికంగా దెబ్బతీసి

మిన్నకుంటుంది. రెండవ రోజు మళ్ళీ కపటం చూపిస్తుంది. అదేమి జాతి! ధార్యు అనుసారం చేయాలనుకుంటే, అది లేకపోతే ఏమౌతుంది? అలా అన్నీ పెట్టుకోగూడదు. బెహన్లూ, ఇక మీరు ఉదార హృదయులవండి.

**ప్రశ్నకర్త :** స్త్రీలు కన్నీటితో మగవాళ్ళను కరిగిస్తారు, తన తప్పిదాన్ని కూడా ఒప్పని ఒప్పిస్తారు. ఈ విషయంలో మీరేం చెప్తారు?

**దాదాశ్రీ :** అది నిజమే. ఆ పాపం వాళ్ళకి తగులుతుంది. అంతేకాక, పట్టుపడుతుంది కదా, దానివలన విశ్వాసం పోతుంది.

ఎవరి భర్తయినా అమాయకుడైతే వేలెత్తండి. వేలు పైకెత్తినవారు నాతో ఏకాంతంలో, 'నా భర్త అమాయకుడు, అందరూ అమాయకులే' అంటుంది. ఇది ఇట్‌సెల్ఫ్ సూచించేది ఏమిటంటే, స్త్రీలు భర్తలను నాట్యం చేయిస్తారని. దీన్ని బయటకు చెప్పటం తప్పగా కనిపిస్తుంది. తప్పుగా కనిపించదా? ఎక్కువగా చెప్పలేము. విడిగా స్త్రీలతో, 'బెహన్, మీ భర్త అమాయకుడా?' అని అడిగితే, 'చాల అమాయకుడు' అంటారు. కపటంతో కూడిన సరుకు నిండివుంది కనుక, అలా చెప్పలేరు, బాగుండదది. మిగతా గుణాలన్నీ చాల మంచివి.

**ప్రశ్నకర్త :** స్త్రీని ఒక పక్క లక్ష్మీ అంటారు, రెండవ పక్క కపటి, మోహంతో....

**దాదాశ్రీ :** లక్ష్మీ అంటారు. ఆమె ఏమైనా తక్కువదా? పతి నారాయణుడైతే ఆమెని ఏమనాలి? కనుక ఆ జంటని లక్ష్మీనారాయణ అంటారు! ఆమేమైనా తక్కువ స్థాయిదా? స్త్రీ తీర్థంకరుల మాత. ఎందరు తీర్థంకరులున్నారో, ఇరవైనాలుగు మంది, వాళ్ళ మాత ఎవరు?

**ప్రశ్నకర్త :** స్త్రీలు.

**దాదాశ్రీ :** అలాంటప్పుడు వాళ్ళని తక్కువ స్థాయివాళ్ళని ఎలా అనగలరు? స్త్రీగా పుట్టింది కాబట్టి మోహమైతే ఉంటుంది కదా. కానీ జన్మనిచ్చింది ఎవరు? పెద్ద పెద్ద తీర్థంకరులందరికీ... జన్మనిచ్చేది వాళ్ళే, మహాత్ములకు. వాళ్ళని మనం తప్పుగా ఎలా అంటాం. అయినా మనవాళ్ళు స్త్రీలను తప్పుగా అంటారు.

**ప్రశ్నకర్త :** మనం ఎప్పుడూ స్త్రీలందరితోను, మీరు మీ మర్యాదను కాపాడుకోండి అంటాము కానీ, పురుషులను అనం.

**దాదాశ్రీ :** అది మన మనిషిగా చేసిన దురపయోగం. అధికార దురుపయోగం. అధికారంతో రెండు రకాల ఉపయోగం జరుగుతుంది. ఒకటి సద్వినియోగం, రెండు దుర్వినియోగం. సదుపయోగం చేస్తే సుఖప్రాప్తి జరుగుతుంది. కానీ, ఇప్పటికీ దురపయోగమే చేస్తున్నావు కనుకనే దు:ఖం సంప్రాప్తిస్తోంది. దుర్వినియోగం చేసిన అధికారం చెయిజారిపోతుంది. అధికారాన్ని ఎప్పటికీ ఉంచుకోవాలంటే, ఎప్పటికీ పురుషునిగా మీరు ఉండాలనుకుంటే, అధికారాన్ని దుర్వినియోగం చేసుకోకండి. లేకపోతే తర్వాత జన్మలో స్త్రీ అవుతారు అధికారం ఉన్నవారికి! అధికారాన్ని దుర్వినియోగం చేస్తే అధికారం పోతుంది.

ఏమైనా కానీ, భర్త లేకపోయినా, భర్త వెళ్ళిపోయినా కూడా రెండవతని దగ్గరకు పోకండి. అతను ఎలాంటివాడైనా సరే, భగవంతుడే స్వయంగా మగవాడి రూపంలో వచ్చినా కూడా వద్దు! 'నా దగ్గర నా భర్త ఉన్నారు, నేను పతివ్రతను' అన్నామె సతి అనిపించుకుంటుంది. ఈ కాలంలో సతి అని ఎవరినైనా అనగలమా వీళ్ళల్లో? ఎల్లప్పుడూ అలా కాదు కదా? కాలం వేరే విధంగా ఉందిప్పుడు. సత్యయుగంలో అలాంటి టైము అప్పుడప్పుడు వస్తుంది, సతులకే. అందుకే కదా సతుల పేరెత్తుతారు అంతా.

**ప్రశ్నకర్త :** ఔను.

**దాదాశ్రీ :** అది, ఆమె సతి అవాలనే కోరిక కారణంగా. ఆమె పేరు ఎత్తినందుకు ఎప్పుడో ఒకప్పుడు సతి అవుతారు. ఈ విషయం గాజుల ధరకి అమ్ముడుపోతోంది. అది మీకు తెలుసా? అర్థమైందా మీకు, నేను చెప్తున్నదాని అర్థం?

**ప్రశ్నకర్త :** ఆ. గాజుల ధరకి అమ్ముడు పోతోంది.

**దాదాశ్రీ :** ఏ బజారులో? కాలేజ్‌లలో! ఏ ధరకి అమ్ముడుపోతోంది? బంగారం ధరకి గాజులు అమ్ముడుపోతున్నాయి. అక్కడ రత్నాల ధరకి చూడీలు

అమ్ముడుపోతున్నాయి. అన్నిచోట్లా అలాగే జరుగుతోంది. అవటం లేదా? అన్ని చోట్లలో అలా జరగదు. ఎంతో మంది బంగారం ఇచ్చినా తీసుకోరు. ఏమైనా ఇవ్వండి కాని తీసుకోరు. కానీ మిగతావారు అమ్ముడుపోతారు, ఈ కాలపు స్త్రీలు. బంగారం ధరకి కాకపోతే మరో ధరకైనా అమ్ముడుపోతారు.

కనుక, దీని కోసమే స్త్రీ అయ్యారు. కేవలం ఒక్క విషయం కోసమే. పురుషుడేమో భోగించటానికి స్త్రీని ఎంకరేజ్ (ప్రేరణ) చేసాడు, పాపం ఆవిడ చెడిపోయింది. వరం లేకపోయినా తనలోనే ఆ వరం ఉందని మనసులో నమ్ముతోంది. ఎలా నమ్ముతున్నావు, ఏవిధంగా ఒప్పుకుంటున్నావు అంటే, మగవాడు మళ్ళీ మళ్ళీ అంటూవుంటే, ఆమె అంటున్నదానిలో తప్పేముంది అనుకుంటుంది. తనంతట తానుగా ఒప్పుకోదు. మీరనివుంటారు నువ్వు చాల బావున్నావు, నీలాంటి ఆడది మరెవరూ ఉండరు అని. నువ్వు అందంగా ఉన్నావు అంటే ఆమె తాను అందంగా ఉన్నాననే అనుకుంటుంది. ఈ మగవాళ్ళు ఆడవాళ్ళని, స్త్రీ రూపంలోనే ఉంచేసారు. స్త్రీ మనసులో, నేను మగవాడిని ఆటపట్టిస్తున్నా, మూర్ఖుడిని చేసాను అనుకుంటుంది. అలా చేసి మగవాళ్ళు వాళ్ళని భోగించి వేరుగా వెళ్ళిపోతారు.

**ప్రశ్నకర్త :** అంటే, స్త్రీలు చాల కాలం వరకు స్రీ జన్మలో ఉంటారని నిశ్చయంగా చెప్పలేము. కాని, వాళ్ళకి తెలియదు కనుక దానికి ఉపాయమేమీ లేదు.

**దాదాశ్రీ :** ఉపాయముంటే స్త్రీ, పురుషుడే. ఆమెకి ఆ గ్రంథి గురించి తెలియదు పాపం. అక్కడ ఇంటరెస్ట్ ఉంటుంది, అక్కడ మజా వస్తుంది కనుక అక్కడే ఉండిపోతుంది. వేరెవరికీ ఈ మార్గం తెలియదు కనుక చెప్పరు. దీన్ని కేవలం సతి స్త్రీలకు మాత్రమే తెలుసు. సతి తన భర్తని తప్ప అన్యులెవరి గురించీ ఆలోచించదు ఎప్పటికీ జరగదు. ఆమె భర్త వెంటనే చనిపోయినా, వెళ్ళిపోయినా సరే, జరగదు. ఆ భర్తనే భర్తగా స్వీకరిస్తుంది. అందువలన అటువంటి స్త్రీల కపటమంతా నశిస్తుంది.

సతిత్వాన్ని అనుసరిస్తే కపటం పోవటం మొదలుపెడుతుంది తనంతట తానుగానే. మీరు ఏమీ చెప్పవలసిన పని ఉండదు. మౌలికమైన సతి, జన్మతోనే సతిగా

ఉంటుంది. అంటే, ఆమెలో అంతకు ముందు ఎటువంటి మచ్చ ఉండదు. కాని మీకు పూర్వపు మచ్చ ఉండిపోతుంది, మళ్ళీ పురుషుడిగా పుడతారు. కానీ, పురుషులలో కూడా కొందరు పురుషులు, పురుషులుగా వచ్చినా అందరూ సమానంగా ఉండరు. కొందరు పురుషులు స్త్రీలలా ఉంటారు. స్త్రీల లక్షణాలు కొన్ని ఉండిపోతాయి. ఒకవేళ కపటం పోయి, సతీత్వం వచ్చినట్లయితే అప్పుడు (కపటం) నశిస్తుంది. పురుషుడై సతిలా స్వచ్ఛంగా అయిపోతుంటాడు, దోషం నశిస్తుంటుంది. ఎంతమంది సతి అవుతారో, వారందరి దోషాలు నశిస్తాయి, వాళ్ళు మోక్షానికి పోతారు. అర్థమౌతోందా ఏమైనా? మోక్షానికి వెళ్ళాలంటే సతి అవాలి. ఔను, ఎందరు సతి అయ్యారో వారంతా మోక్షానికి పోయారు. లేకపోతే పురుషుడవాల్సివుంటుంది. పురుషులు పాపం అమాయకులుగా ఉంటారు. ఎలా ఆడిస్తే అలా ఆడుతారు పాపం. అందరు మగవాళ్ళనీ స్త్రీలు ఆడించారు. స్త్రీలలో కేవలం సతి స్త్రీలు మాత్రమే పురుషులను ఆడించదు. సతి తన పతిని పరమేశ్వరునిగా భావిస్తుంది.

**ప్రశ్నకర్త :** అలాంటి జీవనం చాల తక్కువమందిలో కనిపిస్తుంది.

**దాదాశ్రీ :** ఈ కలియుగంలో ఎక్కడి నుంచి ఔతుంది. సత్యయుగంలో కూడా కొద్ది మందే సతులు అయ్యారు. అలాంటప్పుడు ఈ కలియుగంలో ఎక్కడి నుండి ఔతారు?

కనుక, స్త్రీల దోషం లేదు. స్త్రీలు దేవీ స్వరూపులు. స్త్రీలలోను, పురుషులలోను ఆత్మ ఆత్మే. కేవలం ప్యాకింగ్‌లోనే తేడా ఉంది. 'డిఫరెన్స్ ఆఫ్ ప్యాకింగ్'. స్త్రీ ఒక విధంగా 'ఇఫెక్ట్'. ఆత్మ మీద స్త్రీ 'ఇఫెక్ట్' ఉంటుంది. ఆమె 'ఇఫెక్ట్' మనమీద పడకుండా ఉంటే అంతే చాలు. స్త్రీ, ఆమె ఒక శక్తి. ఈ దేశంలో రాజనీతిలో ఎటువంటి స్త్రీలు వచ్చారు! ధర్మ క్షేత్రంలో ముందుకు ఎదిగిన స్త్రీలు, వాళ్ళు ఎలాంటివాళ్ళు? ఈ క్షేత్రం నుంచి లోకకళ్యాణం చేయవచ్చు. స్త్రీలలో లోక కళ్యాణం చేసే శక్తి నిండివుంది. అందులో తన సంక్షేమం, ఇతరుల సంక్షేమం కూడా చూసే శక్తి వుంది.

## [23] విషయం ఆగిపోతే ప్రేమ సంబంధం

వైవాహిక జీవితం శోభాయమానం ఎప్పుడౌతుంది? ఇద్దరికీ జ్వరం వస్తే అప్పుడు వాళ్ళు మందు వేసుకోవాలి. జ్వరం లేకుండా మందు వేసుకోగూడదు. ఎవరైనా ఒకరు జ్వరం లేకుండా మందు వేసుకుంటే ఆ వైవాహిక జీవితం శోభనివ్వదు. ఇద్దరికీ జ్వరం వచ్చినపుడే మందు వేసుకోండి. దిస్ ఈజ్ ది ఓన్లీ మెడిసిన్ (ఇది కేవలం మందు మాత్రమే). మెడిసిన్ తియ్యగా ఉన్నా, అది రోజూ వేసుకునేది కాదు. వైవాహిక జీవితాన్ని శోభాయమానం చెయ్యాలంటే, సంయమం కలిగిన పురుషుని ఆవశ్యకత ఉంటుంది. ఈ జంతువులన్నీ అసంయమమైనవి అనిపించుకుంటాయి. మనుషులైతే సంయమ జీవనాన్ని సాగించాలి. మొదట్లో రాముడు – సీత మొదలైనవాళు ళ్ళ అయ్యారు. వాళ్ళంతా సంయమనం కలిగినవాళ్ళు. స్త్రీ తో సంయమనం. ఇప్పుడున్న ఈ అసంయమనం ఏమైనా దేవీగుణమా? కాదు అది పాశవిక గుణం. మనుషులలో అలా ఉండగూడదు. మనుషులు అసంయమనంగా ఉండ కూడదు. లోకంలో విషయమంటే ఏమిటో తెలియదు. ఒకసారి విషయంలో ఐదైదు లక్షల జీవాలు చనిపోతాయి. అది తెలియకపోవటం వలన ఇక్కడ మజా చేసుకుంటూవుంటారు. అర్థం చేసుకోరు కదా! వేరే దారి లేకపోతేనే అటువంటి హింసకు పాల్పడాలి అని ఉండాలి. కానీ అలా అర్థం చేసుకోవటం లేదంటే, అప్పుడు ఏం చెయ్యాలి?

అన్ని మతాలు, స్త్రీని త్యాగం చేయమని గందరగోళం సృష్టించారు. అరె, స్త్రీని త్యాగం చేసి నేనెక్కడికి పోను? నాకు భోజనం ఎవరు తయారుచేసి పెడతారు? నేను నా వ్యాపారమే చెయ్యనా లేక పొయి గొట్టం ఊదుకుంటూ కూర్చోనా?

వైవాహిక జీవితాన్ని వాళ్ళు ప్రోత్సహించారు. శాస్త్రకారులు కూడా వైవాహిక జీవనాన్ని తప్పుపట్టలేదు. పెళ్ళి కాకుండా ఇతర భ్రష్టాచారాలను తప్పుపట్టారు.

**ప్రశ్నకర్త :** విషయం కేవలం సంతానం కోసమే చెయ్యాలా లేక బర్త్ కంట్రోల్ చేసి విషయ భోగం చేయవచ్చునా?

**దాదాశ్రీ :** లేదు లేదు. అదంతా ఋషి, మునుల సమయంలో, మొదట్లో పతి–పత్ని వ్యవహారం ఉండేది కాదు. ఋషి ముని పెళ్ళి చేసుకునేవారు. అయితే మొదట వాళ్ళు పెళ్ళికి అంగీకరించేవారు కాదు. అప్పుడు ఋషి పత్ని, 'మీరు ఒంటరివారు! మీ సంసారం సరిగ్గా నడవదు. ప్రవృత్తి సరిగ్గా ఉండదు. అందువలన మాతో పార్ట్‌నర్‌షిప్ పెట్టుకోండి, స్త్రీలతో. అప్పుడు మీ భక్తి, సంసారం కూడా ముందుకు నడుస్తుంది' అన్నారు. కనుక వాళ్ళు యాక్సెప్ట్ చేసారు. కాని వాళ్ళు, 'మీతో సంసారం చెయ్యము' అన్నారు. అప్పుడు  ఆ స్త్రీలు, 'కాదు, మాకు ఒక పుత్రదానం ఒక పుత్రికా దానం, కేవలం రెండు దానాలు ఇవ్వండి. ఆ దానం వరకే సంగమం. తర్వాత సంగమం ఉండదు. ఆ తర్వాత మీది మాది కేవలం ఫ్రెండ్‌షిప్' అన్నారు. కనుక, వాళ్ళు దాన్ని యాక్సెప్ట్ చేసి, తర్వాత మిత్రులలా  ఉండేవారు కానీ, పత్ని లాగా కాదు. వాళ్ళు ఇంటి పనులన్నీ చేసేవారు. వీళ్ళు బయటి పనులు చేసేవారు. ఆ తర్వాత ఇద్దరూ కలిసి కూర్చుని భక్తి సాధన చేసేవారు. కానీ ఇప్పుడు ఇదే ఇంక మిగిలింది బాకీ! అందుకే అంతా చెడిపోయింది. ఋషి, మునులు నియమబద్ధులు.

ఇప్పుడు ఒక కొడుకు, ఒక కూతురు కోసం పెళ్ళి చేసుకుంటే తప్పు లేదు. తర్వాత స్నేహితులలా ఉండవచ్చు. ఇక దు:ఖభరితం అవదు కదా. వీళ్ళు సుఖాన్ని వెతుక్కుంటారు. అలాంటప్పుడు అలాగే జరుగుతుంది కదా! దావాలు వేసుకుంటూవుంటారు. ఋషి మనులు వేరుగా ఉండేవారు.

ఏకపత్నీ వ్రతాన్ని పాటిస్తావా? అని అడిగితే 'పాటిస్తాను' అంటే వాళ్ళకి మోక్షమే. కానీ, పర స్త్రీ గురించి ఏమాత్రం ఆలోచన వచ్చినా, అక్కడి నుంచే మోక్షం పోతుంది. ఎందుకంటే అది *అణహక్క్* (హక్కు లేనిది). హక్కున్న చోట మోక్షం, *అణహక్క్* ఉంటే అది పాశవికత.

విషయానికి ఒక హద్దు ఉండాలి. స్త్రీ–పురుషుల విషయం ఎంత వరకు ఉండాలి? పర స్త్రీ ఉండగూడదు, పర పురుషుడు ఉండగూడదు. వాళ్ళ మీద ఆలోచన వచ్చినా, అందుకు ప్రతిక్రమణ చేసి దాన్ని కడిగేసుకోవాలి. అతి పెద్ద ప్రమాదకరమైనది

ఇదే పర స్త్రీ, పర పురుషుడు! తన సొంత స్త్రీ అయితే ప్రమాదం లేదు. ఇప్పుడు ఇందులో నా తప్పు ఎక్కడుంది? నేనేమైనా కోప్పడుతున్నానా ఏ విధంగానైనా? ఇందులో ఏమైనా తప్పు ఉందా? ఇది నా సైంటిఫిక్ పరిశోధన. లేకపోతే సాధువులకు ఎంత వరకు చెప్పారంటే, స్త్రీ చెక్క విగ్రహమున్నా, దాన్ని కూడా చూడవద్దని. స్త్రీ కూర్చున్న చోట కూర్చోవద్దు. కానీ నేను అలాంటి జోక్యమేమీ చేసుకోలేదు కదా?

ఈ కాలంలో ఏకపత్నీ వ్రతాన్నే నేను బ్రహ్మచర్యమని అంటాను. తీర్థంకర భగవానుల సమయంలో బ్రహ్మచర్యం వలన వచ్చే ఫలితం ఏదైతే ఉందో అదే ఫలితం మీకు ప్రాప్తిస్తుందని నేను గ్యారెంటీ ఇస్తున్నాను.

**ప్రశ్నకర్త :** ఏకపత్నీ వ్రతం అన్నారు, అది సూక్ష్మంగానా లేక స్థూలంగానా? మనసు పోతుంది కదా!

**దాదాశ్రీ :** సూక్ష్మంగానూ ఉండాలి, ఒకవేళ మనసు పోతే, ఆ మనసుతో విడిగా ఉండాలి, అందుకు ప్రతిక్రమణ చేస్తూవుండాలి. మోక్షానికి ఏమిటి లిమిట్? ఏకపత్నీ వ్రతం, ఏకపతివ్రతం.

నువ్వు సంసారివైతే, నీ హక్కులోని విషయాన్ని భోగించు కానీ *అణహక్క్* విషయాన్ని భోగించ వద్దు. ఎందుకంటే, దాని ఫలితం భయంకరంగా ఉంటుంది.

హక్కుని కాకుండా ఇతరమైన చోట విషయ భోగం చేసినట్లయితే, ఆ స్త్రీ ఎక్కడెక్కడకు పోతుందో మీరు కూడా అక్కడ జన్మ తీసుకోవలసివస్తుంది. ఈ కాలంలో బయటైతే అన్ని చోట్లా ఇలాగే జరుగుతోంది. జన్మ ఎక్కడ వస్తుందన్నది తెలియదు. *అణ్‌హక్క్* విషయాన్ని భోగించినవారికి భయంకరమైన యాతనలను అనుభవించవలసివస్తుంది. ఒకటీఅరా జన్మల తర్వాత అతని కూతురు కూడా చరిత్రహీనురాలౌతుంది. నియమం ప్రకారం, ఎవరితోనైతే *అణ్‌హక్క్* విషయ భోగం జరిగిందో, ఆమే తల్లి లేక కూతురుగా వస్తుంది. *అణ్‌హక్క్* ది తీసుకోవటం వలన మనిషితత్వం మారిపోతుంది. *అణ్‌హక్క్* విషయం భయంకర దోషం అనిపించుకుంటుంది. మీరు ఇతరులను భోగిస్తే ఇతరులు మీ కూతురుని భోగిస్తారు.

మీరు వేరే ఎవరినీ భోగించకపోతే మీ కూతురుని వేరే వాళ్ళు ఎవరూ భోగించరు, ఆ చింతే అవసరం లేదు కదా!

*అణ్‌హక్క్* విషయంలో ఎప్పుడూ కషాయం ఉంటుంది, కషాయం ఉండటం వలన  నరకంలోకి పోవలసివుంటుంది. కానీ ఇది మనుషులకు అర్థం కాదు. అందువలన భయపడరు. ఏ విధమైన భయమూ ఉండదు. ఇప్పుడీ మనిషి జన్మ, పోయిన జన్మలో మంచి చేసిన ఫలితం.

విషయం ఆసక్తి వలన ఉత్పన్నమౌతుంది, దాని నుంచి వికర్షణ వస్తుంది. వికర్షణతో వైర బంధం ఏర్పడుతుంది. వైరం అనే ఫౌండేషన్ మీదనే ఈ జగత్తు నిలిచివుంది.

లక్ష్మీ (డబ్బు) వలన వైర బంధం ఏర్పడుతుంది. అహంకారం వలన వైర బంధం ఏర్పడుతుంది. కానీ ఈ విషయం వలన కలిగే వైరం విషతుల్యం అవుతుంది.

ఈ విషయంలో నుంచే చరిత్రమోహం పుడుతుంది. అది జ్ఞానం మొదలైనవాటిని ఎగరగొడుతుంది. అంటే ఇప్పటి వరకు విషయం వలనే అదంతా ఆగి వుంది. మూలం విషయం ఉంది, మరి దాని వలన డబ్బు మీద రాగం ఏర్పడింది, దాని వలన అహంకారం వచ్చింది. అంటే మూలవిషయం పోతే, అంతా పోతుంది.

**ప్రశ్నకర్త :** అంటే బీజాన్ని కాల్చివేయటం రావాలి. కాని దాన్ని ఎలా కాల్చాలి?

**దాదాశ్రీ :** అది మీ ప్రతిక్రమణతో, ఆలోచన, ప్రతిక్రమణ, ప్రత్యాఖ్యానంతో.

**ప్రశ్నకర్త :** అదే. వేరే ఉపాయం లేదా?

**దాదాశ్రీ :** వేరే ఏ ఉపాయమూ లేదు. తపం చేస్తే పుణ్య బంధం ఏర్పడుతుంది, బీజాన్ని కాల్చివేసేందుకు నిరాకరిస్తుంది. సమభావంతో తీసివేసే నియమం ఏం చెప్తుందంటే, నువ్వు ఏదో విధంగా వైర బంధం ఏర్పడకుండా చూసుకోమంటుంది. వైరం నుంచి విముక్తులవండి.

**ప్రశ్నకర్త :** ఇందులో వైర బంధం ఎలా ఏర్పడుతుంది? అనంత కాలం నుంచి వైర బీజం పడుతుంది, అది ఎలా?

**దాదాశ్రీ :** అదెలా అంటే, చనిపోయిన మగవాడు లేక చనిపోయిన స్త్రీలో మందులను నింపామనుకోండి. పురుషుడు పురుషుడిలా, స్త్రీ స్త్రీలా ఉండేటట్లుంటే నష్టమేమీ లేదు. వాళ్ళతో వైర బంధం ఏర్పడదు. ఎందుకంటే వాళ్ళు జీవించి లేరు గనక. కానీ ఆమె జీవించే ఉన్నది. కనుక ఇక్కడ వైర బంధం ఏర్పడుతుంది.

**ప్రశ్నకర్త :** అది ఎందువలన ఏర్పడుతుంది?

**దాదాశ్రీ :** అభిప్రాయంలో ఉన్న భిన్నత్వం వలన. మీరు, 'ఇప్పుడు సినిమా చూడటానికి పోవాలి' అంటే ఆమె, 'కాదు నాటకం చూడటానికి పోదాం' అంటుంది. అంటే, టైమింగ్ కలవటంలేదు. ఒకవేళ ఎగ్జాక్ట్ టైమింగ్‌తో టైమింగ్ కలిసినట్లయితేనే పెళ్ళి చేసుకోండి.

అదేమిటంటే, ఈ రకంగా ఆధారపడి ఎంత సుఖాన్నయితే పొందారో, అదంతా అప్పు తీసుకున్న సుఖం, లోన్ మీద! ఆ లోన్ రి పే (తిరిగి ఇవ్వటం) చెయ్యవలసివుంటుంది.

ఆత్మతో సుఖం తీసుకోకుండా పుద్గల్‌తో సుఖాన్ని కోరుకున్నారు మీరు. ఆత్మపరమైన సుఖమైతే అందులో తప్పు లేదు. కానీ, పుద్గల్ దగ్గర బిచ్చమడుకున్నారే, దాన్ని తిరిగివ్వవలసి వుంటుంది. అది లోను. ఎంత తియ్యదనం ఉంటుందో, అందులో అంతే చేదుని కూడా అనుభవించవలసి వుంటుంది. పుద్గల్ నుంచి తీసుకున్నారు కనుక, పుద్గల్‌కే తిరిగి చెల్లించవలసి వుంటుంది.

నాతో ఎంతో మంది అంటూవుంటారు, 'నానుంచి విధేయత ఆశిస్తుంది' అని. అప్పుడు నేను, 'నీ ప్రభావం పోయింది. మరేం చేయిస్తుంది?' అంటాను. అర్థం చేసుకో ఇప్పటికైనా, ఇప్పటికైనా యోగివి అయిపో. ఇప్పుడు వాళ్ళని ఎలా చేరుకోగలను? ఈ ప్రపంచాన్ని ఎలా చేరుకోగలను?

ఒకామె తన భర్తతో నాలుగుసార్లు సాష్టాంగం చేయిస్తుంది. అప్పుడు ఒకసారి ముట్టుకోనిస్తుంది. అరె, దాని బదులు ఇతను సమాధి తీసుకుంటే ఏమిటి తప్పు? సముద్రంలో సమాధి తీసుకుంటే సముద్రం తిన్నగానే ఉంది. గొడవే లేదు. దీని కోసం నాలుగుసార్లు సాష్టాంగం!

**ప్రశ్నకర్త :** పూర్వ జన్మలో నేను ఆమెని తగిలితే, ఈ జన్మలో ఆమె నన్ను తగిలింది. కానీ, దానికో దారి వెతుక్కోవాలి కదా. సొల్యూషనైతే వెతకాలి కదా?

**దాదాశ్రీ :** దానికి సొల్యూషన్ ఉంటుంది కానీ, మనుషుల మనోబలం ఇంకా పెరగ లేదు.

విషయ భాగాన్ని లేకుండా చేస్తే అంతా లేకుండా పోతుంది. దాని మీద సదా కీచులాట నడుస్తుంటుంది.

**ప్రశ్నకర్త :** ఇప్పుడు దీన్ని ఎలా చెయ్యాలి? ఎలా లేకుండా చేయాలి?

**దాదాశ్రీ :** విషయాన్ని జయించాలి.

**ప్రశ్నకర్త :** విషయాన్ని జయించటానికే మేము మీ శరణులోకి వచ్చాము.

**దాదాశ్రీ :** ఎన్ని సంవత్సరాల నుంచి విషయం? వృద్ధాప్యం వచ్చింది అయినా విషయం? ఎప్పుడుబడితే అప్పుడు విషయం, విషయం, విషయం!

**ప్రశ్నకర్త :** విషయాలను నిలిపివేసిన తర్వాత కూడా దెబ్బలాటలు ఆగటం లేదు. అందుకే మేము మీ చరణాల దగ్గరకు వచ్చాము.

**దాదాశ్రీ :** అలా జరగనేజరగదు. విషయం ఆగిపోయినప్పుడు, అక్కడ నేను చూసాను, ఏయే మగవాళ్ళు మానసికంగా ధృఢంగా ఉంటారో వాళ్ళ మాట ప్రకారమే స్త్రీ నడుచుకుంటుంది.

ఆమెతో విషయాన్ని నిలిపివేసే కంటే వేరే ఉపాయమేమీ దొరకనే దొరకదు. ఎందుకంటే ఈ ప్రపంచంలో రాగద్వేషాలకు మూల కారణమే విషయం. మౌలికమైన

కారణం కూడా ఇదే. ఇక్కడి నుంచి అన్ని రాగద్వేషాలూ జన్మించాయి. సంసారమంతా దాని మీదే నిలిచింది. అందువలన సంసారాన్ని నిలిపివేయాలంటే ఇక్కడి నుండే (విషయాన్ని) నిలిపివేయాలి.

క్లేశం వద్దనుకునేవాళ్ళు, క్లేశ పక్షం తీసుకోనివాళ్ళకి క్లేశం వస్తునేవుంటుంది. కాని అవి నెమ్మది నెమ్మదిగా చాల తగ్గిపోతాయి. క్లేశాలుండాలని ఎవరైతే నమ్ముతున్నంత వరకు క్లేశాలు పెరిగిపోతాయి. మనం క్లేశాల పక్షం తీసుకోగూడదు. క్లేశాలు వద్దేవద్దు అని ఎవరైతే నిశ్చయించుకుంటారో, వాళ్ళకి క్లేశాలు అతి తక్కువగా వస్తాయి. క్లేశాలున్న చోట భగవాన్ నిలుచోడు కూడా నిలుచోడు కదా!

డబల్ బెడ్ సిస్టమ్ ఎత్తేయి. సింగల్ బెడ్ సిస్టమ్ ఉండనీ. అందరూ అంటుంటారు 'డబల్ బెడ్ తయారుచేయి డబల్ బెడ్...' అని. పూర్వం భారతదేశంలో ఇలా నిద్రపోయేవారు కాదు. ఏ క్షత్రియుడూ కూడా. క్షత్రియులు చాల నిష్టగా ఉంటారు. వైశ్యులు కూడా. బ్రాహ్మణులు కూడా అలా నిద్రపోరు. మనుషులెవరూ కూడా. చూడు ఎంత విచిత్రమైన కాలం వచ్చిందో!

హీరా బా తో నా విషయం నిలిచిపోయిన తర్వాత నుంచి ఆమెని 'హీరా బా' అని పిలుస్తున్నాను. ఆ తర్వాత పెద్దగా కష్టమేమీ కలుగలేదు మాకు. అంతకు ముందు ఉండేది, విషయంతో ఉన్న కారణంగానే. సంగంలో చిలకా గోరింక ఆటల్లా ఉండేది కొద్దో గొప్పో. కాని అది చిలకా గోరింకలాటే. చూసేవాళ్ళకి అనిపిస్తుంది, చిలకా గోరింకల మధ్య దెబ్బలాడు జరుగుతున్నదని. కానీ అదంతా ఆటే. విషయం కాటు వేస్తున్నంతవరకు అది పోదు. ఆ కాటువేయటం ఆగిపోయిన తర్వాతనే పోతుంది. నేను నా స్వీయ అనుభవాన్ని చెప్తున్నాను. ఇది నా సొంత జ్ఞానం. అందుకు కారణాలు సరిగ్గా ఉన్నాయి. అలాకాకుండా జ్ఞానం లేకుండావుంటే కాటేస్తూనేవుంటుంది. ఆ సమయంలో అహంకారం ఉండేది కదా! అందులో అహంకారంలో ఒక భాగం భోగం అవుతుంది, 'అతను నన్ను అనుభవించాడు' అని. ఆమె అంటుంది, 'అతను నన్ను అనుభవించాడు' అని. మరి ఇక్కడ (జ్ఞానం లభించిన తర్వాత) తీసేయటం జరుగుతుంది. అయినా ఆ డిశ్చార్జ్ (తీసేసింది) కీచులాటైతే మిగిలే పోతుంది. మాకైతే ఆ కీచులాట కూడా ఉండేది కాదు. అలాంటి ఏవిధమైన అభిప్రాయ భేదాలుండేవి కావు.

విజ్ఞానం ఉంది చూడు! ప్రపంచంలోని జగడాలు ఆగిపోతాయి. భార్యతో జగడమే కాదు, ప్రపంచం మొత్తంతోను జగడాలు ఆగిపోతాయి. ఈ విజ్ఞానమే అలాంటిది. జగడాలు ఆగిపోయాయంటే ముక్తి చెందినట్లు.

## [24] ఋణానుబంధాల రహస్యం

పెళ్ళనేది చాల పెద్ద బంధం. గేదెని దొడ్లో కట్టేసినట్లే ఉంటుంది. ఇందులో ఇరుక్కోపోతే ఉత్తమం. ఇరుక్కున్న తర్వాత అందులోంచి బయటపడితే అధిక ఉత్తమం. లేదంటే చివరకు పండు రుచి చూసిన తర్వాత బయటకు వెళ్ళిపోవాలి. ఇకపోతే ఆత్మ, ఎవరికీ భర్త, భార్య, ఆడ మగ, కూతురు అవదు. కేవలం అన్ని కర్మలూ పూర్తవుతున్నాయి. ఆత్మలో ఎటువంటి మార్పూ ఉండదు. ఆత్మ ఆత్మే, పరమాత్మ కూడా. మన భార్య అని మనం అనుకుంటున్నామంతే.

పక్షి అందమైన గూడు కట్టుకుంటుంది. అయితే దానికి ఎవరు నేర్పారు? సంసారం నడపటం దానంతటదే వచ్చేస్తుంది. ఆ, స్వరూప జ్ఞాన ప్రాప్తి కోసం పురుషార్థం చేయటం అవసరమే. సంసారం నడిపేందుకు ఏమీ చేయవలసిన పనే లేదు. మనిషి స్వయంగా కావలసినదాని కంటే ఎక్కవే తెలివైనవాడు. ఈ పశు, పక్షులకు భార్యాపిల్లలు లేరా? వాటికి పెళ్ళిళ్ళు చేయాలా? ఈ మనుషులకే భార్యా పిల్లలుంటారు, పెళ్ళి చేయవలసి వుంటుంది.

ఈ ఆవులు, గేదెలు కూడా పెళ్ళి చేసుకుంటాయి. పిల్లలు వగైరా అంతా ఉంటుంది. కానీ అక్కడ పతి అనేవాడు ఉంటాడా? అవి కూడా మామ అవుతాయి, అత్త అవుతాయి కానీ, అవి తెలివిగల వాళ్ళలా వ్యవస్థనొకదాన్ని పెట్టుకోలేదు. ఏదైనా అంటుందా నేను ఈమె మామని అని? అయినా వ్యవహారమంతా మనలాగానే ఉంటుంది కదా? అది కూడా పాలు తాగిస్తుంది, దూడను నాకుతుంది కదా! మనం తెలివిగల వాళ్ళం అలా నాకం.

మీరు స్వయంగా శుద్ధాత్మ, ఈ వ్యవహారమంతా పైపైదే అంటే, 'సూపర్‌ఫ్లువస్' గా చేసేది. స్వయంగా 'హోమ్ డిపార్ట్‌మెంట్' లో ఉండాలి, 'ఫారిన్' లో 'సూపర్‌ఫ్లువస్'

గా ఉండాలి. 'సూపర్‌ఫ్లువస్' అంటే తన్మయాకార వృత్తి లేనిది, కేవలం 'డ్రామాటిక్' అయినది. కేవలం 'డ్రామా' ఆడాలి. డ్రామాలో నష్టమొచ్చినా నవ్వాలి, లాభమొచ్చినా నవ్వాలి. 'డ్రామా' లో అభినయం చేయవలసివుంటుంది. నష్టం వచ్చినా అలాగే చూపించవలసివుంటుంది. నోటితో తప్పకుండా అంటారు, భారీ నష్టం వచ్చింది అని. కానీ లోపల తన్మయాకారమవరు. మనం 'లటక్తీ సలామ్' (కుడిచేతితో నుదుటి మీద తట్టుతూ చేసే ముస్లింల అభివాదన) చేయాలి. చాలమంది అంటారు కదా, 'భాయ్, ఇతనితో నా సంబంధం లటక్తీ సలామ్ వంటిది' అని. ప్రపంచంలో అందరితోనూ అలాగే వుండాలి. ప్రపంచమంతటితోనూ లటక్తీ సలామ్ సంబంధం పెట్టుకోవటం వచ్చినవారు, జ్ఞాని అయిపోతారు. ఈ శరీరంతో కూడా 'లటక్తీ సలామ్'! నేను అందరితో ఎల్లప్పుడూ 'లటక్తీ సలామ్' సంబంధంతో ఉంటాను. అయినా అందరూ అంటారు, 'మీరు మాపట్ల ఎంతో మంచి భావంతో ఉంటారు' అని. నేను అన్ని వ్యవహారాలనూ చేస్తాను కాని, ఆత్మలో ఉండి!

**ప్రశ్నకర్త :** భార్య చేసిన పుణ్యం వలనే భర్త పనులు నెరవేరుతాయా? భార్య పుణ్యం వలనే డబ్బు, అంతా మంచి జరుగుతుంది అంటారు కదా, అలా జరుగుతుందా?

**దాదాశ్రీ :** అదేమిటంటే, ఎవరైనా తన భార్యని కొడుతున్నట్లయితే, అతనికి నచ్చచెప్పే దిశగా, అరె, నీ భార్య అదృష్టం చూడు, ఎందుకు ఆమె మీద అలా అరుస్తున్నావు? నువ్వు తినేదంతా ఆమె చేసుకున్న పుణ్యం వలనే అని అంటారు. అలా మొదలైంది. ప్రతి జీవీ తన పుణ్యంలోంచే తింటారు. మీకు అర్థమైంది కదా? ఇవన్నీ చెప్తేనే కదా దారిలోకి వచ్చేది! అందరూ తమ తమ పుణ్యంతోనే భోగిస్తారు, తన పాపం కూడా స్వయంగానే అనుభవిస్తారు. ఇందులో మరెవరితోనూ ఇచ్చిపుచ్చుకునేదేమీ ఉండదు. ఇందులో లేశమాత్రమైనా సందేహం లేదు.

**ప్రశ్నకర్త :** ఏదైనా శుభకార్యం జరుపుతున్నపుడు, మగవాడు దానం ఇచ్చేటప్పుడు అందులో స్త్రీ సహకారం కూడా ఉంటే ఇద్దరికీ ఫలితం ఉంటుందా?

**దాదాశ్రీ :** ఆ, ఉంటుంది కదా! చేసేవాళ్ళు, సహకరించేవారు లేక కర్త చేసే పనిని ఆమోదించేవాళ్ళు వీళ్ళందరికీ పుణ్యం లభిస్తుంది. ముగ్గురికీ, చేసేవారికి, చేయించేవారికి, ఆమోదించేవారికి పుణ్యం లభిస్తుంది. మీరెవరికైనా, ఇది చేయండి అని చెప్పారనుకోండి, అది చెయ్యవలసిన పనైతే, మీరు చేయించినవారు అనబడతారు. మీరు చేసేవారు, మీ పత్ని దాన్ని విరోధించకపోతే, ఆమె ఆమోదించేది అవుతుంది. అందరికీ పుణ్యం లభిస్తుంది. కాని, చేసేవారి భాగంలో యాభై శాతం, మిగిలిన యాభై శాతంలో మిగతా ఇద్దరికీ పంచబడుతుంది.

**ప్రశ్నకర్త :** పూర్వ జన్మ ఋణానుబంధం నుంచి విముక్తులవటానికి ఏం చెయ్యాలి?

**దాదాశ్రీ :** మీకు ఎవరితోనైతే పూర్వ జన్మ ఋణానుబంధం ఉందో, మీకది ఇష్టమే లేకపోతే, అతని సహచర్యం ఇష్టం లేకపోయిప్పటికీ అతని సహచర్యంలో ఉండవలసివస్తే, అప్పుడేం చేస్తారు? అతనితో బాహ్యంలో చేసే వ్యవహారం తప్పక సాగించాలి కాని, లోపల అతని పేరుతో ప్రతిక్రమణ చేయాలి. మనం పూర్వ జన్మలో అతిక్రమణ చేసాం కనుక, దాని పరిణామమే ఇది. ఏం కాజెస్ చేసారు? అతనితో అతిక్రమణ చేసారు పూర్వజన్మలో, దాని ఫలితమే వచ్చింది అని చెప్తారు. కనుక, అందుకు ప్రతిక్రమణ చేసినట్లయితే అది నశించి పోతుంది.

కనుక, క్షమాపణ కోరుకో. క్షమాపణ కోరుతూనేవుండు, నేను చేసిన తప్పుకి నేను క్షమాపణ కోరుతున్నాను అంటూ. ఎవరైనా భగవంతుని సాక్షిగా క్షమాపణ కోరు. అప్పుడిక అంతా పోతుంది. లేకపోతే ఏమౌతుందంటే, వాళ్ళ పట్ల ఎక్కువగా దోష దృష్టితో చూసినట్లయితే, అంటే ఎవరైనా మగవాడు లేక స్త్రీ ని అపరాధులుగా చూసినట్లయితే, వారి పట్ల తిరస్కార భావం పెరుగుతుంది, తిరస్కారం వలన భయం కలుగుతుంది. మీకు ఎవరి పట్లయితే తిరస్కారం ఉంటుందో వారి వలన మీకు భయం కలుగుతుంది. వాళ్ళను చూస్తూనే మీకు గాభరా కలుగుతుంది. అది తిరస్కారం వలనేనని తెలుసుకో. కనుక తిరస్కారాన్ని వదిలేయటానికి మీరు లోపల క్షమాపణ కోరుతుండాలి. రెండే రోజులలో తిరస్కారం పోతుంది. అతనికి తెలియదు. మీరు

లోపలే అతని పేరుతో క్షమాపణ కోరుతుండండి అతని పట్ల చేసిన ఒక్కో అపరాధానికి, ‘హే భగవాన్, నేను క్షమాపణ కోరుతున్నాను. ఇది నా దోషానికి కలిగిన పరిణామం’. ఏ మనిషి పట్ల ఏయే అపరాధాలు చేసారో, అందుకు లోపల భగవాన్‌ని క్షమాపణ కోరుతుండండి. అప్పుడది కడిగివేయ బడుతుంది.

**ప్రశ్నకర్త :** ధర్మ మార్గంలో పోవటానికి మనం ఇల్లు, సంసారం వదిలిపెట్టవలసి వుంటుంది. ధర్మకార్యాలకు అది మంచిదే, కానీ ఇంట్లో వాళ్ళకి దు:ఖం కలిగించి, తన కోసం ఇల్లు, సంసారం వదిలిపెట్టేస్తే అది మంచిపని అనిపించుకుంటుందా?

**దాదాశ్రీ :** లేదు. ఇంట్లోవాళ్ళ బాకీ తీర్చేయాలి. వాళ్ళందరితోనూ లెక్కలూ తేల్చిన తర్వాత, వాళ్ళు సంతోషం ‘మీరు వెళ్ళండి’ అంటే అప్పుడే అభ్యంతరమూ లేదు. కానీ వాళ్ళకి దు:ఖం కలిగించే విధంగా చేయగూడదు. ఎందుకంటే ఆ అగ్రిమెంటుకి భంగం కలిగించగూడదు కనుక.

**ప్రశ్నకర్త :** భౌతిక ప్రపంచాన్ని వదిలేయాలనే కోరిక కలిగితే ఏం చెయ్యాలి?

**దాదాశ్రీ :** భౌతిక ప్రపంచంలోకి రావాలనే కోరిక ఉండివుంటుంది కదా ఒక రోజు?

**ప్రశ్నకర్త :** అప్పుడు జ్ఞానం లేదు. ఇప్పుడు జ్ఞానం లభించింది కనుక, అందులో తేడా ఉంటుంది.

**దాదాశ్రీ :** ఆ, అందులో తేడా వస్తుంది కాని, అందులోకి ప్రవేశించావు కనుక బయటికి వెళ్ళే మార్గాన్ని అన్వేషించాలి. ఒట్టిగా పారిపోగూడదు.

**ప్రశ్నకర్త :** రోజులు తగ్గిపోతున్నాయి.

**దాదాశ్రీ :** ‘నాది’ అనుకుని చనిపోతారు. నిజానికి ‘నాది’ అనేదేమీ లేదు. ఆమె ముందు పోతే మనం ఒంటరిగా మిగిలిపోతాం. నిజమైతే ఇద్దరూ ఒకేసారి పోవాలి కదా? ఒకవేళ పతి వెనకే సతి సహగమనం చేసినా, ఆమె ఏ దారిలో

పోయిందో, పతి ఏ దారిలో పోయాడో కదా? అందరికీ వారి వారి కర్మలను అనుసరించి వారి గతి వుంటుంది. కొందరు జంతువులలోకి పోతారు, కొందరు మనుషులలోకి పోతారు. కొందరు దేవగతిలోకి పోతారు. అందులో సతి, నేను మీతోపాటే మరణిస్తే నేను మళ్ళీ మీతోపాటే జన్మిస్తాను అంటే అర్థం లేదు. అదంతా పిచ్చితనం. పతి–పత్ని అనేదేమీ లేదు. ఈ వ్యవస్థను కొందరు తెలివైనవారు తయారుచేసారు.

**ప్రశ్నకర్త :** ఏ విధమైన తగువులుకాని లేకపోతే, మరు జన్మలో మళ్ళీ కలిసి జీవించవచ్చని భాయ్ అంటాడు.

**దాదాశ్రీ :** ఈ జన్మలోనే ఉండలేరు. ఈ జన్మలోనే డైవర్స్ అయిపోతుంది, మరు జన్మ గురించి ఏం మాట్లాడుతున్నావు? అలాంటి ప్రేమ ఏమీ లేదు.
తర్వాత జన్మలో కూడా ప్రేమ కావాలనుకునేవారికి క్లేశాలే ఉండగూడదు. అది ఈజీ లైఫ్ (సరళమైన జీవితం) అవుతుంది. ప్రేమమయమైన జీవితం అవుతుంది. తప్పులే కనపడవు. తప్పులు చేసినా కనపడనంత ప్రేమ ఉంటుంది.

**ప్రశ్నకర్త :** ఒకవేళ అటువంటి ప్రేమమయమైన జీవితం ఉంటే, మరి తర్వాత జన్మలో వాళ్ళు తిరిగి కలుస్తారా లేదా?

**దాదాశ్రీ :** ఆ, కలుస్తారు. అటువంటి జీవితం ఉన్నవారైతే కలుస్తారు. జీవితమంతా క్లేశాలే లేకుండా ఉంటే కలుస్తారు.

## [25] ఆదర్శ వ్యవహారం, జీవితంలో....

**దాదాశ్రీ :** జీవితాన్ని ఎలా సరిదిద్దుకోవచ్చు?

**ప్రశ్నకర్త :** సత్యమార్గంలో నడిచి.

**దాదాశ్రీ :** ఎన్ని సంవత్సరాల వరకు సరిచేసుకోవాలి? జీవితాంతం, ఎన్ని సంవత్సరాలు, ఎన్ని రోజులు, ఎన్ని గంటలు, ఎలా సరిచేసుకుంటావు అవన్నీ?

**ప్రశ్నకర్త :** నాకు తెలియదు.

**దాదాశ్రీ :** ఆ. అందుకే సరిదిద్దుకోలేరు. వాస్తవానికి రెండే రోజులను సరిచేసుకోవాలి. ఒక వర్కింగ్ డే (పని దినం), ఒక హాలీడే (సెలవు దినం). రెండే రోజులను సరిచేసుకోవాలి, ఉదయం నుంచి సాయంత్రం వరకు. రెండిటిలో పరివర్తన వస్తే అన్నిటిలో పరివర్తన వస్తుంది. రెండిటికీ సెటింగ్ చేస్తే ప్రతి రోజు అలాగే నడుస్తుంది. అదే విధంగా నడిచినట్లయితే, అంతా సరియైపోతుంది. పెద్ద పరివర్తన చేయవలసిన అవసరమేమీ లేదు. వీళ్ళంతా ప్రతిరోజూ పరివర్తన తీసుకునిరారు. ఈ రెండిటి సెటింగ్ చెయ్యాలి. ఈ రెండు రోజులను వ్యవస్థీకరిస్తే, అన్ని రోజులూ అందులోకి వచ్చేస్తాయి.

**ప్రశ్నకర్త :** ఆ వ్యవస్థీకరణను ఎలా చెయ్యాలి?

**దాదాశ్రీ :** ఏం? పొద్దున్నే లేస్తే, లేవగానే భగవాన్‌ని స్మరణ రోజు చేసుకుంటావు కదా, అది చెయ్యి. ముందుగా పొద్దున్నే లేచే రివాజు పెట్టుకోవాలి. ఎందుకంటే, మనుషులు సుమారు ఐదు గంటలకు నిద్ర లేవాలి. ఒక అరగంట సేపు ఏకాగ్రతలో గడపాలి. ఎవరైనా ఇష్టదైవం లేక ఎవరినైనా భక్తితో గంటో అరగంటో కొలవాలి. అటువంటి పద్ధతిని పెట్టుకోవాలి. ఇక ప్రతిరోజూ అలాగే నడుస్తుంది. తర్వాత లేచి బ్రష్ మొదలైన పనులు చేసుకోవాలి. బ్రష్ చేసుకోవటంలో కూడా పద్ధతిని ఏర్పాటు చేసుకోవాలి. మీరే స్వయంగా బ్రష్‌ని తీసుకోవాలి. అన్నీ స్వయంగా చేసుకోవాలి. వేరేవాళ్ళకి చెప్పగూడదు. ఒకవేళ ఆరోగ్యం బాగోలేకపోతే అది వేరు. టీ గట్రా వస్తే కలహం పెట్టుకోకుండా, ఏది ఇస్తే అది తాగాలి. తాగిన తర్వాత ఆమెతో, కాస్త పంచదార తక్కువ పడింది, రేపటి నుంచి కాస్త ఎక్కువ వేయి అనండి. ఆమెతో చెప్పాలి కాని గొడవ పడవద్దు. టీతో పాటు పలహారం ఏదైనా తినాలంటే తిని, భోజనం చేసి జాబ్ మీద వెళ్ళిపోవాలి. అలా భోజనం చేసి జాబ్ మీద పోయిన తర్వాత అక్కడ బాధ్యతలను నెరవేర్చాలి.

ఇంట్లో కలహించకుండా వెళ్ళండి. జాబ్ అయిపోయన తర్వాత తిరిగి వచ్చి, ఒకవేళ జాబ్‌లో బాస్‌తో ఏమైనా గొడవ జరిగినట్లయితే, దాన్ని దారిలోనే

శాంతింపజేయాలి. ఈ బ్రైన్ (మెదడు) చెక్ నట్‌లను బిగించాలి, ఒకవేళ అది రోజూ (వేడెక్కటం) జరుగుతుంటే. ప్రశాంతంగా ఇంటికి వెళ్ళండి. అంటే, ఇంట్లో ఏమీ గొడవ పెట్టుకోకండి. బాస్‌తో దెబ్బలాడినట్లయితే, అందులో పాపం భార్యదేం దోషం? మీ బాస్‌తో గొడవ జరుగుతుందా లేదా?

**ప్రశ్నకర్త :** జరుగుతుంది.

**దాదాశ్రీ :** అందులో మరి భార్యదేం దోషం? అక్కడ దెబ్బలాడి వచ్చినట్లయితే భార్య అర్థం చేసుకుంటుంది, ఈ రోజు మంచి మూడ్‌లో లేరు అని. మంచి మూడ్‌లో ఉండరు కదా?

**ప్రశ్నకర్త :** ఔను.

**దాదాశ్రీ :** అంటే ఇలాంటి వ్యవస్థని ఒక రోజు ఏర్పాటు చేసుకో, వర్కింగ్ డే ది, ఒక హాలీడేది. రెండే రకాల రోజులు వస్తాయి. మూడవ రకం రానేరాదు కదా? అందువలన రెండు రోజుల వ్యవస్థను తయారుచేసుకుని, దానికి అనుగుణంగా నడుస్తుండాలి తర్వాత.

**ప్రశ్నకర్త :** మరి సెలవు రోజున ఏం చెయ్యాలి?

**దాదాశ్రీ :** సెలవు రోజున నిశ్చయించుకోవాలి, ఈ రోజు సెలవు రోజు కనుక, ఈ రోజు పిల్లలు, వైఫ్, అందరికీ ఎక్కడికైనా తిరిగిరావటానికి ఉండదు కనుక ఈ రోజు భోజనం తర్వాత బయట తిప్పి తీసుకుని వస్తాను అని. తర్వాత, తిరిగి రావటానికి అయ్యే ఖర్చుని చూసుకోవాలి, హాలీడే నాడు ఇంతే ఖర్చు చేయాలి అని. ఏరోజైనా ఎక్కువ ఖర్చు పెట్టవలసివస్తే బడ్జెట్ తయారుచేసుకోవాలి, లేకపోతే ఇంతే ఖర్చు పెట్టాలి అని. ఇవన్నీ నిర్ణయించుకోవాలి మీరు. వైఫ్ కూడా నిర్ణయించుకునేటట్లుగా చేయాలి మీరు.

**ప్రశ్నకర్త :** ఇంట్లో పూరన్‌పూరీ (తియ్యని రొట్టె) తినాలి అంటారాయన. పిజ్జా తినటానికి బయటకు పోవద్దు.

**దాదాశ్రీ :** ఆనందంగా పూరన్‌పూరీని తిను. అందరూ తినండి. పకోడి తినండి, జిలేబీ తినండి. ఏది కావాలంటే అది తినండి.

**ప్రశ్నకర్త :** కానీ, హోటల్‌లో పిజ్జా తినటానికి వెళ్ళవద్దా.

**దాదాశ్రీ :** పిజ్జా తినటానికా? అదెట్లా తింటాం మనం? మనం ఆర్యులం. మనసు పడితే రెండు మూడుసార్లు తినిపించి తర్వాత నెమ్మది నెమ్మదిగా దాన్ని మాన్పించాలి. నెమ్మది నెమ్మదిగా మానిపించాలి. ఒకేసారి మానేస్తే అది తప్పు అవుతుంది. మీరంతా కలిసి తినండి, నెమ్మది నెమ్మదిగా మానెయ్యండి.

**ప్రశ్నకర్త :** వైఫ్‌కి వండే కోరిక లేకపోతే మనం ఏం చెయ్యాలి?

**దాదాశ్రీ :** మీరు మీ కోరికను మార్చుకోవాలి. ఇంకా ఎన్నో వస్తువులున్నాయి మన దగ్గర. కోరికను మార్చుకో. ఆవాలు, మెంతులతో కూడిన పోపు నచ్చకపోతే నచ్చేటట్లుగా, దాల్చీనీ, మిరియాలతో పోపు పెట్టు. పిజ్జాలో ఏముంది తినటానికి?

అంటే, జీవితమంతా సాఫీగా సాగే ఎలాంటి వ్యవస్థను పెట్టుకో. ఉదయం అరగంట దేవునికి భక్తి కార్యక్రమం పెట్టుకో. ఇక పనంతా బాగా జరుగుతుంది. నీవు జ్ఞానం తీసుకున్నావు కనుక ఇప్పుడు నీవు అర్థం చేసుకోగలవు. కానీ మిగతావాళు ళ్ళ జ్ఞానం తీసుకోనివారు కాస్త భక్తిలో ఉండాలి. నీకంతా బాగా జరుగుతోంది కదా!

ఈ అక్రమ విజ్ఞానం వ్యవహారాన్ని చెడగొట్టదు. ప్రతి ఒక్క జ్ఞానం వ్యవహారాన్ని తిరస్కరిస్తుంది. ఈ విజ్ఞానం వ్యవహారాన్ని కొంచెం కూడా తిరస్కరించదు. తన 'రియాల్టీ' లో సంపూర్ణంగా ఉంటూ, వ్యవహారాన్ని తిరస్కరించదు. వ్యవహారాన్ని తిరస్కరించనిది ఒక సిద్ధాంతం అవుతుంది. సిద్ధాంతమని దేన్ని అంటాము, ఎప్పటికీ అసైద్ధాంతికతను పొందనిదాన్ని, అదే సిద్ధాంతం అనిపించుకుంటుంది. అసైద్ధాంతికత ఉన్న మూల అంటూ ఏమీ లేదు. అంటే ఇది, 'రియల్ సైన్స్', 'కంప్లీట్ సైన్స్'. వ్యవహారాన్ని కించత్‌మాత్రం కూడా తిరస్కరించదు.

ఎవరికీ కూడా ఏమాత్రం దు:ఖం కలిగించనిదాన్ని చివరి 'లైట్' అంటారు. విరోధికి కూడా శాంతి కలుగుతుంది. విరోధి కూడా, 'భయ్, ఇతనికీ నాకు అభిప్రాయ భేదం ఉంది. కాని, అతనిపట్ల నాకు మంచి, భావం, గౌరవం ఉన్నాయి' అంటాడు చివరకు! విరోధులు ఉంటారు. విరోధులు ఎప్పుడూ ఉంటారు. 360 డిగ్రీలది లేక, 356 డిగ్రీలది కూడా విరోధం ఉంటుంది. అలా ఈ అన్నిచోట్లా విరోధమైతే ఉంటుంది. మనుషులంతా ఒకే డిగ్రీలోకి రాలేరు. మనుషులంతా ఒకే ఆలోచనా శ్రేణిలోకి రాలేరు. ఎందుకంటే మనుషుల ఆలోచనా శ్రేణిలో పధ్నాలుగు లక్షల యోనులున్నాయి. చెప్పండి, మనతో ఎంత 'అడ్జస్ట్' అవుతుంది? కొన్నే యోనులు 'అడ్జస్ట్' అవగలుగుతాయి. అన్నీ కాలేవు.

ఇంట్లో వ్యవహారాన్ని అందంగా తీర్చిదిద్దుకోవాలి. 'వైఫ్' మనసులో, ఇలాంటి పతి ఎప్పటికీ దొరకడు అనిపించాలి, భర్త మనసులో, ఇలాంటి 'వైఫ్' కూడా ఎప్పటికీ దొరకదు అనిపించాలి. అలాంటి పద్ధతి ఉండాలి. అప్పుడు మనం సరైనవాళ్ళమౌతాం.

**ప్రశ్నకర్త :** ఆధ్యాత్మికంలో మీ మాటల గురించి ఇక చెప్పనే అక్కర్లేదు. కానీ వ్యవహారికంగా కూడా మీ మాటలు 'టాప్'.

**దాదాశ్రీ :** ఏంటంటే, వ్యవహారంలో 'టాప్' లో అర్థం చేసుకోకుండా మోక్షంలోకి ఎవరూ వెళ్ళనే లేదు. ఎంతమంది ఉన్నా, పన్నెండు లక్షల మంది ఆత్మజ్ఞానులున్నా కాని, వ్యవహారాన్ని అర్థం చేసుకోకుండా ఎవరూ మోక్షం లోకి పోలేదు. ఎందుకంటే, వ్యవహారమే కదా వదిలించేది! అది వదిలిపెట్టకపోతే మీరేం చేస్తారు? మీరు 'శుద్ధాత్మే' సరే కానీ, వ్యవహారం మిమ్మల్ని వదిలిపెడితేనే కదా? మీరు వ్యవహారాన్ని చిక్కుపెడతారు. దానికి వెంటనే పరిష్కారం తేండి మరి!

**-జై సచ్చిదానంద**

## ఇందులో ఉపయోగించిన గుజరాతీ పదాలకు

## తెలుగు సమానార్థాలు

| | |
|---|---|
| అణ్‌హక్క్ | హక్కు లేకుండా |
| ఊపరీ | బాస్, వరిష్ఠ యజమాని |
| ఉపాధి | బయటి నుంచి వచ్చే దుఖాలు |
| భోగవటా | సుఖ దుఖాల ప్రభావం |
| నికాల్ | పరిష్కరించటం |
| చీకనే | గాఢ |
| త్రాగా | తనకి ఇష్టమైనదాన్ని ఒప్పించటానికి ఆడే నాటకం |
| నోంధ్ | అత్యంత రాగం లేక ద్వేషం వలన ఎక్కువ సమయం వరకు గుర్తుంచుకోవటం, నోట్ చేసుకోవటం. |

## శుద్ధాత్మకి ప్రార్థన

హే అంతర్యామీ పరమాత్మా! నీవు నాలో ఉన్నవిధంగానే జీవులందరిలో విరాజమానమై వున్నావు. నీ యొక్క దివ్య స్వరూపమే నా నిజ స్వరూపము. నా నిజ స్వరూపము పవిత్ర ఆత్మ.

హే శుద్ధాత్మ భగవాన్! నేను నీకు అభేదభావముతో అత్యంతభక్తి పూర్వకంగా నమస్కరించుచున్నాను.

అజ్ఞానవశాత్తు నేను చేసిన తప్పులనన్నింటిని ❖ నీ ముందు ఒప్పుకొనుచున్నాను. నేను ఈ తప్పులకు పశ్చాత్తాపం చెందుతూ నీ క్షమకై అర్థిస్తున్నాను. ప్రభూ! దయతో నన్ను క్షమించు, నన్ను క్షమించు, నన్ను క్షమించు. ఆ తప్పులను మరల చేయకుండునట్లు నాకు శక్తిని ప్రసాదించు.

హే శుద్ధాత్మ భగవాన్! మాకు నీతోగల భేద భావము తొలగిపోయి మేమందరము నీతో అభేదతను పొందునట్లు ఆశీర్వదించు. మేము సదా నీతో అభేదతతో తన్మయాకారతను చెందెదము గాక!

(❖ గతంలో నీవు చేసిన తప్పులను గుర్తు తెచ్చుకోవాలి)

## ప్రతిక్రమణ : దివ్యమైన క్షమాపణా విధానము

నేను దాదా భగవాన్ సాక్షిగా ❖...................... యొక్క మనోవచన కాయము కంటె పూర్తిగా వేరైన పవిత్రాత్మకు నమస్కరించుచున్నాను.

నేను నా తప్పులను జ్ఞప్తికి తెచ్చుకొన్నాను (ఆలోచన) ❖❖

ఆ తప్పులకై నేను క్షమాపణ కోరుచున్నాను (ప్రతిక్రమణ)

ఆ తప్పులను మరల చేయనని దృఢముగా నిశ్చయించుకొనుచున్నాను (ప్రత్యాఖ్యాన్)

ప్రియాతి ప్రియమైన దాదాభగవాన్! ఈ దృఢ నిశ్చయమును పాలించు శక్తిని నాకు అనుగ్రహించు.

❖ మీ వలన గాయపడిన వ్యక్తి పేరు

❖❖ ఆ వ్యక్తిపట్ల మీరు ఒనర్చిన దోషాలను గుర్తుచేసుకోవాలి.

# తెలుగులో దాదా భగవాన్ పుస్తకాలు

| | |
|---|---|
| 1. | అన్ని చోట్లా సర్దుబాటు |
| 2. | విభేదాలను తొలగించడానికి |
| 3. | ఎలాగైనా జస్టిస్ జరిగింది |
| 4. | బాధితుడు తప్పిదము |
| 5. | క్రోధం |
| 6. | చింత |
| 7. | నేను ఎవరు? |
| 8. | భావనతో మెరుగుపడతాయి జన్మ-జన్మలు |
| 9. | మృత్యు సమయం దానికి ముందు, దాని తర్వాత... |
| 10. | ఆత్మ సాక్షాత్కారం |
| 11. | మానవ ధర్మం |
| 12. | సేవ, పరోపకారం |
| 13. | ప్రతిక్రమణ |
| 14. | భార్యాభర్తల దివ్య వ్యవహారం |
| 15. | అంతఃకరణ స్వరూపం |

❖ తెలుగులో మరిన్ని పుస్తకాలు జోడించబడుతున్నాయి మరియు త్వరలో అందుబాటులోకి వస్తాయి.

❖ Dada Bhagwan books are available in different languages: Gujarati, Hindi, English, Marathi, Telugu, Kannada, Oriya, Malayalam, Bengali, Punjabi, Assamese, Tamil, German, Spanish, Russian, etc.

❖ 'Dadavani' Magazine is published every month in three languages: Gujarati, Hindi & English.

❖ All Dada Bhagwan books and magazines are also available on online book store : https://store.dadabhagwan.org

# దాదా భగవాన్ ఫౌండేషన్ తెలుగు యూట్యూబ్ ఛానల్




❖ ఇది అడాలజ్ దాదా భగవాన్ ఫౌండేషన్ యొక్క అధికారిక తెలుగు యూట్యూబ్ ఛానెల్.

❖ దిగువ లింక్ నుండి తెలుగు భాషలో సత్సంగ వీడియోలను చూడండి.

**‘Dada Bhagwan Foundation Telugu’ Channel:**

https://dbf.adalaj.org/yttelugu

*Open Link OR*

*Scan QR*

---

*Dada Bhagwan Foundation Youtube video channels are available in other regional languages: Gujarati, Hindi, Marathi, Bengali, Tamil, Telugu, Kannada, Malayalam, Spanish, Portuguese, etc.*

# Persons to Contact

## Dada Bhagwan Foundation

**Adalaj** : **Trimandir**, Simandhar City, Ahmedabad-Kalol Highway
P/O: Adalaj, Dist. Gandhinagar - 382421, Gujarat, India.
Tel: +91-9328661166 / 9328661177
E-mail : info@dadabhagwan.org

**Mumbai** : **Trimandir**, Rushivan, Kajupada, Borivali (E)
Tel: +91-9323528901

| | | | |
|---|---|---|---|
| **Kolkata:** | 9830093230 | **Delhi:** | 9810098564 |
| **Jaipur:** | 9351408285 | **Chennai:** | 7200740000 |
| **Bhopal:** | 9425024405 | **Patna:** | 7352723132 |
| **Indore:** | 9039936173 | **Amravati:** | 9422915064 |
| **Raipur:** | 9329644433 | **Bangalore:** | 9590979099 |
| **Chandigarh:** | 9780732237 | **Hyderabad:** | 9885058771 |
| **Kanpur:** | 9452525981 | **Pune:** | 9422660497 |
| **Bhubaneswar:** | 8763073111 | **Jalandhar**: | 9814063043 |
| **Varanasi:** | 9795228541 | **Sangli:** | 9423870798 |

| | |
|---|---|
| **USA: Dada Bhagwan Vignan Institute**<br>Tel: + 1-877-505-DADA (3232)<br>Email: info@us.dadabhagwan.org | **U.K: Dada Darshan (UK)**<br>Tel: +44 330-111-DADA (3232)<br>Email: info@uk.dadabhagwan.org |
| **Germany** : +49 700 32327474<br>**UAE** : +97 1557316937<br>**Kenya** : +25 4722722063<br>**Dubai** : +971 501364530 | **Australia** : +61 421127947<br>**Singapore** : +65 81129229<br>**New Zealand** : +64 210376434 |

Website : www.dadabhagwan.org



## అవగాహనతో సంసారాన్ని చక్కదిద్దుకోండి

ఈ అక్రమ విజ్ఞానాన్ని చూడు! కేవలం భార్యతోనే కాదు, మొత్తం ప్రపంచంతోనే జగడాలు లేకుండా పోతాయి. ఈ విజ్ఞానమే అలాంటిది. జగడాలు లేవు అంటే మనం ముక్తిచెందినట్లే. మన ఇంట్లో వ్యవహారాన్ని అందంగా చేసుకోవాలి. భార్య మనసులో, ఇంతటి (మంచి) భర్త ఎప్పటికీ దొరకదు అని, భర్త మనసులో, ఇంతటి (మంచి) భార్య ఎప్పటికీ దొరకదు అని అనిపించాలి. అలాంటి పద్ధతిని నెలకొల్పితే మనం సరైన వాళ్ళమని అనిపించుకుంటాం. ఇలాంటి అవగాహన ఫిట్ అయితే, జీవితమంతా చాలా బాగా గడుస్తుంది.

– దాదాశ్రీ

मूल दीपक से प्रकटे दीपमाला

dadabhagwan.org

9 789391 375553

Printed in India

Price ₹85